భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన

# శ్రీ స్కాంద పురాణం






జిల్లెళ్ళమూడి అమ్మ

మాతృశ్రీ అనసూయాదేవి ఆశీస్సులతో...

వచనం : డాక్టర్ జయంతి చక్రవర్తి

ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి.,

ప్రచురణ



శ్రీ బాలాజీ పబ్లికేషన్స్

28-25-32/1, అరండల్‌పేట, ఏలూరురోడ్, విజయవాడ-2

సెల్ : 9441176276 / 9966675815

# శ్రీ స్కాంద పురాణం


| | | |
|---|---|---|
| వచనం | : | డాక్టర్ **జయంతి చక్రవర్తి**<br>విజయవాడ. 9390526272 |
| కాపీరైట్ | : | పబ్లిషర్స్ |
| ప్రథమ ముద్రణ | : | 2014 |
| ముఖచిత్రం | : | రమణ |
| డి.టి.పి. &<br>పేజి లే-అవుట్ | : | విద్యార్థి క్రియేషన్స్<br>విజయవాడ |
| ముద్రణ | : | శ్రీ స్వామి ఆఫ్‌సెట్ ప్రింటర్స్<br>విజయవాడ-3 |
| ప్రచురణ | : | **శ్రీ బాలాజీ పబ్లికేషన్స్**<br>నసురుల్లాఖాన్ వీధి<br>అరండల్‌పేట, విజయవాడ |
| వెల | : | ₹. 60 /- |




ఆర్షవిజ్ఞాన భాండాగారాలైన అష్టాదశ పురాణాలని ఆంధ్రుజాతికి అందించిన శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతి ట్రస్ట్ వారికి, ఆ పురాణాలను అనువదించిన మహారచయితలకి సహస్రాధిక ప్రణామాలు సమర్పిస్తున్నాం.

# భగవాన్ వేదవ్యాస మహర్షి

## వ్యాసగుహ, సరస్వతీ తీరం, బదరీనాథ్



*అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః ।*
*అఫాలలోచనః శంభుర్భగవాన్ బాదరాయణః ॥*

## కృతజ్ఞతలు

అష్టాదశ పురాణాలని సామాన్య జనానికి అందించాలని సంకల్పించిన శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ అధినేత **శ్రీ పుట్టగుంట వీరయ్యచౌదరి (బోస్) గారికి** ముందుగా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ గ్రంథాలకి తమ అమూల్యమైన ఆశీస్సులందించిన శ్రీ పీఠాధిపతులు పరమపూజ్య **శ్రీశ్రీశ్రీ పరిపూర్ణానంద సరస్వతీ స్వామివారికి,** అస్మద్గురువర్యులు ఆర్షవిద్యాసాగర **బ్రహ్మశ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి** సహస్రాధిక వందనాలు సమర్పిస్తున్నాను.

ప్రోత్సహించిన మిత్రులు రోహిత్ ప్రింటర్స్ అధినేత శ్రీ పుప్పాల అప్పారావు గారికి, డా॥ కానుకొల్లు బాలకృష్ణ, వలివేటి శివరామకృష్ణమూర్తి, వేదాంతం సార్వభౌమ, ఉన్నవ గణేష్‌లకి..... అలాగే ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసిన శ్రీమతి వినీల గారికి పేజి మేకింగ్ చేసిన విద్యార్థి క్రియేషన్స్ వారికి ప్రత్యేక అభినందనలు...




Sreepeetam
# 1-9-278/10/1, Lalitha Nagar, Vidyanagar, Hyderabad - 500 044.
Ph: 27076655, M: 098490 33991

# ఆశీస్సులు

డా॥ జయంతి చక్రవర్తి గారు అనేక ఆధ్యాత్మిక రచనల ద్వారా తెలుగు పాఠకులకు సుపరిచితులు. విజయవాడ కనకదుర్గ దేవస్థానం పక్షాన వెలువడుతున్న 'కనకదుర్గ ప్రభ' పత్రికకు ప్రారంభ సంపాదకులుగా ఆయన పేరు తెచ్చుకున్నారు. 'దశ మహావిద్యలు' పుస్తక రచన తరువాత డా॥చక్రవర్తి గారు అష్టాదశ పురాణాలను తెలుగు పాఠక ప్రపంచంలోకి లోతుగా తీసుకువెళ్లాలని సంకల్పించారు. ఒక్కొక్క పురాణ సారాంశాన్ని ఒక్కొక్క చిన్న పుస్తకంగా విడుదల చేయాలన్న ఆ రచయిత సంకల్పం ప్రశంసనీయం.

ఈ చిన్నిపొత్తాలు పాఠకులందరికీ ప్రయోజనకరంగా, సదుపాయకరంగా ఉంటాయి. వీటి ఉపయోగాన్ని పాఠకులందరూ అందిపుచ్చుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.



స్వామి పరిపూర్ణానంద

**జయ వత్సరం, శ్రావణ పూర్ణిమ**

**(10.8.2014)**

"ఆర్షవిద్యాసాగర", "మధురభారతి"
మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



దూరవాణి : 81061 96418

301, శ్రీ సాయి ఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీధి, లక్ష్మీనగర్
సత్యనారాయణపురం, విజయవాడ-520011



తేది : 19-8-2014

## ఇది సృష్టి కథ

"అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష" అనే వెక్కిరింపు లోకంలో బాగా ప్రచారంలో ఉంది. వెక్కిరించడానికి అన్నమాటే అయినా, ఇది నిజమని మాత్రం చెప్పక తప్పదు. వేదం సృష్టితత్త్వాన్ని, సృష్టికి మానవుడికి ఉన్న సంబంధాన్ని, మానవుడికి సృష్టికర్తతో గల అనుబంధాన్ని వ్యక్తం చేసింది. వేదం ఏ ఒక్కరో రచించిన గ్రంథం కాదు. సృష్టితత్త్వాన్ని, పరమాత్మ తత్త్వాన్ని తెలుసుకోవాలని ఆరాటపడిన మహర్షి సముదాయానికి అంతర్నేత్రానికి గోచరించిన ఒక దర్శనం. హృదయస్థానంలో వినిపించిన ఒక నాదం (శ్రుతి).వేదం 'అపౌరుషేయం' అని కూడా పెద్దలు గుర్తించారు. 'అపౌరుషేయం' అంటే మానవుమాత్రుడి రచన కాదు అని అర్థం.

అనాదిగా అలా దిగి వచ్చిన వేదం వ్యాసమహర్షి కాలానికి చిక్కువడిన దారాల రాశిగా ఉంటే, ఆ చిక్కును విడదీసి, వేదవిభాగ నిర్ణయుంచేసి, వేదం మనకు అక్కరకు వచ్చేలా చేశాడు ఆ మహర్షి. ఆనాటి నుండి అతడికి 'వేదవ్యాసుడు' అనే పేరు వచ్చింది. సకల వేదాల సారాన్ని 555 సూత్రాలుగా "బ్రహ్మసూత్రాలు" రచించాడు. అయినా, ఆ మహర్షికి తృప్తి కలుగలేదు. వేదమనే విత్తనంలో నుంచి విశాలమైన పురాణ మహావృక్షాలను అంకురింపచేశాడు. అందుకే పురాణాలకు

"వేదోపబృంహణాలు" అని పేరు. "ఉపబృంహణం" అంటే విత్తనాలు నుంచి మొలక రావడం. విత్తనంలో ఏమి ఉన్నదో మొలకలో, మొక్కలో, చెట్టులో అదే ఉంటుంది.

వేదవాఙ్మయంలో దాగిన సృష్టితత్త్వాన్ని కథారూపంగా వివరించడానికి అష్టాదశ పురాణాలను రచించాడు వ్యాసమహర్షి. మానవాభ్యుదయం కోసం వెలువడిన ఈ పురాణ వాఙ్మయసారాన్ని సంక్షిప్తంగా సంకలనం చేసి అందిస్తే, ఈనాటి సమాజానికి శ్రేయస్సు కలుగుతుందని సంకల్పించాడు మా శిష్యమిత్రుడు డా॥ జయంతి చక్రవర్తి. తన ఓర్పు నేర్పులతో అష్టాదశ పురాణాల ఆంతర్యాన్ని వాడుకభాషలో నేటి జన సామాన్యానికి అందుబాటులోకి తెచ్చే పవిత్రమైన బాధ్యతను నెరవేర్చాడు.

మంచి సాహిత్యాన్ని మన సమాజానికి అందించే మహత్తర లక్ష్యంతో శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఈ అష్టాదశ పురాణాలని ప్రచురించటానికి ముందుకు వచ్చారు. వీరిద్వారా ఇంకా ఎన్నో చక్కని గ్రంథాలు వెలుగు చూస్తున్నాయి.

పురాణ వాఙ్మయంలోని పుణ్యకథా విశేషాలను ఈనాటి సమాజానికి పంచే కృషిలో పాలు పంచుకుంటున్న మా చక్రవర్తి, సంప్రదాయ సాహిత్యాన్ని ప్రచురించే సత్కార్యాన్ని మహాయజ్ఞంగా స్వీకరించిన ప్రచురణకర్త శ్రీ బాలాజీ పబ్లికేషన్స్ వారు ఎంతైనా అభినందనీయులు.

వీరిద్దరికీ అంతర్యామి అనంత శుభాలనూ ప్రసాదించాలని ఆశీర్వదిస్తూ, ఈ గ్రంథాలు ప్రజలకు చేరువ కాగలవని ఆకాంక్షిస్తున్నాను.

- మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి



# పురాణ పురుషుడు శ్రీమన్నారాయణుడు



# విషయసూచిక

# ఉపోద్ఘాతము

అం.ఆ

**వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ ।**
**నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥**

**వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్ ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

## అష్టాదశ పురాణాలు

మన భారతవాఙ్మయంలో వేదాల తరువాత అంతటి ప్రాశస్త్యాన్ని పొందిన గ్రంథాలు పురాణాలు. వేదాల్లో చెప్పిన ధర్మాల్ని కథలరూపంలో, ఆఖ్యానాల రూపంలో సామాన్యులకు సైతం అర్థమయ్యేలా తెలియచెప్పేవే పురాణాలు. అందుకే పురాణాల్ని పంచమవేదంగా కీర్తించారు. అసలు పురాణం అంటే? పురా అపినవం-పురాతనమైనప్పటికీ నూతనంగా వుండేది అని అర్థం. అలాగే 'పురా ఆనతి' అంటే ప్రాచీనకాలంలో జరిగింది అని, వాయుపురాణం పురాణశబ్దాన్ని నిర్వచిస్తే, 'పురాఏతత్ అభూత్' పూర్వం ఇలా జరిగింది అని బ్రహ్మాండ పురాణం పురాణశబ్దానికి అర్థాన్ని చెబుతుంది. వీటన్నిటినీ క్రోడీకరించి చూస్తే పురాణం అంటే పూర్వకాలంలో జరిగిన ఎన్నో విషయాల్ని వివరించి చెప్పేది అని తెలుస్తోంది.

పురాణాలు ఎన్ని-

పురాణాలు మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగా వున్నాయి. మహాపురాణాలు 18, అలాగే ఉపపురాణాలు 18.

**బ్రహ్మం పాద్మం వైష్ణవం చ వాయవీయం తథైవచ ।**
**భాగవతం నారదదీయం మార్కండేయంచ కీర్తితమ్ ॥**

**ఆగ్నేయంచ భవిష్యంచ బ్రహ్మవైవర్త లింగకే ।**
**వారాహంచ తథా స్కాందం వామనం కూర్మ సంజ్ఞకమ్ ।**
**మాత్స్యం చ గారుడం తద్వద్బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥**

1.బ్రహ్మపురాణం 2.పద్మపురాణం 3.విష్ణుపురాణం 4.వాయు పురాణం 5.భాగవత పురాణం 6.నారదపురాణం 7.మార్కండేయ పురాణం

8.అగ్నిపురాణం 9.భవిష్యపురాణం 10.బ్రహ్మవైవర్త పురాణం 11.లింగపురాణం 12. వరాహ పురాణం 13.స్కాంద పురాణం 14.వామన పురాణం 15.కూర్మ పురాణం 16.మత్స్య పురాణం 17.గరుడ పురాణం 18.బ్రహ్మాండ పురాణం- ఈ పద్దెనిమిదీ మహాపురాణాలు. అలాగే 18 ఉపపురాణాలు కూడా వున్నాయి. ఈ మహాపురాణాల పేర్లని గుర్తుంచుకోవటానికి శ్లోకం కూడా వుంది.

**'మ' ద్వయం 'భ' ద్వయం చైవ 'బ్ర'త్రయం 'వ' చతుష్టయం।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

'మ' తో మొదలయ్యేవి రెండు 1.మత్స్య 2.మార్కండేయ

'భ' తో మొదలయ్యేవి రెండు 1.భాగవత 2.భవిష్య

'బ్ర' తో మొదలయ్యేవి మూడు 1.బ్రహ్మ 2.బ్రహ్మవైవర్త 3.బ్రహ్మాండ

'వ' తో మొదలయ్యేవి నాలుగు 1.వాయు 2.విష్ణు 3.వామన 4.వరాహ

అ-అగ్ని, నా-నారద, ప-పద్మ, లిం-లింగ, గ-గరుడ, కూ-కూర్మ, స్కా-స్కాంద ఇలా మొత్తం పద్దెనిమిది పురాణాలు.

## పురాణాలు విష్ణుస్వరూపం

అష్టాదశ పురాణాలను సాక్షాత్తు విష్ణు స్వరూపంగా పోల్చారు. 18 పురాణాలని మహావిష్ణువు శరీరంలోని 18 అంగాలుగా భావిస్తారు మన ప్రాచీన ఋషులు.

1. బ్రహ్మపురాణం - శ్రీ మహావిష్ణువు శిరస్సు
2. పద్మపురాణం - శ్రీ మహావిష్ణువు హృదయం
3. విష్ణుపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిభుజం
4. వాయుపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమభుజం
5. భాగవతపురాణం - శ్రీ మహావిష్ణువు ఊరువులు
6. నారదపురాణం - శ్రీ మహావిష్ణువు నాభి
7. మార్కండేయపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిపాదం
8. అగ్నిపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమపాదం

9. భవిష్యపురాణం - శ్రీ మహావిష్ణువు కుడిమోకాలు
10. బ్రహ్మవైవర్తపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమమోకాలు
11. లింగపురాణం - శ్రీ మహావిష్ణువు కుడి చీలమండ
12. వరాహపురాణం - శ్రీ మహావిష్ణువు ఎడమ చీలమండ
13. స్కందపురాణం - శ్రీ మహావిష్ణువు కేశాలు
14. వామనపురాణం - శ్రీ మహావిష్ణువు చర్మం
15. కూర్మపురాణం - శ్రీ మహావిష్ణువు పృష్ఠభాగం
16. మత్స్యపురాణం - శ్రీ మహావిష్ణువు మెదడు
17. గరుడపురాణం - శ్రీ మహావిష్ణువు మాంససారం
18. బ్రహ్మాండపురాణం - శ్రీ మహావిష్ణువు ఎముకలు

పురాణ లక్షణం :-

**సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత రాణి చ।**
**వంశానుచరితం చేతి పురాణం పంచ లక్షణం ॥**

పురాణానికి ఐదు లక్షణాలు ప్రధానంగా వుండాలని చెప్పారు. 1.సర్గ-అంటే ప్రపంచ సృష్టి, 2.ప్రతిసర్గ-ఈ ప్రపంచ ప్రళయం, 3.వంశం-రాజుల, ఋషుల, దేవతలకు సంబంధించిన వంశ విశేషాలు-అవతారాలు 4.వంశానుచరితం-రాజవంశాలలో, ఋషుల వంశాలలో పుట్టిన వారి జీవితచరిత్రలు, 5.మన్వంతరాలు-మనువులు, మనువు ద్వారా ఏర్పడ్డ సంతతి, ఆయా మన్వంతరాలలో జరిగిన విశేషాలు. ఈ విధంగా ప్రతిపురాణం పంచలక్షణాలతో కూడి వుంటుంది.

పురాణకర్త :-

**విష్ణోరంశో మునిర్జాత సత్యవత్యాం పరాశరాత్।**
**పురాణ సంహితాం దధ్యే తేషాం ధర్మ విధిత్సయా ॥**

అనే ఈ ప్రమాణ శ్లోకం ప్రకారం సత్యవతీ పరాశర మహర్షి కుమారుడుగా శ్రీ మహావిష్ణు అంశంతో జన్మించిన వ్యాసుడే అష్టాదశ పురాణాల కర్త అని తెలుస్తోంది. ఈయననే కృష్ణద్వైపాయనుడు అని కూడా అంటారు. పురాణాలకు కర్త వ్యాసుడైతే వక్త సూతమహర్షి. ఈయన నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు ఈ పురాణాలన్నిటినీ ప్రబోధించాడు.

పురాణాల ప్రాచీనత :-

వేద వాఙ్మయం ఎంత విస్తృతంగా వుందో, పురాణ వాఙ్మయం కూడా అంత విస్తృతంగా వుంది. సాధారణంగా లోకంలో వేదాలు అత్యంత ప్రాచీనమైనవని చెబుతారు. అయితే ఈ శ్లోకం వేదాలకన్నా పురాణాలే ప్రాచీనమైనవని చెబుతుంది.

**పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతమ్ ।**

**నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ।**

**అనంతరంచ వక్త్రేభ్యః వేదాంతస్య వినిర్గతాః ॥**

పూర్వం బ్రహ్మ నోటి నుంచి వందకోట్ల శ్లోకాలతో ముందు పురాణాలు బయలుదేరి ఆ తరువాత వేదాలు బయలుదేరాయట. ఇలా వందకోట్ల శ్లోకాలతో చతుర్ముఖ బ్రహ్మతో చెప్పబడ్డ పురాణం మొత్తం ఒక్కటిగానే వుండేది. అల్పబుద్ధులైన మానవుల కోసం ఆ బ్రహ్మదేవుడే వ్యాసుడి రూపంలో వచ్చి ఆ కోటిశ్లోకాల పురాణాన్ని నాలుగు లక్షల శ్లోకాలలోకి కుదించి దాన్ని పద్దెనిమిది పురాణాలుగా రచించాడని స్కందపురాణం చెబుతుంది.

**పురాణమేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప ।**

**త్రివర్గ సాధనం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్ ॥**

**స్మృత్వా జగాదచ మునీన్ ప్రతి దేవశ్చతుర్ముఖః ।**

**చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా ।**

**తదష్టాదశధా కృత్వా భూర్లోకేఽస్మిన్ ప్రభాష్యతే ॥** *(స్కంద పురాణం)*

## పాఠకులకు నమస్కారం

భగవాన్ వేదవ్యాస మహర్షి రచించిన అష్టాదశ పురాణాలు ఆర్షవిద్యా భాండాగారాలు. ఆ భాండాగారాలలో నిక్షిప్తమైన ప్రధాన విషయాల్ని 18 పుస్తకాలుగా క్రోఢీకరించి మీ ముందుకు తెస్తున్నాం. సరళమైన భాషలో మేము ప్రచురించిన ఈ 18 పురాణాలని ఆదరించి, మమ్మల్ని ప్రోత్సహిస్తారని ఆశిస్తూ... మీ

***- ప్రకాశకులు, వచనకర్త***

# అష్టాదశ పురాణాల మొదటి వక్త - శ్రోత

అష్టాదశ పురాణాలను మొదటగా చెప్పిన వక్తలు వారి నుంచి మొదటిసారి విన్న శ్రోతలు ఈ క్రింద చెప్పిన విధంగా వుంటారు. అదేవిధంగా ఒక్కొక్క పురాణానికి వక్తృ శ్రోతృపరంపర వేరువేరు విధాలుగా కూడా ఉంటుంది.

| సం. పురాణం | ఏకల్ప వృత్తాంతం | వక్తృశ్రోతలు |
|---|---|---|
| 1. బ్రహ్మ పురాణాన్ని | బ్రహ్మ కల్పంలో | బ్రహ్మ మరీచి మహామునికి బోధించాడు |
| 2. పద్మ పురాణాన్ని | పద్మ కల్పంలో | స్వాయంభువమనువు బ్రహ్మకు బోధించాడు |
| 3. విష్ణు పురాణాన్ని | వరాహ కల్పంలో | పరాశరుడు బ్రహ్మకు బోధించాడు |
| 4. శివ(వాయు)పురాణాన్ని | శ్వేత కల్పంలో | శివుడు వాయువుకు బోధించాడు |
| 5. భాగవత పురాణాన్ని | సారస్వత కల్పంలో | విష్ణువు బ్రహ్మకు బోధించాడు |
| 6. నారద పురాణాన్ని | బృహత్ కల్పంలో | పూర్వ భాగాన్ని – సనకాదులు నారదునికి బోధించారు. ఉత్తరభాగాన్ని – వశిష్ఠుడు మాంధాతకు బోధించాడు |
| 7. మార్కండేయ పురాణాన్ని | శ్వేత వారాహకల్పంలో | మార్కండేయుడు జైమినికి బోధించాడు |
| 8. అగ్ని పురాణాన్ని | ఈశాన కల్పంలో | అగ్నిదేవుడు వశిష్ఠుడికి బోధించాడు |
| 9. భవిష్య పురాణాన్ని | అఘోర కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |
| 10. బ్రహ్మవైవర్త పురాణాన్ని | రథంతర కల్పంలో | సావర్ణి నారదుడికి బోధించాడు |
| 11. లింగ పురాణాన్ని | కల్పాంత కల్పంలో | పరమశివుడు నారదుడికి బోధించాడు |
| 12. వరాహ పురాణాన్ని | మనుకల్పంలో | విష్ణువు పృథ్వికి బోధించాడు |
| 13. స్కాంద పురాణాన్ని | తత్పురుషకల్పంలో | స్కందుడు భూమికి బోధించాడు |
| 14. వామన పురాణాన్ని | కూర్మ కల్పంలో | బ్రహ్మ పులస్త్య మహామునికి బోధించాడు |
| 15. కూర్మ పురాణాన్ని | లక్ష్మీ కల్పంలో | విష్ణువు పులస్త్య మహామునికి బోధించాడు |
| 16. మత్స్య పురాణాన్ని | సప్త కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 17. గరుడ పురాణాన్ని | గరుడ కల్పంలో | విష్ణువు మనువుకు బోధించాడు |
| 18. బ్రహ్మాండ పురాణాన్ని | భవిష్య కల్పంలో | బ్రహ్మ మనువుకు బోధించాడు |

# పురాణాలు ఎందుకు చదవాలి?

**పురాణశ్రవణే శ్రద్ధా యస్య స్యాద్బ్రాతరస్వహమ్ ।**
**తస్య సాక్షాత్ప్రసన్నః స్యాత్ శివో విష్ణుశ్చ సానుగః ॥**

**యత్స్నాత్వా పుష్కరే తీర్థే యాగే సింధౌ చ సంగమే ।**
**తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వై శృణోతి యః ॥**

**యే పఠంతి పురాణాని శృణ్వన్తి చ సమాహితాః ।**
**ప్రత్యక్షరం లభంత్యేతే కపిలాదానజం ఫలమ్ ॥**

**అపుత్రో లభతే పుత్రం ధనార్థీ లభతే ధనమ్ ।**
**విద్యార్థీ లభతే విద్యాం మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥**

**యే శృణ్వన్తి పురాణాని కోటిజన్మార్జితం ఖలు ।**
**పాపజాలంతు తే హిత్వా గచ్ఛన్తి హరిమందిరమ్ ॥**

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యము ఎవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయాగ మొదలైన నదీసంగమ క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏవిధమైన పుణ్యం పొందగలరో దాని రెట్టింపు పుణ్యం పురాణ శ్రోతలకు లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన-శ్రవణాలు చేసేవారు కపిలగోవును దానం చేస్తే కలిగే పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను, మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు తమ కోటి జన్మల పాపాలను దూరం చేసికొని చివర్లో శ్రీమన్నారాయణమూర్తి సాయుజ్యం పొందగలరు.

# పురాణ వైభవం

**అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్ ।**
**త్రి సంధ్యాం జపతే నిత్యం సోఽశ్వమేధ ఫలం లభేత్ ॥**

ఈ అష్టాదశ మహాపురాణాల పేర్లను ఉదయ-మధ్యాహ్న-సాయంకాల సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధ ఫలాన్ని పొందగలరని భావం.

# శ్రీ స్కాంద పురాణం



**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ॥**

**నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్ ।**
**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయందీరయేత్ ॥**

అష్టాదశ పురాణాలలో పదమూడోది స్కాందపురాణం. 'స్కాంద పురాణం రోమాని' అన్న మాట ప్రకారం ఈ పురాణం, పురాణ పురుషుడైన శ్రీమన్నారాయణుడి రోమాలతో పోల్చబడిందని తెలుస్తోంది. "ఏకాశీతి సహస్రంతు స్కాందం సర్వాఘకృంతనమ్" అనగా సకల పాపాలనూ పోగొట్టే ఈ పురాణంలో మొత్తం 81వేల శ్లోకాలున్నాయి. "యత్రస్కందః స్వయంశ్రోతా వక్తాసాక్షాన్మహేశ్వరః." పరమేశ్వరుడు స్వయంగా ఈ పురాణాన్ని ఉపదేశించగా శ్రద్ధగా విన్న స్కందుడు తిరిగి దాన్ని మహామునులకి తాను ఉపదేశించాడు.

అన్ని పురాణాలకన్నా స్కాందపురాణం చాలా పెద్దది. ఈ పురాణం మొత్తం ఆరు ఖండాలుగా విభాగించబడింది. అవి 1.మాహేశ్వర ఖండం 2.వైష్ణవ ఖండం 3.బ్రహ్మ ఖండం 4.కాశీఖండం 5.అవంతీ ఖండం 6.నాగర ఖండం 7.ప్రభాసఖండం. అలాగే ఈ స్కాందపురాణం సంహితల రూపంలో కూడా మరోరకంగా విభాగించబడింది. 1.సనత్కుమారసంహిత 2.సూత సంహిత 3.శంకరసంహిత 4.వైష్ణవసంహిత 5.బ్రహ్మ సంహిత 6. సౌరసంహిత అని. అయితే ఖండాల రూపంలో చెప్పిన విభాగమే లోకంలో ప్రసిద్ధంగా వ్యవహరించబడుతోంది.

## స్కాంద పురాణంలో చెప్పిన విషయాలు

**1. మాహేశ్వర ఖండం :** ఈ ఖండంలో మొత్తం 174 అధ్యాయాలున్నాయి. ఈ మాహేశ్వర ఖండంలో 1.కేదారఖండం 2.కుమారికా ఖండం అని

రెండు విభాగాలున్నాయి. ఈ మహేశ్వర ఖండంలో దాదాపు 12వేల శ్లోకాలున్నాయి. ఈ ఖండంలో – పురాణోపక్రమం, దక్షయజ్ఞవృత్తాంతం, పార్వతీదేవి వృత్తాంతం, సముద్ర మథనం, పార్వతీదేవి వివాహం, కుమారస్వామి జననం, తారకాసుర యుద్ధం, పాశుపతాఖ్యానం, చండాఖ్యానం, దూతప్రవర్తనాఖ్యానం, నదీసాగరకీర్తనం, ఇంద్రద్యుమ్నుడి కథ, నాడీ జంఘుడి కథ, భూమిప్రాదుర్భావం, దమనక కథ, పంచలింగ నివేశనం, ఊర్థ్వలోక వ్యవస్థితి, బ్రహ్మాండస్థితి, మహాకాల వృత్తాంతం, వాసుదేవ మాహాత్మ్యం, కోటితీర్థం, నానాతీర్థాలు, పవిత్రమైన పాండవకథ, మహావిద్యాప్రసాదనం, తీర్థయాత్రా సమాప్తి, అరుణాచల మాహాత్మ్యం, సనక బ్రహ్మల సంవాదం, మహిషాసురవధ, ద్రోణాచల వృత్తాంతం తదితర విశేషాలు వివరంగా చెప్పబడ్డాయి.

**2. వైష్ణవ ఖండం :** ఈ ఖండంలో మొత్తం 153 అధ్యాయాలున్నాయి. ఇందులో వేంకటాచల మాహాత్మ్యం, పూరీజగన్నాథ మాహాత్మ్యం, బదరికాశ్రమ మాహాత్మ్యం, కార్తీక మాహాత్మ్యం, మార్గశీర్ష మాహాత్మ్యం, భాగవత మాహాత్మ్యం, వైశాఖ మాహాత్మ్యం, అయోధ్యా మాహాత్మ్యం అనే ఎనిమిది విభాగాలున్నాయి. వీటిలో ఎన్నో విశేషాలు సవివరంగా చెప్పబడ్డాయి.

**3. బ్రహ్మ ఖండం :** దీనిలో మొత్తం 87 అధ్యాయాలున్నాయి. ఇది 1.సేతుమాహాత్మ్యం 2.ధర్మారణ్యఖండం 3.బ్రహ్మోత్తర ఖండం అని మూడు భాగాలుగా విభజించబడింది. ఇందులో సేతు మాహాత్మ్యం, చక్రతీర్థ మాహాత్మ్యం భేతాళ తీర్థ మహిమ, రామతీర్థ మహిమ, బ్రహ్మ కుండ మహిమ, లక్ష్మీతీర్థ మహిమ, రామతీర్థ మహిమ, గాయత్ర్యాది తీర్థ మహిమ, ధర్మారణ్య మాహాత్మ్యం, ఋషివంశ నిరూపణం, లోహాసుర వృత్తాంతం, వైష్ణవధర్మాలు, దాన ప్రశంస, హరతాండవం, రామనామ నిరూపణం, శివమాహాత్మ్యం, పంచాక్షర మహిమ, గోకర్ణ మహిమ, సదాచార నిరూపణం, భస్మ మాహాత్మ్య

కీర్తనం, ఉమామహేశ్వర వ్రతం, రుద్రాక్ష మాహాత్మ్యం, రుద్రాధ్యాయ మాహాత్మ్యం తదితర విశేషాలు సవివరంగా వర్ణించబడ్డాయి.

**4. కాశీ ఖండం :** ఈ ఖండంలో మొత్తం 100 అధ్యాయాలున్నాయి. దీనిలో పూర్వార్ధం, ఉత్తరార్థం అని రెండు విభాగాలున్నాయి. వీటిలో – వింధ్యనారద సంవాదం, సత్యలోక ప్రభావం, అగ్ని పుట్టుక, వరుణ పుట్టుక, అలకాపురీ వర్ణనం, పార్వతీ దేవి జననం, చంద్రార్క బుధలోకాల వర్ణన, కుజగురు సూర్యలోకాల వర్ణన, ధ్రువలోక చరిత్ర, మణికర్ణికాప్రభావం, గంగా ప్రభావం, గంగా సహస్రనామ స్తోత్రం, వారణాసీ ప్రశంశ, పంచనదోత్పత్తి, బిందుమాధవ సంభవం, రత్నేశ్వరోత్పత్తి, కృత్తివాసోత్పత్తి, ముక్తి మండపవృత్తాంతం, విశ్వేశ్వరుడి వైభవం, యాత్రాపరిక్రమ తదితర విశేషాలు సవివరంగా వర్ణించబడ్డాయి

**5. అవంతీ ఖండం :** ఈ ఖండంలో మొత్తం 367 అధ్యాయాలున్నాయి. అవంతీ నగరం అంటే ఉజ్జయినీ పట్టణం. ఈ అవంతీ ఖండంలో భాగంగా ఎనభైనాలుగు అధ్యాయాల రేవా ఖండం కూడా చెప్పబడింది. రేవానది అంటే నర్మదానది అని అర్థం. ఇందులో మహాకాలవన వృత్తాంతం, కనఖలతీర్థం, మర్కటేశ్వర తీర్థం, శుక్రపంచకతీర్థం, ఈశ్వర తీర్థం, కుశ స్థలి, అవంతి – ఉజ్జయినీ నామాలు, అంధక శ్రుతి కీర్తనం, కాలారణ్యంలో ఉన్న శివలింగాలు, శివనామాల ఫలం, శివస్తుతి, నీల గంగా పుష్కరతీర్థం, పురుషోత్తమ తీర్థం, చక్రతీర్థం, మార్కండతీర్థం, శ్రవణేశ తీర్థం ఇంకా ఎన్నో దివ్య తీర్థాలున్నాయి.

**6. నాగర ఖండం :** ఈ ఖండంలో మొత్తం 178 అధ్యాయాలున్నాయి. వీటిలో లింగోత్పత్తి, హరిశ్చంద్ర కథ, విశ్వామిత్ర మాహాత్మ్యం, త్రిశంకుస్వర్గం, హాటకేశ్వర మాహాత్మ్యం, సతీపరిణయం, లక్ష్మణేశ్వరం, విష్ణుపాదం, గోకర్ణం, సిద్ధేశ్వరం, నాగసరస్సు, సప్తర్షి చరిత్ర, అగస్త్య చరిత్ర, రుద్రశీర్షం, శానైశ్చర్యం, రేవతీ తీర్థం, కేదారం, శుక్ల తీర్థం, జాబాలి చరిత్ర, గంగా, నర్మదా, సరస్వతీ

నదుల వృత్తాంతం, చాతుర్మాస్యం, కపాల మోచనేశ్వరం, శాకంభరీ, ఏకాదశీ రుద్ర కీర్తనం, దానమాహాత్మ్యం, ద్వాదశాదిత్య కీర్తనం తదితర విశేషాలు సవివరంగా వర్ణించబడ్డాయి.

**7. ప్రభాసఖండం :** ఈ ఖండంలో మొత్తం 414 అధ్యాయాలున్నాయి. స్కాందపురాణంలోని ఖండాలన్నిటికన్నా ఇది పెద్దది. ఇందులో – ప్రభాస క్షేత్ర మాహాత్మ్యం, అగ్ని తీర్థం, కేదారేశం, సిద్ధేశ్వరాది పంచరుద్రులు, గంగా గణపతి కథలు, మరుత్తుల కథ, నాగతీర్థం, వశిష్ఠాశ్రమం, అద్భుదేశ్వర కథ, అచలేశ్వర వృత్తాంతం, భద్రకర్ణ మాహాత్మ్యం, హృషీకేశ కథలు, యమతీర్థం, వారాహతీర్థ వర్ణనం, కపిలతీర్థం, అగ్నితీర్థం, ఏకాదశీ వ్రతం, మహాద్వాదశీ వ్రతం, దుర్వాసోపాఖ్యానం, గోమతీ నదీ స్నాన ఫలితం, బ్రహ్మతీర్థాది కథనం, ద్వారకాపుణ్యకీర్తనం తదితర విశేషాలు ఇంకా ఎన్నో వర్ణించబడింది. ప్రధానంగా ఈ ఖండంలో శివలీలలు అధికంగా చెప్పబడ్డాయి. ఈ గ్రంథంలో స్కాందమహాపురాణంలో చెప్పిన కొన్ని వృత్తాంతాలని సంగ్రహంగా అందిస్తున్నాము.

## కిరాతుడి కథ

పూర్వం అవంతీపురంలో 'నంది' అనే వైశ్యుడుండేవాడు. అతడు గొప్ప శివభక్తుడు. ప్రతిరోజు ఆ నగరానికి సమీపంలో ఉన్న ఒక వనానికి వెళ్ళి అక్కడున్న ప్రాచీన శివలింగాన్ని అర్చించేవాడు. శాస్త్ర విధానంగా శివుడికి నిత్యం పంచామృతాలతో అభిషేకంచేసి షోడశోపచారాలతో ఆయన్ని దివ్యంగా పూజించేవాడు. పూజలో భాగంగా వివిధ రకాల పుష్పాలు, ఫలాలు, ముత్యాలు, ఇంద్రనీలాలు, గోమేధిక వైఢూర్యాలు, మాణిక్యాలు లింగానికి సమర్పించేవాడు. ఈ విధంగా అడవిలో ఉన్న ఆ శివలింగం 'నంది' చేత రకరకాల భోగాలతో ఎన్నో సంవత్సరాలు పూజించబడింది.

ఒకనాడు అడవిమృగాల్ని వేటాడే కిరాతకుడు ఒకడు వేటాడుతూ అక్కడికి వచ్చాడు. అతడికి ప్రాచీన శివలింగం ఉన్న ఆలయం కనిపించింది.

అక్కడికి వచ్చే సరికి కిరాతుడికి ఎంతో దాహం వేసింది. అటూ ఇటూ చూసాడు. దగ్గర్లో ఒక సరోవరం కనిపించింది. ఒడ్డున తన సామాన్లన్నీ పడేసి సరస్సులోకి దిగి కడుపునిండా నీళ్ళు త్రాగాడు. కొంత నీటిని పుక్కిట ఉంచుకుని బైటికి వచ్చాడు. ఎదురుగా శివలింగం వివిధరకాల రత్నాలతో, పుష్పాలతో కనిపించింది. కిరాతుడు సరాసరి శివలింగం దగ్గరకొచ్చి అక్కడున్న రత్నాలన్నీ పక్కకి తోసేసి తన పుక్కిట పట్టి తెచ్చిన నీళ్ళతో లింగానికి స్నానం చేయించాడు. పక్కనే బిల్వవృక్షం వుంది దాని ఆకుల్ని తెచ్చి స్వామి మీద వేశాడు. అలాగే వేటాడి తెచ్చిన మాంసం ముక్కని సంచి నుంచి తీసి నైవేద్యం పెట్టాడు. ఇలా తనకు తోచిన రీతిలో శివపూజ చేసిన ఆ కిరాతుడు "స్వామీ! శంకరా! నిన్ను చూస్తే నాకు ఎంతో ఆనందంగా వుంది. ప్రతిరోజూ నీకు ఇలానే పూజలు చేస్తాను. నన్ను కరుణించు స్వామీ" అని వేడుకున్నాడు.

ప్రతిరోజూ కిరాతుడు అక్కడికి వచ్చి ఇదేవిధంగా పూజలు చేయటం ప్రారంభించాడు. ఈ విషయాన్ని అక్కడికి వచ్చిన 'నంది' చూసాడు. ఎంతో బాధపడుతూ" అయ్యో! నేనేదో పాపం చేసి ఉంటాను. నా పూజలో ఏదోలోపం ఉంది. నేను చేసే పూజ స్వామికి నచ్చలేదేమో! ఇదంతా నా దురదృష్టం" అని చింతిస్తూ ఇంటికి తిరిగివచ్చాడు.

'నంది' దీనంగా దిగులుగా ఉండటం చూసి ఆయన పురోహితుడు "అయ్యా! తమరెందుకిలా చింతాక్రాంతులై ఉన్నారు" అని అడిగాడు. "బ్రాహ్మణోత్తమా! నేనీ రోజు శివపూజ కోసం వనానికి వెళ్ళాను. అక్కడ శివుడి ముందు మాంసాన్ని చూసాను. ఇంతకు ముందు నేను చేసిన పూజనంతా ఎవరో చిందరవందర చేసేసారు. నాకు చాలా బాధగా ఉంది. నా పూజని చెడగొట్టి, మాంసాన్ని నైవేద్యం పెట్టిన వాడెవడో నాకు కనిపించలేదు. ఇప్పుడు నేనేం చేయాలి" అని అడిగాడు.

పురోహితుడు నందితో "అయ్యా! తమిరేం బాధ పడకండి. రేపొద్దున నేను కూడా మీతో వస్తాను. ఇద్దరం కలిసి అక్కడికి వెళదాం. రోజూ వచ్చి మనపూజ చెడగొట్టేవాడెవడో తెలుసుకుందాం" అని ధైర్యం చెప్పాడు.

అలాగే ఆ మర్నాడు ఇద్దరూ కలిసి వనంలో ఉన్న శివలింగం దగ్గరకి వెళ్ళారు. పురోహితుడు రుద్రాధ్యాయాన్ని పఠిస్తుండగా 'నంది' చక్కగా లింగానికి ఏకాదశ రుద్రాభిషేకం చేసాడు. తరువాత యథావిధిగా రత్నాలు, పుష్పాలు సమర్పించి షోడశోపచార పూజ కూడా వైభవంగా నిర్వహించాడు. ఇలా రెండు ఝాముల కాలం గడిచింది.

అప్పుడు మహాకాలుడిలా నల్లగా ఎత్తుగా ఉన్న కిరాతుడు చేతిలో ధనుస్సు, బాణం పట్టుకుని అక్కడికొచ్చాడు. ఎంతో భయంకరంగా ఉన్న ఆ కిరాతుణ్ణి చూసి 'నంది' భయపడిపోయాడు. అతడితోపాటు పక్కనున్న పురోహితుడు అతడి బృందం కూడా వణికిపోయారు. రోజూ చేసినట్టే ఆ కిరాతుడు వాళ్ళని పట్టించుకోకుండా అప్పటిదాకా వారుచేసిన పూజా ద్రవ్యాలన్నీ పక్కకి తీసేసి, పుక్కిటజలంతో అభిషేకం, మాంసనైవేద్యం స్వామికి సమర్పించాడు. బిల్వం ఆకులు తెంపి లింగం మీద వేసాడు. ఒక్కసారి సాష్టాంగనమస్కారం చేసి తిరిగి తనదారిన తాను వెళ్ళిపోయాడు.

ఈ దృశ్యాన్నంతా చూసిన 'నంది'కి అతడి పురోహిత బృందానికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. 'నంది' తిరిగి ఇంటికి వచ్చి, పండితులందర్నీ పిల్చి ఈ విషయాన్ని వారికి చెప్పాడు. "విప్రులారా! ఇప్పుడు నేనేం చేయాలో చెప్పండి" అని అడిగాడు. అప్పుడా పండితులు నందితో "అయ్యా! నీవు ఎంతో పవిత్రంగా చేసే పూజ ప్రతిరోజూ పాడుచేయబడుతోంది. ఇక ఆ లింగం అక్కడుండటం మంచిది కాదు. మీరు వెంటనే దాన్ని తీసుకొచ్చి మీ గృహంలో ప్రతిష్ఠించండి. అదే మీకు శ్రేయస్కరం" అని సెలవిచ్చారు. 'నంది' వారి మాట ప్రకారం వనంలో ఉన్న లింగాన్ని తెచ్చి తన ఇంట్లోనే స్థాపించి యథావిధిగా నవరత్నాలతో పూజించాడు.

అక్కడికి కిరాతుడు మర్నాడు వచ్చి చూసేసరికి లింగం కనిపించలేదు. ఒక్కసారిగా అతడికి దుఃఖం ముంచుకొచ్చింది."ప్రభూ! శివా! శంకరా! నన్ను వదిలి ఎక్కడికి వెళ్ళావు. నిన్ను చూడకపోతే నా మనసు ఎంతో బాధపడుతుంది. ప్రభూ! నాకు కనిపించు. నీవు రాకపోతే నా ప్రాణాల్ని వదిలేస్తాను. పరమేశ్వరా!

కరుణించు" అని తీవ్రంగా విలపించాడు. అయితే శివుడు కనిపించలేదు. వెంటనే అన్నమాట నిలబెట్టుకోవాలని భావించిన కిరాతుడు తన గోళ్ళతో గుండెని చీల్చుకుని, రోషంగా అరుస్తూ ప్రభూ! ఇదిగో నా గుండెని చీల్చాను. ఇప్పటికైనా రా! అని పిలిచాడు. ఆ వెంటే లోపలి ప్రేగుల్ని, మాంసాన్ని బైటికి తీసి లింగం తీసేసిన గోతిలో వేసాడు.

అలాగే శరీరాన్ని కదిలించుకుంటూ వెళ్ళి చెరువులోని నీళ్ళు తెచ్చి ఆ గోతిలో పోశాడు. పక్కనే ఉన్న బిల్వ పత్రాల్ని శక్తిలేకపోయినా ఎలాగో తెచ్చి అక్కడ సమర్పించాడు. ఇక పూర్తిగా ఓపిక నశించి, రక్తం ధారలుగా కారిపోతుండగా అలాగే నేలమీద కుప్పకూలిపోయాడు. అంతలో దివ్యకాంతులు వెదజల్లుతూ ప్రమథగణాలతో సహా శివుడు ప్రత్యక్షమయ్యాడు. కర్పూరకాంతితో ప్రకాశిస్తూ జటాజూటాన్ని, త్రిశూలాన్ని, చంద్రరేఖని ధరించిన శివుడు కిరాతుడి చేయి పట్టుకుని పైకి లేపి అతడి గాయాలన్నీ పోగొట్టాడు. ఎంతో ప్రేమగా అతడితో ఇలా అన్నాడు.

"కిరాతా! నీవెంతో గొప్ప భక్తుడివి. నాకు సంతృప్తి కలిగేలా పూజలు చేసావు. నా కోసం ప్రాణాలు సమర్పించటానికి సిద్ధపడ్డావు. నీ భక్తి అనన్య సామాన్యం. నీకేం వరం కావాలో కోరుకో" అన్నాడు. రుద్రుడి మాటలు వినగానే కిరాతుడికి ఎంతో ఆనందం కలిగింది. వెంటనే ఆయన పాదాల మీదపడి "ప్రభూ! నేను నీ దాసుణ్ణి నాకు జన్మజన్మల్లో నీ మీద అచంచలమైన భక్తి ఉండేలా అనుగ్రహించు. నీవే నాకు తల్లి, తండ్రి, గురువు, దైవం, బంధువు, మిత్రుడు కూడా. ఇక నాకు వేరే ఏ కోరికా లేదు. నిన్ను దర్శిస్తూ ఉంటే చాలు" అని వినయంగా పలికాడు. నిష్కల్మషమైన కిరాతుడి భక్తికి శివుడు ఎంతో చలించిపోయి అతన్ని తన శివమందిరానికి ద్వారపాలకుడిగా నియమించాడు. అదే సమయంలో దేవదుందుభులు మ్రోగాయి. ఆ ధ్వని, వనం ప్రక్కనే ఉన్న 'నంది' ఇంటిదాకా వినిపించాయి.

వనంలోకి దివ్యమైన ధ్వనులు వినపడే సరికి నంది ఎంతో ఆదుర్దాగా అక్కడికి పరుగున వచ్చాడు. అక్కడ ఎదురుగా తన్మయుడై నిల్చున్న కిరాతుడు

కనిపించాడు. ఏదో అద్భుతం జరిగిందని నందికి అనిపించింది. వెంటనే కిరాతకుడి చేతులు పట్టుకుని అయ్యా! నీవు కూడా నా లాగానే శివభక్తుడివి. నిన్ననుగ్రహించటానికి సాక్షాత్తు శివుడే ఇక్కడికి వచ్చాడనిపిస్తోంది. దయచేసి నన్నుకూడా శివుడి దగ్గరకి తీసుకెళ్ళు ఆ స్వామి దర్శనాన్ని కల్పించు అని ప్రార్థించాడు.

'నంది' ప్రార్థన విని గుణవంతుడైన కిరాతుడు అతడి చేయిపట్టుకుని శివుడి దగ్గరకొచ్చి చూపించి, శివా! ఇతడు 'నంది' అనే వైశ్యుడు. నిత్యం నిన్ను రత్నాలతో పూజించేవాడు. ఇతడు నా మిత్రుడు అని పరిచయం చేసాడు.

కిరాతుడి మాటలు విన్న శివుడు "కిరాతా! ఈ 'నంది' ఎవరో నాకు తెలియదు. కల్లాకపటం లేని నీవే నా నిజమైన భక్తుడివి, నా మిత్రుడివి. ఎలాంటి స్వాభిమానం, దురహంకారం లేనివాడే నా నిజమైన భక్తుడు. అంతేకానీ స్వార్థంతో కూడిన వాడు కాదు" అని చెప్పాడు. అప్పుడు కిరాతుడు "ప్రభూ! నేను నీకు స్నేహితుణ్ణి అన్నావు కదా! ఇతడు నాకు మిత్రుడు. మిత్రుడు మిత్రుడు నీకూ మిత్రుడేగా ప్రభూ! దయచేసి నాతో పాటూ ఇతన్నీ ఉద్ధరించు" అని ప్రార్థించాడు.

అలా కిరాతుడి మాటను కాదనలేక శివుడు వారిద్దర్నీ తన పరిచారకులుగా స్వీకరించాడు. అదే సమయంలో దివ్యవిమానం అక్కడికొచ్చింది. ఇద్దరూ కలిసి దాన్ని ఎక్కి సరాసరి కైలాసానికి వెళ్ళిపోయారు. అక్కడ కైలాసంలో వీరికి ఘనస్వాగతం లభించింది. వారిద్దరికీ కైలాసం చేరగానే శివుడి సారూప్యం లభించింది. ఇద్దరూ శివుడిలాగా మారిపోయారు. అప్పుడు పార్వతి నవ్వుతూ నాథా! వీరిద్దరూ పరమభక్తితో నిన్ను మెప్పించారు. వీరి జీవితం ఎంతో ధన్యమయ్యింది. వీళ్ళిద్దర్నీ ఏ కార్యంలో నియమిస్తే బావుంటుంది?" అని అడిగింది.

అంతలో వారిద్దరూ పార్వతీ పరమేశ్వరులకి నమస్కరించి "ప్రభూ! మేమిద్దరం నీ ద్వారానికి కాపలాగా ఉంటాము. దయచేసి మాకా సేవాభాగ్యాన్ని ప్రసాదించండి" అని కోరారు. వారి భావాన్ని తెలుసుకున్న శివుడు "అలాగే మీరిద్దరూ అక్కడే వుండి నన్ను సేవించండి" అని చెప్పి పంపించాడు.

ఆ రకంగా కిరాతుడు మహాకాలుడిగా, నంది నందిగా, కైలాసాన్ని చేరి శివద్వారానికి రక్షకులుగా ఉంటూ నిత్యం ఆయన్ని సేవిస్తూ ఉన్నారు.

## నంది చెప్పిన శివధర్మం

యే పాపినోఽ ప్యధర్మిష్ఠా అంధా మూకాశ్చ పంగవః ।
కులహీనా దురాత్మానః శ్వపచా అపి మానవాః ॥

యాదృశాస్తాదృశాశ్చాన్యే శివభక్తిపురస్కృతాః ।
తేఽ పి గచ్ఛన్తి సాన్నిధ్యం దేవదేవస్య శూలినః ॥

లింగం సికతామయం యే పూజయన్తి విపశ్చితః ।
తే రుద్రలోకం గచ్ఛన్తి నాత్ర కార్యా విచారణా ॥

*(శ్లో॥195-197,అధ్యా-5)*

పాపాలు చేసేవారు, అధర్మాన్ని ఆచరించేవారు, గుడ్డివారు, మూగవారు, కుంటివారు, కులం, గుణం లేనివారు, చెడ్డమనసు కలిగినవారు, చండాలురు, ఎలాంటి వారైనా సరే శివభక్తిని కలిగి ఉంటే చాలు. దేవాదిదేవుడైన ఆయన సాన్నిధ్యాన్ని తప్పక పొందుతారు. కేవలం ఇసుకతో చేసిన శివలింగాన్ని భక్తిగా పూజించినా చాలు. వారు తప్పకుండా రుద్రలోకాన్ని చేరుకుంటారు.

## దారువన వృత్తాంతం

పూర్వం ఒకనాడు పరమేశ్వరుడు భిక్షాటనకోసం (దేవ)దారు వనానికి వెళ్ళాడు. ఆ వనంలో ఎంతోమంది నిష్ఠాగరిష్ఠులైన మునులు ఆశ్రమాలు నిర్మించుకుని తమతమ భార్యలతో నివసిస్తున్నారు. శివుడు ఆ వనానికి భిక్షకోసం వచ్చేసరికి మధ్యాహ్న సమయమైంది. అప్పుడు ఋషులందరూ తీర్థంలో స్నానం చేయటం కోసం వెళ్ళారు. వారి కుటీరాల్లో కేవలం వారి భార్యలు మాత్రమే ఉన్నారు.

ఎంతో సుందరుడుగా వున్న శివుణ్ణి చూసి ఆ ముని పత్నులందరూ మోహం చెంది, తమ తమ ఇళ్ళ నుంచి భిక్ష ఇవ్వటానికి ఎంతో ఆత్రంగా బైటికి వచ్చారు. ఎంతో కుతూహలంగా ఆయనతో "స్వామీ! తమరెవరు?

ఇక్కడికే భిక్షకోసం ఎందుకొచ్చారు. ఇది ఋషుల ఆశ్రమం. మీరిక్కడ ఎందుకు కూర్చోవటం లేదు? అని ప్రశ్నించారు. వారందరి మాటలు విన్న శివుడు నెమ్మదిగా నవ్వి "పడతులారా! నేను ఈశ్వరుణ్ణి. ఇది పవిత్రమైన స్థలం అని తెలిసే ఇక్కడికి వచ్చాను" అన్నాడు. మరొక స్త్రీ అయ్యా! నీవు శివుడివే. కాని ఇలా దిగంబరంగా భిక్షాటన కోసం ఎందుకొచ్చావు? అని తిరిగి ప్రశ్నించింది. "సుందరాంగీ! నా భార్య దాక్షాయణి ఆత్మాహుతి చేసుకుంది. అందుకే నేనిలా భిక్షకి వచ్చాను. నాకు నా భార్య పైతప్ప మరే స్త్రీ మీదా వ్యామోహం లేదు. అందుకే ఇలా నిశ్చలంగా దిగంబరంగా తిరుగుతున్నా" అని సమాధానం చెప్పాడు.

దిగంబరుడైన శివుణ్ణి చూసి మోహంలో చిక్కుకున్న ఋషిపత్నులంతా అతని భిక్షా పాత్రని నింపేశారు. ఇక చాలు అని చెప్పి శివుడు వెనుతిరిగి బయలుదేరాడు. శివమాయలో చిక్కుకున్న ఋషిపత్నులు చేస్తున్న పనుల్ని వదిలేసి ఆయన వెనకాలే తామూ బయలుదేరారు.

ఇక్కడ స్నాన సంధ్యా విధుల్ని ముగించుకుని ఋషులందరూ తమ తమ ఆశ్రమాలకి తిరిగి వచ్చారు. లోపల ఎవరూ లేరు. అంతా ఆశ్చర్యపోయారు. తమ భార్యలంతా ఏమయ్యారు? ఎక్కడికి వెళ్ళారని పరస్పరం చర్చించుకున్నారు. కొంతదూరంలో దిగంబరుడై వెళుతున్న శివుణ్ణి అనుసరిస్తూ తమ భార్యలు కనిపించారు. ఆ దృశ్యాన్ని చూడగానే వారికి శివుడిమీద ఎంతో కోపం వచ్చింది. అందరూ మూకుమ్మడిగా ఆయన్ని చేరి ఇలా అన్నారు.

పరమేశ్వరా! నీవెంతో గొప్పవాడివి, విరక్తుడివి అనుకున్నాము. నీవు చేస్తున్న పనేమిటి? పరుల భార్యల్ని అపహరిస్తావా! ఇది నీకు న్యాయమేనా! అని మౌనంగా కైలాసంవైపు వెళ్తున్న శివుణ్ణి ఘోరంగా నిందించారు. అంతటితో వారి ఆగ్రహం చల్లారక, "శివా! నీవిలాంటి పని చేసినందుకు నీ లింగం నేలపైబడి పోగాక! నీవు నపుంసకుడివై పోగాక!" అని శపించాడు.

మునుల శాపఫలితంగా దిగంబరంగా నడుస్తున్న పరమేశ్వరుడి లింగం ఊడిపోయి భూమిమీద పడింది. అది నేలమీద పడీపడగానే మహావేగంగా

ఏడు పాతాళలోకాల్నీ మరో క్షణంలో ఊర్ధ్వలోకాల్నీ ఆక్రమించేసింది. స్వర్గాది లోకాలన్నీ లింగంతో కప్పబడిపోయాయి. భూమిలేదు. దిక్కులు లేవు. నీరు లేదు, నిప్పులేదు, గాలి, ఆకాశం, ప్రకృతి ఇవేవీ లేవు. అంతా లింగమయమై పోయింది.

నాసీద్ద్వైత విభాగంచ సర్వం తీనంచ తతక్షణాత్ ।
యస్మాల్లీనం జగత్సర్వం తస్మిన్‌లింగే మహాత్మనః ॥
లయనాల్లింగమిత్యేవం ప్రవదంతి మనీషిణః ।

*(శ్లో॥29-30,అధ్యా-6)*

లింగం తప్ప రెండో విభాగమే లేదు. అన్నీ లింగంలోనే లీనమైపోయాయి. ఆ విధంగా జగత్తంతా లింగంలో లయమైపోవటం వల్ల పండితులు దాన్ని 'లింగం' అన్నారు. ఆ విధంగా మహోన్నతంగా పెరిగిపోతున్న లింగాన్ని చూసి దేవర్షులందరూ ఆశ్చర్యపోయి "ఏమిటీ లింగం? ఇంత గొప్పగా వృద్ధిచెందుతోంది. దీని పొడవెంత? వెడల్పు ఎంత? దీని ఆదిఅంతాలు ఎక్కడ? దీని పీఠం ఎక్కడుంది? ఇలా చింతిస్తూ అదే విషయాన్ని శ్రీహరితో అన్నారు.

ఓ శ్రీహరీ! నీవు ఈ లింగం మూలాన్ని క్రిందకి వెళ్ళి చూడు. బ్రహ్మదేవా! నీవీ మహాలింగం పైకి వెళ్ళి దాని శిరస్సు ఎక్కడిదాకా వ్యాపించిందో చూడు అని విన్నవించారు. వారి మాట ప్రకారం శ్రీహరి పాతాళంలోకి, బ్రహ్మదేవుడు హంసవాహనాన్ని ఎక్కి స్వర్గలోకం వైపు ప్రయాణమయ్యారు. బ్రహ్మదేవుడు ఎంతపైకి వెళ్ళినా శివలింగం అంతం ఎక్కడుందో చూడలేకపోయాడు. అలాగే శ్రీహరి పాతాళంలో ఎంతలోతుకి వెళ్ళినా ఆ లింగం ఆదిని చూడలేకపోయాడు.

బ్రహ్మదేవుడు సరాసరి పైనుంచి వెనక్కి తిరిగి బయలుదేరాడు. దారిలో ఆయనకి మేరుపర్వతం మీద సురభి(ధేనువు) కనిపించింది. ఆ ధేనువు "బ్రహ్మదేవా! ఎక్కడి నుంచి తమరి రాక! అడి అడిగింది. బ్రహ్మ నవ్వుతూ! "సురభీ! నన్ను దేవతలు ఈ లింగం ఆది ఎక్కడుందో చూసిరమ్మన్నారు. అయితే నేను ఎంత పైకి వెళ్ళినా నాకు దాని శిరస్సు కనిపించలేదు. ఇప్పుడు దేవతలకి నేనేం సమాధానం చెప్పాలి అని చింతగా ఉంది" అన్నాడు.

అప్పుడు సురభి బ్రహ్మదేవా! దీనికి చింత ఎందుకు? శిరస్సు కనిపించిందని అబద్ధం చెప్పు. ఇంద్రాది దేవతా గణాలంతా నీ మాటని విశ్వసిస్తారు. నాతో పాటు వచ్చిన ఈ కేతకీ (మొగలి) పుష్పాన్ని కూడా సాక్ష్యంగా ఉంచుకో అని సలహా ఇచ్చింది. ఈ ఆలోచనేదో బాగుందనిపించింది బ్రహ్మకి. వెంటనే కేతకీ పుష్పంతో సహా క్రిందకి వచ్చి అక్కడున్న దేవతలందరితో "ఇంద్రాది దేవతలారా! నేనీ అద్భుతమైన శివలింగం శిరస్సుని దర్శించాను. కేతకీ పుష్పాలతో ఆ శిరస్సుని బాగా పూజించాను కూడా! అదెంతో స్వచ్ఛంగా, నిర్మలంగా ఉంది అని" వర్ణించి చెప్పాడు.

బ్రహ్మ మాటలు విని దేవతలంతా ఎంతో ఆశ్చర్యపోయారు. బ్రహ్మదేవుడు లింగంపై భాగం చూసివచ్చినందుకు ఆయన్ని ప్రశంసించారు. అంతలో పాతాళంవైపు వెళ్ళిన శ్రీహరి పైకి వచ్చాడు. "దేవతలారా! ఈ మహాలింగం మొదలు ఎక్కడుందో చూడాలని చాలా లోపలికి వెళ్ళాను. అయినా నాకు దాని మొదలు కనిపించలేదు. గుప్త పాతాళాలు దాటి లోపలికి వెళ్ళిన నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అంతా శూన్యంగా ఉన్నాయి.

ఎవరితో ఈ జగత్తంతా ధరించబడుతోందో! ఎవరి వల్ల మీరంతా జన్మించారో! ఆ మహాదేవుడే ఈ లింగరూపంలో అవతరించాడు" అని చెప్పాడు. అది విని దేవతలు బ్రహ్మదేవుడు ఈ లింగం అగ్రభాగాన్ని చూసివచ్చాడని సంతోషంగా విష్ణువుకి చెప్పగా ఆయన ఆశ్చర్యపోయి" బ్రహ్మదేవా! ఇది నిజమేనా! అసలు నీవు లింగాన్ని చూసినట్టు సాక్ష్యమేదైనా ఉందా? అని ప్రశ్నించాడు. అప్పుడు బ్రహ్మ లేకేం ఉంది. కాదు ఉన్నాయి. 'కేతకీపుష్పం, సురభి" అని అన్నాడు. అయితే వాటిని పిలిపించు అన్నాడు శ్రీహరి.

బ్రహ్మ కేతకిని – సురభిని పిలిపించాడు. వారిద్దరూ వచ్చి "బ్రహ్మదేవుడు చెప్పింది నిజమే. ఆయన శివలింగం శిరస్సుని చూసాడు. అందుకు మేమే సాక్ష్యం" అని పలికాయి. అంతలో ఆకాశవాణి పెద్దగా "దేవతలారా! ఈ సురభి – కేతకీ (మొగలిపువ్వు) చెప్పింది అబద్ధం. బ్రహ్మదేవుడు శివలింగం శిరస్సుని చూడనేలేదు" అని చెప్పింది.

ఆకాశవాణి మాటలు వినగానే ఇంద్రాది దేవతలందరికీ చాలా కోపం వచ్చింది. అబద్ధపు సాక్ష్యం చెప్పిన "సురభిని నీ నోటితో అసత్యం పలికి అపవిత్రమయ్యావు కనుక అన్ని ధర్మాలనుంచీ నీవు బహిష్కరించబడదువు గాక! నీ ముఖం అపవిత్రమగుగాక! అని శపించారు. అలాగే కేతకీ పుష్పాన్ని నీవు కూడా అసత్యం పలికావు కనుక శివార్చనకి నీవు పనికి రాకుండుకాగ!" అని శపించారు. అప్పుడు ఆకాశవాణి "బ్రహ్మదేవా! ధర్మనిరతుడిగా ఉండాల్సిన నీవు అసత్యం చెప్పావు కనుక నీకు భూలోకంలో పూజలు లేకుండా పోగాక!" అని శపించింది.

ఆ విధంగా మహేశ్వరుడి మహాలింగం ఆద్యంతాలు తెలుసుకోలేక దేవతలందరూ ఆ దివ్యలింగాన్నే శరణు వేడుకున్నారు. సకల మునులు, ఋషులు, అందరూ కలిసి భయంతో ఈశ్వరుణ్ణి ఇలా స్తుతించారు.

## బ్రహ్మ చేసిన శివలింగ స్తుతి

త్వం లింగరూపీ తు మహాప్రభావో వేదాంతవేద్యోఽసి మహాత్మరూపీ ।
యేనైవ సర్వే జగదాత్మమూలం కృతం సదానందరూపేణ నిత్యమ్ ॥ 1

త్వం సాక్షీ సర్వలోకానాం హర్తా త్వం చ విచక్షణః ।
రక్షణోఽసి మహాదేవ భైరవోఽసి జగత్పతే ॥ 2

త్వయా లింగస్వరూపేణ వ్యాప్తమేతజ్జగత్త్రయమ్ ।
క్షుద్రాశ్చైవ వయం నాథ మాయామోహితచేతసః ॥ 3

అహం సురాఽసురాః సర్వే యక్షగంధర్వరాక్షసాః ।
పన్నగాశ్చ పిశాచాశ్చ తథా విద్యాధరా హ్యమీ ॥ 4

త్వం హి విశ్వసృజాం స్రష్టా త్వం హి దేవో జగత్పతిః ।
కర్తా త్వం భువనస్యాస్య త్వం హర్తా పురుషః పరః ॥ 5

త్రాహ్యస్మాకం మహాదేవ దేవదేవ నమోఽస్తుతే ।
ఏవం స్తుతో హి వై ధాత్రా లింగరూపీ మహేశ్వరః ॥ 6

*(శ్లో॥2-7,అధ్యా-7,ప్రథమ భాగం)*

"పరమేశ్వరా! గొప్పకాంతి కలిగిన లింగం నీవు. వేదాంతాలచేత మాత్రమే నీవు తెలుసుకోదగిన వాడివి. సచ్చిదానందరూపుడవైన నీ చేతనే ఈ జగత్తు నిత్యంగా చేయబడుతోంది. నీవే అన్ని లోకాలకీ సాక్షివి. మేధావివైన నీవే అందరినీ సంహరించేవాడివి. మహాదేవా! జగత్పతీ, నీవే రక్షకుడివి. నీవే భైరవుడివి. లింగస్వరూపుడైన నీచేతనే ఈ లోకాలన్నీ వ్యాపించాయి. మేమంతా అల్పమైన వారం. మాయామోహితులం. నేను ఈ దేవతలు, అసురులు, యక్ష, గంధర్వ, రాక్షసులు, సర్పాలు, పిశాచాలు, విద్యాధరులు అందరం నీ ముందు అల్పులమే. ఈ సమస్త విశ్వాన్నీ సృష్టించేవాడివి నీవే. పరమపురుషుడివీ నీవే! దేవదేవా! మహాదేవా! మమ్మల్ని రక్షించు. నీ పాదాలకి నమస్కారం"

ఈ విధంగా లింగరూపుడైన పరమేశ్వరుణ్ణి బ్రహ్మదేవుడు ఘనంగా స్తుతించాడు. బ్రహ్మ స్తుతిని విన్న తరువాత ఋషులు కూడా దివ్యలింగ రూపుడైన శివుణ్ణి తమదైన వాక్యాలతో ఇలా స్తుతించటం ప్రారంభించారు.

## ఋషులు చేసిన శివలింగ స్తుతి

అజ్ఞానినో వయం కామాన్న విందామోఽస్య సంస్థితమ్ ।
త్వం హ్యాత్మా పరమాత్మా చ ప్రకృతిస్త్వం విభావినీ ॥ 1

త్వమేవ మాతా చ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమీశ్వరో వేదవిదేకరూపో మహానుభావైః పరిచింత్యమానః ॥ 2

త్వమాత్మా సర్వభూతానామేకోజ్యోతిరివైధసామ్ ।
సర్వం భవతి యస్మాత్త్వత్తస్మాత్సర్వోఽసి నిత్యదా ॥ 3

యస్మాచ్చ సంభవత్యేతత్తస్మాచ్ఛంభురితి ప్రభుః ॥ 4

త్వత్పాదపంకజం ప్రాప్తా వయం సర్వే సురాదయః ।
ఋషయో దేవగంధర్వా విద్యాధరమహోరగాః ॥ 5

తస్మామచ్చ కృపయా శంభో పాహ్యస్మాన్జగతః పతే ॥ 6

*(శ్లో॥9-14,అధ్యా.1-7)*

"ప్రభూ! అజ్ఞానులమైన మేమంతా నీ దివ్యలింగం నిజరూపాన్ని తెలుసుకోలేకపోయాము. నీవే తల్లివి, తండ్రివి, బంధువు, సఖుడు, నీవే ఈశ్వరుడివి. వేదాలు తెలిసినవాడివి. ఒకే రూపం కలిగినవాడివి. మహాపురుషుల చేత ధ్యానించబడేవాడివి. వేరు వేరు కర్రలలో ఉండే నిప్పులాగా నీవు కూడా అన్ని భూతాల్లో వేరు వేరుగా ఉన్నప్పటికీ ఒక్కడివే. నీ నుంచే ఈ సర్వం వెలువడుతోంది. కాబట్టి నీవు నిత్యుడని, సర్వుడనీ పిలవబడుతున్నావు. ఈ సృష్టి మొత్తం నీనుంచే ఆవిర్భవిస్తోంది. కనుక నీవే శంభుడివి. దేవతలమైన మేమంతా నీ పాదాలని శరణు వేడుకుంటున్నాం. ఈ జగత్తునంతా పాలించే శంకరా! మమ్మల్ని కరుణించి రక్షించు"అని ప్రార్థించారు.

ఋషుల ప్రార్ధన విన్న శంకరుడు ప్రత్యక్షమై "మీరంతా శ్రీహరిని ప్రార్థించండి. ఆయనే మిమ్మల్ని రక్షించగల సమర్థుడు" అని చెప్పాడు.

శంకరుడి మాటలు విని దేవతలంతా శ్రీహరిని ఇలా స్తుతించారు.

విద్యాధరాః సురగణాః ఋషయశ్చ సర్వే ।
త్రాత్రాస్త్వయాద్య సకలాజగదేక బంధో ॥
తద్వత్ కృపాకర జనాన్పరిపాలయాద్య ।
త్రైలోక్యనాథ జగదీశ జగన్నివాస ॥ *(శ్లో॥17,అధ్యా 1-7)*

"పరమేశ్వరా! నీవు అణువు కన్నా పరమాణువువి. అలాగే మహత్తుకన్నా గొప్ప మహత్తువి. కనుక ఓ పరమేశ్వరా! నీ మహాలింగాన్ని అందరికీ, అన్ని లోకాలవారికీ నిత్యం పూజించుకునేందుకు అనువుగా మార్చు స్వామీ" అని ప్రార్థించారు. అప్పుడు శివుడు వారి కోరికని మన్నించి తన మహాలింగాన్ని విభజించి ఇలా అన్నిలోకాల్లో స్థాపించి వాటిలో స్వయంగా కొలువున్నాడు.

1.సత్యలోకంలో - బ్రహ్మేశ్వరలింగంగా, 2.వైకుంఠంలో - సదాశివ లింగంగా 3.అమరావతి (స్వర్గం)లో - అమరేశ్వరలింగంగా 4.పడమర దిక్కులో - వరుణేశ్వర లింగంగా 5.దక్షిణ దిశలో -కాళేశ్వర లింగంగా 6.నైరుతి దిశలో - నైఋతేశ్వర లింగంగా 7.వాయువ్యంలో - పావనేశ్వర లింగంగా 8.మృత్యులోకంలో - కేదారేశ్వర లింగంగా కొలువున్నాడు.

అదేవిధంగా భూలోకంలో నర్మదాతీరంలో ఓంకారేశ్వరుడుగా, మహాకాళీ క్షేత్రంలో మహాకాలుడిగా, కాశీక్షేత్రంలో విశ్వేశ్వరుడుగా, ప్రయాగలో లలితేశ్వరుడుగా బ్రహ్మగిరిలో త్ర్యంబకేశ్వరుడుగా, గంగాసాగర సంగమస్థలంలో భద్రేశ్వరుడుగా, సౌరాష్ట్రంలో సోమేశ్వరుడుగా, శ్రీశైలంలో మల్లేశ్వరుడుగా, వింధ్యగిరి మీద సర్వేశ్వరుడిగా, సింహళ దేశంలో సింహనాథుడుగా, పాతాళంలో భోగేశ్వరుడిగా ఇలా వివిధ ప్రాంతాల్లో తన దివ్యలింగాన్ని అసంఖ్యాకంగా స్థాపించి స్వయంగా వాటిలో కొలువై ఉన్నాడు సర్వేశ్వరుడు.

ఆ విధంగా పరమేశ్వరుడి మహాలింగం నుంచి అన్ని లోకాలలో కోట్లాది శివలింగాలు ఆవిర్భవించాయి. ఇవన్నీ సాక్షాత్తు పరమేశ్వరుడు స్వయంగా కొలువుండే దివ్యలింగాలు. వీటిలో ఏ ఒక్క శివలింగాన్ని పూజించినా అనంతమైన పుణ్యం కలుగుతుంది. అంత్యకాలంలో శివసాయుజ్యం కూడా లభిస్తుంది.

## శివభక్తి గొప్పదనం

పూర్వం ఒకానొక నగరంలో సంఘంచేత బహిష్కృతుడైన ఒక దొంగ ఉండేవాడు. వాడు ఎంతో దుర్మార్గుడు. శిశుహత్యలు చేసాడు. మద్యపానం రోజూ చేస్తాడు. జూదరి, లంపటుడు. వాడికి లేని దుర్గుణం లేదు. ఎప్పుడూ తనలాగే వ్యసనపరులతో, దుర్మార్గులతో కలిసి సంచరిస్తుంటాడు. అయితే అతడొక శివభక్తుడు.

ఒకనాడా దుర్మార్గుడు జూదం ఆడటానికి జూదశాలకి వెళ్ళాడు. అక్కడ ఆట ఆడుతూ ఆడుతూ చివరికి ఓడిపోయాడు. చేతిలో ఉన్న డబ్బంతా అయిపోయింది. డబ్బులేదని చెప్పాడు. ఆ మాట విని కోపంతో గెలిచిన జూదరులంతా ఇతన్ని దారుణంగా కొట్టారు. అయినా అతడు ఉలకలేదు పలకలేదు. అప్పుడొక జూదరి ఇతన్ని పైకి లేపి మర్యాదగా జూదంలో ఓడిన డబ్బు ఇస్తావా! చస్తావా! అని గద్దించాడు. ఈ రోజు రాత్రికి ధనాన్ని తెచ్చిస్తానని చెప్పాడు ఆ తస్కరుడు.

జూదంలో ఓడిన దొంగకి ధనం ఎలా తేవాలో తోచలేదు. ఆరోజు రాత్రి అక్కడున్న ఒక శివాలయానికి వెళ్ళాడు. శివలింగంపైన వెండిగంట కనిపించింది. దాన్ని దొంగలించి ఆ ధనంతో తన అప్పు తీరుద్దామనుకున్నాడు. వెంటనే యుక్తాయుక్తాలు మరిచి శివలింగం మీదకి ఎక్కి గంటను అందుకోబోయాడు. అదే సమయంలో కైలాసంలో వున్న తన కింకరులతో శివుడిలా అన్నాడు. "కింకరులారా! ఇప్పుడు భూలోకంలో నా తలమీదకెక్కి గంటని దొంగలించే దొంగ నా భక్తుడు. నాకెంతో ప్రీతి పాత్రుడు" అని చెప్పి వీరభద్రుణ్ణి పిలిచి "వీరభద్రా! నీవు వెంటనే భూలోకంలో దొంగ వున్న శివాలయానికి వెళ్ళి అతణ్ణి తీసుకురా! అని ఆజ్ఞాపించాడు. శివాజ్ఞ ననుసరించి వీరభద్రుడు ప్రమథ గణాల్ని వెంటబెట్టుకుని దొంగ వున్న ఆలయం దగ్గరకి వెళ్ళాడు.

ప్రమథగణాల కోలాహలం వినగానే దొంగకి భయంవేసింది. వెంటనే లింగిం దిగి పారిపోబోయాడు. అంతలో వీరభద్రుడు అక్కడికి వచ్చి ఓరీ మూర్ఖుడా! ఎందుకలా పరుగెడుతున్నావు. పరమేశ్వరుడు నిన్ననుగ్రహించాడు. ఎక్కడికి పోతావు. ఇటురా! ఇదిగో ఈ దివ్యవిమానాన్ని ఎక్కు అని సాదరంగా ఆహ్వానించాడు.

వీరభద్రుడి మాట వినగానే ఆ దొంగకి ధైర్యం వచ్చింది. వెంటనే వెనక్కి వచ్చాడు. వీరభద్రుడు అతన్ని ఎక్కించుకుని కైలాసానికి తీసుకువెళ్ళాడు. అలా ఆ దొంగ శివానుగ్రహంతో శివలోకంలో పరిచారకుడిగా మారాడు. కనుక జీవులందరికీ బాగా ఉండాల్సింది శివభక్తి.

## లింగార్చన

ధర్మమాత్సంతికం తుచ్ఛం నశ్వరంక్షణభంగురమ్ ।
యోవిష్ణుః సశివోజ్ఞేయో యఃశివో విష్ణురేవచ ॥
పీఠికా విష్ణురూపం స్యాల్లింగరూపీ మహేశ్వరః ।
తస్మాల్లింగార్చనం శ్రేష్ఠం సర్వేషామపి వైద్విజాః ॥

*(శ్లో॥20-21,అధ్యా 1-8)*

సదా జగత్తుని సృష్టించి, పోషించి, లయం చేసే పరమేశ్వరుణ్ణి వదిలి, మూర్ఖత్వంతో క్షణభంగురమైన ధర్మాన్ని సేవించేవారు పరమమూర్ఖులు. అందరూ తెలుసుకోవలసింది ఏమిటంటే! శివుడే విష్ణువు. విష్ణువే శివుడు. పీఠం శ్రీహరి రూపమైతే పైనున్న లింగం ఈశ్వర రూపం. కనుక లింగార్చనమే సర్వశ్రేష్ఠమైనది.

## దేవతలు - పూజించే లింగాలు

బ్రహ్మదేవుడు ఎప్పుడూ మణిమయమైన శివలింగాన్నే పూజిస్తాడు. ఇంద్రుడు రత్నాలతో చేసిన లింగాన్ని, చంద్రుడు ముత్యాలతో చేసిన లింగాన్ని, సూర్యుడు రాగితో చేసిన లింగాన్ని నిత్యం పూజిస్తారు. అలాగే కుబేరుడు బంగారంతో చేసిన లింగాన్ని, వరుణుడు ఎర్రటిరాతితో చేసిన లింగాన్ని, యముడు నీలం రంగులింగాన్ని, నిర్బతి వెండితో చేసిన లింగాన్ని, వాయుదేవుడు మంచులింగాన్ని, ప్రతిరోజూ నియమంగా పూజిస్తారు. అలాగే మిగిలిన లోక పాలకులందరూ నిత్యం లింగపూజ చేసేవారే.

ఇక పాతాళంలో ప్రహ్లాదుడు బలిచక్రవర్తి లాంటివాళ్ళు విష్ణుభక్తులుగా వుండగా, విభీషణాది రాక్షసులు, శివలింగాన్ని నిత్యం సేవిస్తుంటారు. వారిలో బలి, నముచి, హిరణ్యకశిపుడు, వృషపర్వుడు, వృషుడు, సంహ్రదుడు, బాణుడు, ఇంకా శుక్రాచార్యుడి శిష్యులైన మరికొంతమంది దానవులు శివభక్తి పరాయణులు. రాక్షసుల్లో అందరూ నిత్యం శివుణ్ణి పూజిస్తారు. శివపూజా దురంధరులైన వారిలో ప్రముఖులు – హేతి, ప్రహేతి, సంయాతి, విఘనుడు, ప్రఘనుడు, విద్యుజిహ్వుడు, తీక్ష్ణ దంష్ట్రుడు, ధూమ్రాక్షుడు, మాలి, సుమాలి, మాల్యవంతుడు విద్యుత్కేశుడు రావణుడు, కుంభకర్ణుడు – వీరంతా నిరంతరం శివలింగార్చన చేసి ఎన్నో సిద్ధుల్ని పొందారు.

## పరమేశ్వరుడు చెప్పిన గణపతి పూజ

మాసంలో వచ్చే ప్రతిపక్షంలో చతుర్థితిథినాడు గణేశ్వరుణ్ణి పూజించాలి. ఈ రెండు పక్షాలలో శుక్లపక్ష చతుర్థి శ్రేష్ఠమైనది. ఈ శుక్ల పక్ష చతుర్థినాడు ఉదయాన్నే తెల్ల నువ్వులు కలిపిన నీళ్ళతో స్నానం చేయాలి. తరువాత

యథావిధిగా నిత్యపూజాదికాలు నిర్వహించి, గణపతి ప్రతిమని స్థాపించాలి. ముందుగా గణపతిని ధ్యానించాలి. గణపతికి ఎన్నో పేర్లున్నాయి. వాటిలో ప్రధానమైన నామాలని పూజచేసేడప్పుడు పఠించాలి.

పంచవక్త్రో గణాధ్యక్షో దశబాహు స్త్రిలోచనః ।
కాంతస్ఫటిక సంకాశో నీలకంఠో గజాననః ॥

*(శ్లో॥5,అధ్యా. 1-11)*

1.ఐదు తలలు కలిగినవాడు 2.గణాలకి అధిపతి 3.పదిచేతులు కలిగినవాడు 4.మూడు కళ్ళు కలిగినవాడు 5.అందమైన స్ఫటికం లాంటి కాంతితో మెరిసిపోయేవాడు 6.నీలం రంగు కంఠం కలిగినవాడు 7.గజాననుడు అనేవి గణపతి ప్రధాన నామాలు.

గణపతికున్న అయిదుతలలూ అయిదురకాలైన వర్ణాలతో విభిన్నంగా ఉంటాయి. ఆయన చేతిలో ఉన్న ఆయుధాలు పదిరకాలుగా ఉంటాయి.

## గణపతి తలలు - ఆయుధాలు

మధ్యమం తు ముఖం గౌరం చతుర్దస్తం త్రిలోచనమ్ ।
శుండాదండమనోజ్ఞం చ పుష్కరే మోదకాన్వితమ్ ॥

తథాన్యత్పీతవర్ణం చ నీలం చ శుభలక్షణమ్ ।
పింగళం చ తథా శుభ్రం గణేశస్య శుభాననమ్ ॥

తథా దశభుజేష్వే హ్యాయుధాని బ్రవీమి వః ।
పాశం పరశుపద్మే చ అంకుశం దంతమేవ చ ॥

అక్షమాలాం లాంగలం చ ముసలం వరదం తథా ।
పూర్ణం చ మోదకైః పాత్రం పాణినా చ విచింతయేత్ ॥

లంబోదరం విరూపాక్షం నివీతం మేఖలాన్వితమ్ ।
యోగాసనే చోపావిష్టం చంద్రలేఖాంకశేకరమ్ ॥

*(శ్లో॥7-11,అధ్యా. 1-11)*

వినాయకుడి మధ్యలో ఉన్న ముఖం ఎర్రటి రంగుతో, మూడు కళ్ళతో ఒక దంతంతో అందంగా వుంటుంది. ఆ దంతంలో ఒక మోదకం కూడా వుంటుంది. మరో ముఖం పసుపు రంగుతో, మరో ముఖం నీలంరంగుతో, మరొక ముఖం ధూమ్ర వర్ణంతో అయిదో ముఖం తెల్లటి వర్ణంతో ప్రకాశిస్తూ వుంటుంది.

గణేశుడి పదిభుజాలలో వరుసగా 1.పాశం 2.పరశువు 3.పద్మం 4.అంకుశం 5.దంతం 6.అక్షమాల 7.నాగలి 8.రోకలి 9.వరాలిచ్చే అభయహస్తం 10.మోదకాలు నిండిన పాత్రని పట్టుకున్న చేయి ఉంటాయి. గణపతిని వీటితో పాటు లంబోదరుణ్ణి, విరూపాక్షుణ్ణి, యజ్ఞోపవీతాన్ని, వడ్డాణాన్ని ధరించినవాడిని, యోగాసనంలో కూర్చున్నవాణ్ణి, చంద్రరేఖని తలమీద ధరించినవాణ్ణి అయిన గణపతి రూపాన్ని భావిస్తూ భక్తితో ధ్యానించాలి.

**గణేశ ధ్యానం :** వినాయకుణ్ణి సాత్త్విక, రాజసిక, తామసిక అనే మూడు రకాలుగా ధ్యానించాలి. పరిశుద్ధమైన బంగారం లాంటి రంగుతో మెరిసిపోయే అలౌకిక గజాననుణ్ణి, నాలుగు భుజాలు మూడుకళ్ళు, ఒక దంతం, పెద్దపొట్ట, పాశం, అంకుశం కలిగిన వాడిగా రాజసికధ్యానాన్ని, దంతంతో మోదకాలపాత్రని ధరించి, నీలం రంగు ముఖంతో వెలుగొందే గణపతి తామస గణపతి. ఈ విధంగా మూడు రకాల ధ్యానాలూ చేసి ఆ తరువాత గరికలతో గణపతిని పూజించాలి.

**గణపతి 21 నామాలు :** గణపతి పూజలో భాగంగా స్వామిని ఈ క్రింది నామాలతో పూజించాలి. ఇవి మొత్తం ఇరవై ఒక్క గణపతి నామాలు. పదకొండు గడ్డిపరకల్ని తీసుకుని దాన్ని ఒక కట్టగా కట్టాలి. అలాంటివి 21 గరిక కట్టల్ని, అలాగే ఇరవై ఒక్క మోదకాలని (లడ్డూలు) పూజలో భాగంగా గణపతికి సమర్పించాలి.

## గణపతి నామాలు

గణాధిపనమస్తేస్తు ఉమాపుత్రాఘనాశన ।
వినాయకేశ పుత్రేతి సర్వసిద్ధి ప్రదాయకః ॥
ఏకదంతే భవక్త్రీతి, తథా మూషక వాహన ।
కుమార గురవే తుభ్య పూజనీయః ప్రయత్నః ॥

*(శ్లో॥17-18,అధ్యా. 1-11)*

1.గణాలకి అధిపతి 2.పార్వతీ పుత్రుడు 3.పాపాల్ని నశింపచేసేవాడు 4.వినాయకుడు 5.ఈశ్వర పుత్రుడు 6.అన్నిరకాల సిద్ధుల్నీ ఇచ్చేవాడు 7.ఒకే దంతం కలిగినవాడు 8.ఏనుగు ముఖంతో ఉన్నవాడు 9.మూషిక వాహనాన్నెక్కినవాడు 10.కుమారస్వామికి గురువుగా ఉన్నవాడు. ఈ నామాలు చెబుతూ గణపతిని అర్చించాలి. ఈ విధంగా గణపతిని పూజిస్తే మీరు చేసే పనులకి ఎలాంటి ఆటంకాలు కలగవు" అని పరమేశ్వరుడు దేవతలందరికీ ఈ గణపతి పూజావిధానాన్ని, దాని ఆవశ్యకతని వివరించాడు. ఆయన చెప్పిన ప్రకారం దేవతలందరూ ప్రతి శుక్ల-కృష్ణ పక్ష చతుర్థీ తిథుల్లో గణపతి పూజచేయటం ప్రారంభించారు. ఆ ఆచారం ఆనాడు ప్రారంభమై నేటివరకూ కొనసాగుతుంది.

## శివ తత్త్వం

పరమేశ్వరుడు జగత్పిత, సర్వాంతర్యామి ఆయన ఎన్నో ఆగమాలతో ఆచార్యమత భేదాలతో స్పష్టంగా తెలియబడే జగద్బంధువు. నిత్యుడు, పరమాత్మ, దైవం, వేదాల ద్వారా తెలుసుకోబడే శివుడు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడని అందరూ గ్రహించలేకపోతున్నారు. ఎవరిచేత ఈ జగత్తంతా సృష్టించబడి, ధరించబడిందో ఎవరిచేత ఆశ్రయించబడిందో ఎవరి అంశతో ఈ ప్రపంచమంతా రూపొందిందో, అలాంటి పరమాత్మ పరబ్రహ్మ వేదాంతం (ఉపనిషత్తుల) ద్వారానే తెలియబడతాడు. వీటి ద్వారా మాత్రమే ఆయన నిజతత్త్వాన్ని తెలుసుకోగలం

ఆఢ్యోవాఽపి దరిద్రోవా ఉత్తమోహ్యధమోఽపివా ।
శివభక్తిరతో నిత్యం శివఏవ న సంశయః ॥ *(శ్లో॥40,అధ్యా. 1-13)*

ధనవంతుడైనా దరిద్రుడైనా, ఉత్తముడైనా, అధముడైనా శివభక్తిని కలిగి, శివతత్త్వాన్ని తెలుసుకున్నట్లయితే, శివపూజ చేసి ఆనందించేవాడే అయితే అతడు సాక్షాత్తు శివుడే అవుతాడు. ఎవరైతే ఇతరులు చేసే శివపూజని చూసి ఆనందిస్తారో, ఆ పూజకి సహకరిస్తారో వారికి పూజచేసిన వాడితో సమానంగా పుణ్యఫలంలో భాగం వస్తుంది.

**దీపారాధన మహిమ :** కార్తీక మాసంలో శ్రద్ధగా శివాలయంలో దీపాలు వెలిగించి శివార్చన చేసేవాడు, ఆ దీపాలు శివుడిదగ్గర ఎంత కాలం వెలుగుతాయో అన్ని యుగాలు స్వర్గలోకంలో నివసిస్తాడు. కౌసుంభ (కుసుమనూనె) తైలంతో దీపాలు వెలిగిస్తే శివలోకం ప్రాప్తిస్తుంది. అతసీ (నల్లఅవిశ) తైలంతో దీపాలుంచిన వారికి శివానుగ్రహం సంపూర్ణంగా కలుగుతుంది. నువ్వుల నూనెతో దీపారాధన చేస్తే తన వంశంలో వందతరాల వారూ తరిస్తారు. ఆవునెయ్యితో దీపారాధన చేసినవారు భోగభాగ్యాలని పొంది తమ పూర్వీకులందర్నీ తరింపచేస్తారు. ఇక దీపాల్ని దానం చేస్తే అఖండమైన పుణ్యఫలం ప్రాప్తిస్తుంది. కర్పూరం, అగరుధూపాలు సమర్పించి శివారాధన చేసేవారు, ప్రతిరోజూ శివుడికి హారతి వెలిగించేవాడు నిస్సందేహంగా శివసాయుజ్యాన్ని పొందుతారు.

రోజుకి ఒకటి లేక రెండు, మూడుసార్లు శివారాధన క్రమం తప్పక చేసేవాడు సాక్షాత్తు రుద్రుడే. శివపూజ చేస్తూ భస్మం రుద్రాక్షలు ధరించినవారికి అక్షయ ఫలం లభిస్తుంది.

## రుద్రాక్ష ధారణ - ఫలితం

పరమేశ్వర స్వరూపాలైన రుద్రాక్షలు శివభక్తుల్ని తరింపచేస్తాయి. ఈ రుద్రాక్షలు ఏకముఖం నుంచి పదహారు ముఖాల దాకా ఉంటాయి. వీటిలో శ్రేష్ఠమైనవి రెండు 1.ఏకముఖి రుద్రాక్ష 2.పంచముఖి రుద్రాక్ష. వీటిని ధరించేవారు శివలోకాన్ని చేరి శివసన్నిధిలో ఆనందంగా కాలం గడుపుతారు.

రుద్రాక్షం పంచముఖస్తథా చైకముఖః స్మృతః ।
యేధారయంత్యేక ముఖం రుద్రాక్ష మనిశం నరాః ॥
రుద్రలోకం చ గచ్ఛంతి మోదంతే రుద్ర సంవిదే ।
జపస్తపః క్రియాయోగః స్నానం దానార్చనాదికమ్ ॥
క్రియతే యచ్ఛుభం కర్మ హ్యనంతం చాక్షధారయేత్ ।

*(శ్లో॥51-53,అధ్యా1-13)*

జపం, తపం, క్రియ, యోగం, స్నానం, దానం, అర్చన అభిషేకం ఇలాంటి కర్మలన్నీ చేస్తే ఎంత పుణ్యం వస్తుందో, రుద్రాక్ష ధారణ వల్ల అంతటి పుణ్యం లభిస్తుంది.

కుక్క మెడలో రుద్రాక్షని కట్టినా అది ఆ కుక్కని తరింపచేస్తుంది. రుద్రాక్ష మాహాత్మ్యం అంతటిది. రుద్రాక్షధారణ వల్ల పాపం నశిస్తుంది. ఈ విధంగా రుద్రాక్ష గొప్పతనాన్ని తెలుసుకున్న వారు తప్పకుండా వీలున్న రుద్రాక్షని మెడలో ధరించాలి.

**విభూతి ధారణ :** త్రయంబక మంత్రాన్ని చదువుతూ పవిత్రమైన విభూతిని ధరించేవారు సాక్షాత్తు శివస్వరూపులే అవుతారు. కపిల వర్ణంలో వుండే ఆవుపేడ నేలమీద పడకుండానే దాన్ని గ్రహించాలి. ఆ పేడని ఎండబెట్టి బాగా ఎండాక కాలిస్తే దాన్నుంచి భస్మం వస్తుంది. అదే నిజమైన విభూతి. శివ ప్రీతికరమైనది. అలాంటి విభూతిని ధరించినవారికి సకల పాపాలూ నశిస్తాయి.

నుదుటిమీద ముందుగా బొటనవేలితో రేఖని ఏర్పర్చి, తరువాత మధ్యవేలు మడిచి రెండువేళ్ళతో మూడు రేఖల్ని ఏర్పర్చుకోవాలి. ఈవిధంగా మూడు రేఖలతో ఎవరైతే విభూతి ధారణ చేస్తాడో వాడిని శివస్వరూపుడిగా భావించాలి. ఇలా త్రిపుండ్రాల్ని ధరించిన వాణ్ణి చూస్తే చాలు పాపాలన్నీ నశిస్తాయి.

శివోహిదాతా లోకానాం కర్తాచైవానుమోదితా ।
శివశక్త్యాత్మకం విశ్వం జానీధ్వంహి ద్విజోత్తమా ॥

శివేతిద్వ్యక్షరం నామ త్రాయతే మహతో భయాత్ ।
తస్మాచ్ఛివ శ్చింత్యతాం వై స్మర్యతాంచ ద్విజోత్తమ ॥

*(శ్లో॥64-65,అధ్యా. 1-13)*

శివుడికన్నా ఈ లోకంలో మించిన దైవం వేరెవరూ లేరు. శాస్త్రాల్లో చెప్పిన విషయసారమంతా శివతత్త్వమే. లోకాలన్నిటికీ దాత, కర్త, అనుమతించే వాడు అన్నీ శివుడే. ఈ విశ్వమంతా శివుడు-శక్తి రూపాత్మకమేనని గ్రహించండి. 'శివ' అనే రెండక్షరాలే భయం నుంచి అందర్నీ రక్షిస్తాయి. కనుక అందరూ శివనామాన్ని జపించాలి, ధ్యానించాలి.

## శని త్రయోదశీ ప్రదోష వ్రతం

పరమేశ్వరుడి సంపూర్ణ అనుగ్రహాన్ని ప్రసాదించి, అన్ని కార్యాలలో దిగ్విజయాన్ని కలిగించే వ్రతం శని త్రయోదశీ ప్రదోష వ్రతం. పూర్వం ఈ వ్రతాన్ని దేవతలకి వృత్రాసురుడి సంగ్రామం జరుగుతున్న సమయంలో బృహస్పతి తొలిసారిగా దేవతలకి ఉపదేశించాడు.

కార్తీక మాసంలో శుక్లపక్ష శనివారంనాడు పూర్తిగా త్రయోదశి తిథి ఉన్నరోజు ఈ వ్రతాన్ని ఆచరించాలి. ఆరోజు ప్రదోషకాలంలో లింగ రూపంలో ఉన్న శివుణ్ణి పూజించినవారికి అన్ని కోరికలూ తీరుతాయి. ఈ ప్రదోష వ్రతాన్ని ఆచరించే రోజు అనగా శనివారం నాడు మధ్యాహ్నం స్నానం చేసి నువ్వులు, ఉసిరి, గంధం, పుష్పాలు, ఫలాలు సేకరించి వాటితో శివార్చన చేయాలి. తరువాత సాయంకాలం. దేవాలయంలో ఉన్న శివలింగానికి గానీ, లేదా తాము స్వయంగా స్థాపించిన (పూజామందిరంలో) శివలింగానికి గానీ, లేదా అరణ్యంలో ఉన్న లింగానికి గానీ విశేషంగా అభిషేకం తిరిగి అర్చన చేయాలి.

గ్రామంలో ఉన్న లింగాన్ని పూజించిన దానికన్నా పదిరెట్లు అధికఫలం గ్రామం వెలుపల ఉన్న శివలింగాన్ని అర్చిస్తే కలుగుతుంది. దానికన్నా పర్వతాల మీద వెలసిన శివలింగాన్ని పూజిస్తే వందరెట్లు అధికఫలం లభిస్తుంది.

దానికన్నా అధిక ఫలం అరణ్యంలో ఉన్న లింగాన్ని పూజిస్తే కలుగుతుంది. వీటన్నిటికన్నా హిమాలయాలు లాంటి తపోవనాల్లో ఉన్న శివలింగాన్ని అర్చిస్తే అత్యధికమైన పుణ్యఫలం లభిస్తుంది. కనుక విజ్ఞులైన వాళ్ళు తమకి అందుబాటులో ఉన్న శివలింగాన్ని పూజించాలి.

ఈ స్నానం కూడా చాలా పవిత్రంగా చేయాలి. ఈ ప్రదోష శివపూజ చేసేవారు బావిజలంతోగానీ, చెరువు, లేక, నదిలో గానీ స్నానం చేస్తే మంచిది. నదీస్నానం చాలా విశేషమైనది. అన్ని తీర్థాల కన్నా గంగాస్నానం మరింత ఉత్తమం. అలాగే సహజ సిద్ధంగా ఏర్పడ్డ జలాశయాల్లో కూడా సాన్నం చేయవచ్చు.

శనివారం ప్రదోషకాలంలో శివలింగం దగ్గర వెయ్యి లేక వంద లేక కనీసం ముప్పైరెండు దీపాలు వెలిగించాలి. శివప్రీతి కలగాలంటే నేతితో దీపం వెలిగించాలి. తరువాత యథావిధిగా శివలింగాన్ని షోడశోపచారాలతో పూజించి యథాశక్తి ధూపదీప నైవేద్యాలు సమర్పించాలి. ఈ విధంగా శివుణ్ణి పూజించిన వారికి సకల కోరికలూ తీరుతాయి. శివుడికి 108 సార్లు ప్రదక్షిణ నమస్కారాలు చేయాలి. ఆ తరువాత పరమేశ్వరుణ్ణి వందనామాలతో ఘనంగా ఇలా స్తుతించాలి.

## పరమేశ్వరుడి శతనామ స్తోత్రం

నమో రుద్రాయ భీమాయ నీలకణ్ఠాయ వేధసే ।
కపర్దినే సురేశాయ వ్యోమకేశాయ వై నమః ॥ 1

వృషధ్వజాయ సోమాయ నీలకణ్ఠాయ వై నమః ।
దిగంబరాయ భర్గాయ ఉమాకాంత కపర్దినే ॥ 2

తమోమయాయ వ్యాప్తాయ శిపివిష్టాయ వై నమః ।
వ్యాళప్రియాయ వ్యాళాయ వ్యాళానాం పతయే నమః ॥ 3

మహీధరాయ వ్యాఘ్రాయ పశూనాం పతయే నమః ।
త్రిపురాంతకసింహాయ శార్దూలోగ్రరవాయ చ ॥ 4

మీనాయ మీననాథాయ సిద్ధాయ పరమేష్ఠినే ।
కామాంతకాయ బుద్ధాయ బుద్ధీనాం పతయే నమః ॥ 5

కపోతాయ విశిష్టాయ శిష్టాయ పరమాత్మనే ।
వేదాయ వేద బీజాయ దేవగుహ్యాయ వై నమః ॥ 6

దీర్ఘాయ దీర్ఘదీర్ఘాయ దీర్ఘార్ఘాయ మహాయ చ ।
నమో జగత్ప్రతిష్ఠాయ వ్యోమరూపాయ వై నమః ॥ 7

గజాసురవినాశాయ హ్యంధకాసురభేదినే ।
నీలలోహితశుక్లాయ చణ్డముణ్డప్రియాయ చ ॥ 8

భక్తప్రియాయ దేవాయ జ్ఞానజ్ఞానావ్యయాయ చ ।
మహేశాయ నమస్తుభ్యం మహాదేవహరాయ చ ॥ 9

త్రినేత్రాయ త్రివేదాయ వేదాంగాయ నమో నమః ।
అర్థాయ అర్థరూపాయ పరమార్థాయ వై నమః ॥ 10

విశ్వరూపాయ విశ్వాయ విశ్వనాథాయ వై నమః ।
శంకరాయ చ కాలాయ కాలావయవరూపిణే ॥ 11

అరూపాయ చ సూక్ష్మాయ సూక్ష్మసూక్ష్మాయ వై నమః ।
శ్మశానవాసినే తుభ్యం నమస్తే కృత్తివాససే ॥ 12

శశాంకశేఖరాయైవ రుద్రవిశ్వాశ్రయాయ చ ।
దుర్గాయ దుర్గసారాయ దుర్గావయవసాక్షిణే ॥ 13

లింగరూపాయ లింగాయ లింగానాం పతయే నమః ।
నమః ప్రణవరూపాయ ప్రణవార్థాయ వై నమః ॥ 14

నమోనమః కారణకారణాయ తే ।
మృత్యుంజయాయాత్మభావస్వరూపిణే ।
త్రియంబకాయాసితకంఠ భర్గ ।
గౌరీపతే సకలమంగళహేతవే నమః ॥ 15

*(శ్లో॥ 75-99, అధ్యా. 1-17)*

రుద్రునకు, భీమునకు, నీలకణ్ఠునకు, వేధకు, కపర్దునకు, సురేశునకు, వ్యోమకేశునకు నమస్కారం. వృషధ్వజునకు, సోమునకు, నీలకణ్ఠునకు, దిగంబరునకు, భర్గునకు, ఉమాకాంతునకు, కపర్దికి నమస్కారం. తమోమయునకు, వ్యాప్తునకు, శిపివిష్టునకు, వ్యాళప్రియునకు, వ్యాళునకు, వ్యాళపతికి నమస్కారం. మహీధరునకు, వ్యాఘ్రునకు, పశుపతికి, త్రిపురాంతకునకు, సింహునకు, శార్దూలోగ్రరవునకు నమస్కారం. మీనునికి, మీననాధునికి, సిద్ధునికి, పరమేష్టికి, కామాంతకునికి, బుద్ధునకు, బుద్ధిపతికి నమస్కారం. కపోతునకు, విశిష్ఠునకు, శిష్టునకు, పరమాత్మకు, వేదునకు, వేదబీజమునకు, దేవగుహ్యునకు నమస్కారం. దీర్ఘునకు, దీర్ఘదీర్ఘునకు, దీర్ఘార్ఘునకు, మహునకు, జగత్ప్రతిష్ఠునకు, వ్యోమరూపునకు నమస్కారం.

గజాసుర వినాశునకు, అంధకాసురభేదికి, నీలలోహిత శుక్లునకు, చణ్డముణ్డ ప్రియునకు నమస్కారం. భక్త ప్రియునకు, దేవునకు, జ్ఞానాజ్ఞాన అవ్యయునకు, మహేశునకు, మహాదేవహరునకు నీకు నమస్కారం. త్రినేత్రునకు, త్రివేదునకు, వేదాంగునకు, అర్థునుకి, అర్థరూపునికి, పరమార్థునికి నమస్కారం. విశ్వరూపునకు, విశ్వునకు, విశ్వనాథునకు, శంకరునకు, కాలునకు, కాలావయవ రూపునకు నమస్కారం. అరూపునకు, సూక్ష్మునకు, సూక్ష్మసూక్ష్మునకు, కృత్తివాసునకు, నమస్కారం. శశాంకశేఖరునికి, రుద్రునికి, విశ్వాశ్రయునికి, దుర్గునికి, దుర్గ సారమునగు వానికి, దుర్గావయవ సాక్షికి, లింగరూపునకు, లింగునికి, లింగపతికి, ప్రణవ రూపునికి, ప్రణవార్థమునకు నమస్కారం. కారణమునకు కారణమగు వానికి, మృత్యుంజయునకు, ఆత్మభవ స్వరూపికి, త్ర్యంబకునికి, అసితికణ్ఠునకు, భర్గునకు, గౌరీపతికి, సకల మంగళహేతువునకు నమస్కారం.

ఈ విధంగా ప్రదోషకాలంలో పరమేశ్వరార్చన చేసి శివశతనామ స్తోత్రాన్ని పఠించినవాడికి అసాధ్యమైన కార్యం మరేదీ ఉండదు.

## పుష్కసుడి వృత్తాంతం

పూర్వం పుష్కసుడనే క్రూరుడైన రాక్షసుడుండేవాడు. అతడు అడవిలో మృగాల్ని వేటాడుతూ వాటిని దారుణంగా వధించేవాడు. భల్లూకాలని, పులుల్ని, సింహాలనే కాక బ్రాహ్మణుల్ని కూడా ప్రత్యేకంగా వెతికి మరీ చంపేవాడు. అతడెంత దుర్మార్గుడో అతడి భార్య కూడా అంతటి దుర్మార్గురాలే. ఈ విధంగా ఆ కిరాతదంపతులిద్దరూ కాలం గడపసాగారు.

ఒకనాడు పుష్కసుడు రాత్రిపూట బిల్వవృక్షం మీదకి దాహం వేస్తే తాగటానికి కొన్ని నీళ్ళు తీసుకుని ఎక్కాడు. దానిమీద కూర్చుని అడవిపందిని చంపాలని అతడి ఉద్దేశం. చేతిలో విల్లు, బాణాలు పట్టుకుని పందిరాక కోసం ఎదురుచూస్తున్నాడు.

అది మాఘకృష్ణ చతుర్దశి. పందిని ఎలాగైనా చంపాలని రాత్రంతా మేలుకునే ఉన్నాడు పుష్కసుడు. పంది ఎంతకీ రాక పోవటంతో అసహనంగా ఆ చెట్టుకున్న బిల్వపత్రాల్ని తెంచి కింద పడేయటం మొదలు పెట్టాడు. అలాగే దాహం కోసం తెచ్చుకున్న నీళ్ళని కొద్దిగా త్రాగి పుక్కిలించి క్రిందకి ఊసాడు. విధివశాత్తు ఆ కిరాతుడు విసిరిన బిల్వాలు, ఊసిన నీళ్ళు ఆ చెట్టు క్రిందే ఒక పక్కగా ఉన్న శివలింగం మీద పడ్డాయి. అలా అతడు తనకి తెలియకుండానే మాఘకృష్ణ చతుర్దశినాడు శివపూజ చేసాడు.

ఇక ఎంతకీ పంది రాకపోయే సరికి బాగా విసుగొచ్చి చెట్టు దిగి క్రింది కొచ్చాడు. అక్కడికి దగ్గర్లో ఉన్న మడుగు దగ్గరకెళ్ళి అందులో ఉన్న చేపల్ని పట్టి చంపటం ప్రారంభించాడు. పుష్కసుడి భార్య 'ఘనోదరి'. ఆమె దుష్టురాలు, పరద్రవ్యాల్ని అపహరించే దుష్టగుణం కలిగింది. భర్త కోసం ఎదురు చూస్తూ ఇంటి దగ్గరున్నది. ఎంతసేపటికి పుష్కసుడు రాలేదు. ఆమెకి కొద్దిగా ఆందోళన కలిగింది. తనలో "అయ్యో! రాత్రి అప్పుడే రెండు ఝాములు గడిచిపోయింది. అంతా చీకటిగా ఉంది. వేటకోసం వెళ్ళిన నా భర్త ఇంకా రాలేదేమిటి? అతడితో వెళ్ళిన వేటగాళ్ళంతా ఇళ్ళకి తిరిగి వచ్చేసారే!

ఒకవేళ వేటాడేడప్పుడు ఏ సింహమో పులో అతణ్ణి చంపేసిందా! లేదా పాముల తలమీద మణులు హరిస్తూ వాటి కాటుకి గురయ్యాడా! తేనెకోసం చెట్టెక్కి కాలుజారి కిందేమైనా పడిపోయాడా! ఏం జరిగుంటుంది? అని పరిపరి విధాలుగా ఆలోచిస్తూ బాధపడసాగింది. ఇలా ఆ రాత్రంతా గడిచిపోయింది.

మర్నాడు ఉదయం కిరాతుడు నిన్న రాత్రి మడుగులోంచి బైటికి తీసి చంపిన చేపల్ని తీసుకుని ఇంటికి బయలుదేరాడు. అప్పుడతడికి తన కోసం ఆహారాన్ని తీసుకుని వెతుకుతూ అడవిలోకొచ్చిన భార్య కనిపించింది. తన భర్తను చూడగానే ఆమెకెంతో ఆనందం కలిగింది" రావయ్యా రా! నేనెంత కంగారుపడ్డానో తెలుసా! నిన్న రాత్రంతా ఎక్కడున్నావు. నువ్వు రాలేదని నిన్నంతా నేను అన్నం కూడా తినలేదు. ఇదుగో అన్నం తీసుకొచ్చాను. ఇద్దరం స్నానం చేసి తిందాం పద" అన్నది.

కిరాతుడు అతడి భార్య ఇద్దరూ కలిసి అక్కడున్న చెరువులో స్నానం చేసారు. ఇద్దరూ కలిసి ఒకచెట్టు క్రింద కూర్చుని భోజనం చేయబోతున్నారు. వాళ్ళిద్దరూ కాస్త ఆదమరచి ఉండగా ఒక కుక్క అక్కడికొచ్చి వాళ్ళు తెచ్చుకున్న అన్నమంతా తినేసింది. దాంతో కిరాతుడి భార్యకి చాలా కోపం వచ్చింది. పక్కనున్న కర్రతో ఆ కుక్కని కొట్టబోయింది. "ఏమయ్యా! ఈ పాపిష్ఠి కుక్క మన అన్నాన్నంతా తినేసింది. ఇంక నువ్వేం తింటావు. నీకు యోగం లేదు. ఇలా ఆకలితో ఉండాల్సిందే" అని నిష్ఠూరంగా అంది.

భార్య మాటలు విని పుష్కసుడు ఆమెతో "సఖీ! ఆ కుక్క మన అన్నం తిన్నందుకు నాకు చాలా సంతోషంగా వుంది. క్షణ భంగురమైన ఈ శరీరాన్ని నిలుపుకోవటం వల్ల ఏం ప్రయోజనముంది? ఒక్కపూట తినకపోతే ఏమీ కాదులే! నువ్వు అనవసరంగా ఆవేశపడకు. కోపం వీడి శాంతంగా ఉండు" అని హితబోధ చేసాడు.

ఆ విధంగా పుష్కసుడు తనకి తెలియకుండానే చతుర్దశినాడు జాగారం చేసి, శివరాత్రి వ్రతం వల్ల ఎలాంటి పుణ్యఫలం లభిస్తుందో దాన్ని పొందాడు.

అమావాస్య రోజు రెండు ఘడియలు దాటాక ఎన్నో శివగణాలు పుష్కసుడి దగ్గరకొచ్చాయి. అంతమంది శివగణాల్ని చూసి ఆశ్చర్యపోయి వారితో "అయ్యా! మీరంతా ఎవరు? అందరూ విభూతి రుద్రాక్షల్ని ధరించి కనిపిస్తున్నారు. ఎందుకిక్కడికొచ్చారు? అని ప్రశ్నించాడు.

పుష్కసుడితో రుద్రగణాలు ఇలా అన్నారు. "కిరాతా! పరమేశ్వరుడు పంపించగా మేమంతా ఇలా వచ్చాం. నీ భార్యతో సహా నిన్ను కైలాసానికి ఆయన తీసుకురమ్మన్నాడు. రా వచ్చి మీ ఇద్దరూ ఈ విమానాన్ని ఎక్కండి. "నీవు నిన్న మహాశివరాత్రినాడు నీకు తెలియకుండానే లింగార్చన చేసావు. ఆ పుణ్యకర్మ ఫలితంగా శివలోక ప్రాప్తి నీకు కలిగింది. నీ భార్య కూడా నీ కోసం ఎదురు చూస్తూ రాత్రంతా నీ లాగానే జాగారం చేసింది. నీవు రాలేదనే బెంగతో ఉపవాసముంది. మీ ఇద్దరూ చేసిన ఉపవాస, జాగరణ వల్ల పరమేశ్వరుడు ఎంతో సంతోషించాడు. అందుకే మీకీ దివ్యయోగం కలిగింది" అని చెప్పారు.

శివగణాల మాటలు విన్న పుష్కసుడు అతడి భార్య ఎంతో ఆనందించారు. వెంటనే శివగణాలతో కలిసి విమానాన్ని ఎక్కి కైలాసానికి వెళ్ళిపోయారు.

## ఓంకార మాహాత్మ్యం

అకారః కథితో బ్రహ్మా ఉకారో విష్ణురుచ్యతే ।
మకారశ్చ స్మృతో రుద్రస్త్రయశ్చైతే గుణాఃస్మృతాః ॥
అర్ధమాత్రా చ యామూర్ధ్ని పరమః ససదాశివః ।
ఏవమోంకార మాహాత్మ్యం శ్రుతిరేషా సనాతనీ ॥

*(శ్లో॥68-69,అధ్యా.2-5)*

ఓంకారం పరబ్రహ్మ స్వరూపం. ఇందులో ఉన్న 'అ'కారం బ్రహ్మ స్వరూపం కాగా 'ఉ' కారం విష్ణువు. 'మ' కారం రుద్రుడు. ఈ మూడూ కలిసింది ఓంకారం. దీనికి పైనున్న అర్ధమాత్ర సదాశివుడు. ఇదే ఓంకార మాహాత్మ్యం అని వేదాలు చెబుతున్నాయి.

ఓంకారం గొప్పతనం గురించి వాస్తవంగా చెప్పాలంటే వేల సంవత్సరాలైనా సాధ్యం కాదు. దాని మహిమని వివరించటం కోట్లకొద్దీ గ్రంథాల వల్లకూడా కాదు.

అక్షరదేవతలు అక్షరాలలో 'అ' నుంచి 'అః' వరకూ ఉన్న పద్నాలుగు అక్షరాలు 1.స్వాయంభువ 2.స్వారోచిష 3.జేత్తమ 4.రైవత 5.తామస 6.చాక్షుష 7.వైవస్వత 8.సావర్ణి 9.బ్రహ్మ సావర్ణి 10.రుద్ర సావర్ణి 11.దక్షసావర్ణి 12.ధర్మసావర్ణి 13.రౌచ్యుడు 14.భీముడు అనే పద్నాలుగు మంది మనువులు. వీరందరి వర్ణాలు వరుసగా 1.తెలుపు 2.పాండురంగు 3.ఎరుపు 4.రాగిరంగు 5.పసుపు 6.కపిల వర్ణం 7.నలుపు 8.గాఢమైననలుపు 9.బూడిదరంగు 10.దుమ్మురంగు 11.పిశంగవర్ణం 12.మూడు వర్ణాలు కలిసిన రంగు 13.చిత్రవర్ణం 14.అన్ని రకాల రంగులు కలిసిన వర్ణం.

వైవస్వత మనువు అక్షరాలలో 'క్ష' కారం ఆయన వర్ణం నలుపు. 'క' నుంచి 'హ' వరకూ ఉన్న అక్షరాలు మొత్తం ముప్పై మూడు మంది దేవతలు. 'క' నుంచి 'ఠ' వరకు పన్నెండు మంది ఆదిత్యులు. ఆ పన్నెండు మందీ ఎవరంటే? 1.ధాత 2.మిత్రుడు 3.అర్యముడు 4.శక్రుడు 5.వరుణుడు 6.అంశువు 7.గుడు 8.వివస్వంతుడు 9.పూష 10.సవిత 11.త్వష్ట 12.విష్ణువు అనేవారు. అక్షరాలలో 'డ' నుంచి 'బ' వరకూ ఉన్న అక్షరాలు ఏకాదశ రుద్రులు. వీరెవరంటే 1.కపాలి 2.పింగళి 3.భీమ 4.విరూపాక్ష 5.విలోహిత 6.అజక 7.శాసన 8.శాస్తా 9.శంభు 10.చండ 11.భవ అనేవారు.

'భ' కారం నుంచి 'ష' కారం వరకూ ఉన్న ఎనిమిది అక్షరాలు 1.ధ్రువ 2.ఘోర 3.సోమ 4.ఆప 5.అనిల 6.ప్రత్యూష 7.నల 8.ప్రభాస అనే ఎనిమిది మంది మహాపురుషులు. ఇక 'హ' కారం ఇద్దరు అశ్వినీదేవతల స్వరూపం. ఈ మొత్తం 33 అక్షరాలు.

అక్షరాలలో ఉండే అనుస్వారం, విసర్గ, జిహ్వామూలీయం, ఉపధ్మానీయం అనేవి 1.జారాయుజ 2.అండజాలు 3.స్వేదజాలు 4.ఉద్భిజాలు అనే జీవాలు స్వరూపాలు.

ఈ అక్షరాలలో ఉన్న దేవతల్ని ఆశ్రయించి క్రియలు ఆచరించేవారే (పుణ్యకర్మలు) అర్థరూపమైన నిత్య పదంలో లీనమౌతారు. మనసు ద్వారా, మాటద్వారా, చేతల ద్వారా దేవతల్ని శ్రద్ధగా పూజించినవాడే నాలుగు జీవయోనుల నుంచీ విముక్తుడై మోక్షాన్ని పొందుతాడు.

## నారదుడు దర్శించిన కైలాసం

ఒకనాడు త్రిలోక సంచారి అయిన నారదమహర్షి పరమేశ్వరుణ్ణి దర్శించుకోవటానికి చంద్రుడిలా తెల్లగా ప్రకాశించే కైలాస పర్వతానికి వెళ్ళాడు. అమృతంతో సేవించబడుతున్నట్టుగా వున్న ఆ కైలాసం కర్పూరంలాగా తెల్లగా అద్భుతంగా ఉండటం చూసి నారదుడెంతో ఆశ్చర్యాన్ని ఆనందాన్ని పొందాడు.

దివ్యమైన ఆ కైలాసం గానం చేస్తున్న విద్యాధర స్త్రీలతో ఎంతో గొప్పగా ఉంది. ఎన్నో కల్పవృక్షాల లతలతో పెనవేసుకుని కనిపిస్తోంది. ఆ కల్పవృక్షాల నీడల్లో విశిష్ఠమైన కామధేనువులున్నాయి. అక్కడున్న పారిజాత వృక్షాల పూలవాసనల్ని పీల్చాలని తుమ్మెదలు తిరుగుతున్నాయి. ఆ పర్వతం మీదున్న సరస్సుల్లో కలహంసలు అందంగా సంచరిస్తున్నాయి. నెమళ్ళు ఆనందంగా కేకారావాలు చేస్తూ నర్తిస్తున్నాయి. మదించిన పక్షులు పంచమస్వరంతో అందంగా అరుస్తున్నాయి. ఎంతో గంభీరంగా కనిపిస్తున్న మత్తగజాలు ఆడేనుగులతో విహరిస్తున్నాయి.

సింహాలు భీకరంగా గర్జిస్తున్నాయి. నందిలాంటి వృషభరాజాలు నిరంతరం అంభారావాలు చేస్తున్నాయి. ఎన్నో రకాల దేవదారు, చందన వృక్షాలు అక్కడున్నాయి. నాగ-పున్నాగ, వకుళ, చంపక, నాగకేసర, నేరేడు, బంగారు కేతుక వృక్షాలు చాలా వున్నాయి. కల్హారాలు, కరవీరాలు, కుముదాలు, మందర, రేగి, కముక, పాటల వృక్షాలు శివుడికెంతో ఆనందాన్ని కలిగిస్తున్నాయి.

ఆకాశం నుంచి జాలువారుతున్న గంగా ప్రవాహం పరమాద్భుతంగా ఆ కొండలోయల్లో పడి ప్రవహిస్తోంది. ఆ గంగ నీళ్ళతోనే ఈ ప్రపంచమంతా పవిత్రం చేయబడింది. ఆ ప్రవాహం రెండుగా కనిపిస్తోంది. నారదుడు ఆ సుందర దృశ్యాల్ని చూస్తూ, ఆనందిస్తూ క్రమంగా కైలాస ద్వారం దగ్గరకి వెళ్ళాడు.

ఆశ్చర్యకరంగా ఇద్దరు కృత్రిమ ద్వారపాలకులు విశ్వకర్మచే చేయబడ్డవారు అక్కడున్నారు. వారిని చూసి నిజమైనవారేనని భ్రమపడ్డ నారదుడు వారి దగ్గరకెళ్ళి "అయ్యా! దయచేసి శివుణ్ణి దర్శించటానికి నన్ననుమతిస్తారా!" అని ప్రార్థించాడు. వారాయన మాటల్ని వినకపోవటం చూసి నారదుడు ఆశ్చర్యపోయాడు.

కొద్ది సేపటికి ఆయనకి తెలిసింది. ఆ ద్వార పాలకులిద్దరూ నిజమైన వారు కారని నెమ్మదిగా కైలాసద్వారం దాటి లోపలికి ప్రవేశించాడు. దారిలో నిజమైన ద్వారపాలకులు కనిపించి నారదుడికి నమస్కరించారు. ఈ విధంగా ఎన్నో విచిత్ర దృశ్యాల్ని చూస్తూ నారదుడు చివరికి కైలాస శిఖం మీద పార్వతీ సహితుడైన పరమేశ్వరుణ్ణి దర్శించాడు.

## నారదుడు చూసిన పరమేశ్వరుడు

నారదుడు దర్శించిన పరమేశ్వరుడు ఎంత వైభవంగా ఉన్నాడంటే! – శంకరుడి అర్ధాసనం మీద పార్వతీదేవి దివ్యంగా కొలువుంది. ముల్లోకాలకీ ప్రభువైన శంకరుడు పార్వతీ సహితుడై సర్వాంగ సుందరుడిగా శోభిస్తున్నాడు. సర్వ శ్రేష్ఠుడు 'శంఖుడనే' సేవకుడు పరమేశ్వరుడి పాద కమలాలని అర్చిస్తున్నాడు. అతడితో పాటు ధృతరాష్ట్రుడు తక్షకుడు, పద్ముడు, శేషుడు లాంటి సర్పరాజులు కూడా పార్వతీ పరమేశ్వరుల్ని సేవిస్తున్నారు.

గొప్పవాడైన వాసుకి శివుడి కంఠానికి చుట్టుకుని హారంలాగా శోభిస్తున్నాడు. కంబళ, అశ్వతరాలనే నాగులు శివుడికి కర్ణాభరణాలుగా వున్నారు. మరికొన్ని జాతి సర్పాలు ఆయన జటాజూటంలో వ్రేలాడుతున్నాయి. ఇంకా ఇతర జాతులకి చెందిన తక్షక, కులిక, శంఖ, పద్మ, సుదంభ, కరాళ తదితర విషసర్పాలు త్రిలోక పూజ్యుడైన శివుడికి అంగాలుగా మారాయి. ఈ సర్పాలలో కొన్ని ఒక పడగతో మరికొన్ని రెండు పడగలతో, ఇంకొన్ని మూడు, నాలుగు, ఐదు పడగలతో శోభిస్తున్నాయి. అలా సర్పాలంకార భూషితుడైన శంకరుణ్ణి నారదుడు దర్శించాడు.

పరమేశ్వరుడు హారాలుగా ధరించిన సర్పాల తలల మీదున్న మణులు ఆయనకి భూషణాలుగా ప్రకాశిస్తున్నాయి. తలమీద అర్ధచంద్రుడు, నుదుటిమీద మూడో కంటితో ఎంతో సుందరంగా వున్నాడు శివుడు. ఆయన వక్షఃస్థలం, జఘనం, ఎంతో విశాలంగా వున్నాయి. ఆయన దివ్యపాదాలు అందంగా విరాజిల్లుతున్నాయి. అలా విరాజిల్లే చరణాల్ని దర్శించాడు నారదుడు. పరమేశ్వర పాదాలు సాటిలేనివి. సంధ్యారాగకాంతితో మంగళకరంగా ప్రకాశిస్తూ జనుల తాపాల్ని పోగొట్టేవి. అందరికీ సుఖాన్ని అందించేవి ఆ సుందరపాదాలు.

ఆ విధంగా భగవంతుడికి ప్రీతిపాత్రుడైన నారదమహర్షి దివ్య తేజస్సుతో వెలిగిపోతున్న పార్వతీ పరమేశ్వరుల్ని దర్శించి, భక్తిపూర్వకంగా నమస్కరించి....

నతోఽస్మ్యహం దేవవశే యువాభ్యాం పరాత్పరాభ్యాం కళయాతథాపి ।
దృష్ట్వామయా దంపతీ రాజమానే యౌబీజభూతే స చరాచరస్య ॥

"పార్వతీ పరమేశ్వరులారా! పరాత్పరులైన మీ ఇద్దరికీ నమస్కరిస్తున్నాను. ఈ చరాచర జగత్తుకీ ఆది దంపతులైన మిమ్మల్ని దర్శించాను. జగత్తుకి మీరే తల్లి తండ్రులుగా గ్రహించాను. మీదయ అపారం" ఇలా నారదుడు ప్రార్థించగా విని పార్వతీ పరమేశ్వరులు ఎంతో సంతోషించారు.

## బ్రాహ్మణులలో భేదాలు

శ్రీమహావిష్ణువు ముఖం నుంచి ఆవిర్భవించిన బ్రాహ్మణులు ఎనిమిది విభాగాలుగా విభాగించబడ్డారు. వారు చేసే క్రియా కలాపాలని బట్టి 1.మాత్ర 2.బ్రాహ్మణ 3.శ్రోత్రియ 4.అనూచాన 5.భ్రూణ 6.ఋషికల్ప 7.ఋషి 8.ముని అని చెప్పబడ్డారు.

మాత్రశ్చ బ్రాహ్మణశ్చైవ శ్రోత్రియశ్చ తతః పరమ్ ।
అనూచానస్తథా భ్రూణ ఋషికల్ప ఋషిర్మునిః ॥ 1

ఏతేహ్యష్టౌ సముద్ధిష్టా బ్రాహ్మణాః ప్రథమం శ్రుతౌ ।
తేషాం పరః పరః శ్రేష్ఠో విద్యావృత్తవిశేషతః ॥ 2

బ్రాహ్మణానాం కులే జాతో జాతిమాత్రో యదా భవేత్ ।
అనుపేతః క్రియాహీనో మాత్ర ఇత్యభిధీయతే ॥ 3

ఏకోద్దేశ్యమతిక్రమ్య వేదస్యాచారవాన్ ఋజుః ।
స బ్రాహ్మణ ఇతి ప్రోక్తో నిభృతః సత్యవాగ్ ఘృణీ ॥ 4

ఏకాం శాఖాం సకల్పాం చ షడ్భిరంగైరధీత్య చ ।
షట్కర్మనిరతో విప్రః శ్రోత్రియో నామ ధర్మవిత్ ॥ 5

వేదావేదాంగతత్త్వజ్ఞః శుద్ధాత్మా పాపవర్జితః ।
శ్రేష్ఠః శ్రోత్రియవాన్ ప్రాజ్ఞః శుద్ధాత్మా పాపవర్జితః ॥ 6

అనూచానగుణోపేతో యజ్ఞస్వాధ్యాయయంత్రితః ।
భ్రూణ ఇత్యుచ్యతే శిష్టైః శేషభోజీ జితేంద్రియః ॥ 7

వైదికం లౌకికం చైవ సర్వజ్ఞానమవాప్య యః ।
ఆశ్రమస్థో వశీ నిత్యమృషికల్ప ఇతి స్మృతః ॥ 8

ఊర్ధ్వరేతా భవత్యగ్ర్యో నియతాశీ న సంశయీ ।
శాపానుగ్రహయోః శక్తః సత్యసంధో భవేదృషిః ॥ 9

నివృత్తః సర్వతత్త్వజ్ఞః కామక్రోధవివర్జితః ।
ధ్యానస్థో నిష్క్రియో దాంతస్తుల్యమృత్కాంచనో మునిః ॥ 10

*(శ్లో॥110-119,అధ్యా.2-5)*

1. **మాత్రుడు :** బ్రాహ్మణకులంలో పుట్టి, కేవలం జాతి మాత్రం చేతనే బ్రాహ్మణుడిగా వుంటూ, ఉపనయననాది సంస్కారాలు లేకుండా సంచరించేవాడు మాత్రుడు అని చెప్పబడతాడు.

2. **బ్రాహ్మణుడు :** వేదంలో కనీసం ఒక భాగాన్నైనా పూర్తిచేసినవాడు, ఆచారాలు పాటించేవాడు, సత్ప్రవర్తన కలిగినవాడు, ఇంద్రియ నిగ్రహం కలిగి సత్యాన్నే పలికే దయాస్వరూపుడు బ్రాహ్మణుడని చెప్పబడతాడు.

**3. శ్రోత్రియుడు :** కల్పాలలో ఏదో ఒక శాఖని, ఆరు వేదాంగాలతో సహా అధ్యయనం చేసినవాడు, యజనం, యాజనం, అధ్యయనం, అధ్యాపనం, దానం, ప్రతిగ్రహణం లాంటి షట్కర్మ నిరతుడు. ధర్మ శాస్త్రాన్ని చక్కగా తెలిసినవాడు శ్రోత్రియుడని పిలువబడతాడు.

**4. అనూచానుడు :** వేదవేదాంగాలని క్షుణ్ణంగా తెలుసుకున్న వాడు, నిర్మలమైనవాడు, ఎలాంటి పాపకర్మలూ చేయని పరమ శ్రోత్రియుడైన వాణ్ణి అనూచానుడు అంటారు.

**5. భ్రూణుడు :** అనూచానుడికున్న గుణాలతో పాటు యజ్ఞయాగాది క్రతువుల్ని చేసేవాడు, స్వాధ్యాయాన్ని నియమంగా చేసేవాడు, ఇంద్రియ నిగ్రహం కలిగినవాడు, శిష్టులు మిగిల్చిన దాన్నే భుజించేవాడు భ్రూణుడు అని పిలువబడతాడు.

**6. ఋషి కల్పుడు :** వైదిక, లౌకికజ్ఞానాన్ని సంపూర్ణంగా పొందినవాడు, ఇంద్రియనిగ్రహం కలిగి ఆశ్రమాలలో నివసించేవాడు ఋషికల్పుడు.

**7. ఋషి :** ఊర్ధ్వ రేతస్కుడు, నియమంగా భుజించేవాడు, స్థిరమైన సంకల్ప శక్తి కలిగినవాడు, శాపాన్ని ఇవ్వటానికీ, ఉపసంహరించటానికీ, అనుగ్రహాన్ని ప్రసాదించటానికీ తగిన సామర్థ్యం కలిగినవాడు. సత్యసంధుడు ఋషి అని చెప్పబడతాడు.

**8. ముని :** వైరాగ్య భావంతో ఉండేవాడు. అన్ని తత్త్వాలూ తెలిసినవాడు, కామక్రోధాది అరిషడ్వర్గాల్ని జయించినవాడు, నిరంతరం ధ్యానంలో, తపస్సులో ఉండేవాడు, లౌకిక కార్యకలాపాల మీద ఎలాంటి ఆసక్తీ లేనివాడు, నిగ్రహానుగ్రహ సమర్థుడు మట్టిపెళ్ళని, బంగారాన్ని సమానంగా చూసేవాడు 'ముని' అని చెప్పబడతాడు.

ఈ విధంగా వంశంచేతా, విద్యచేతా, ప్రవర్తన చేత గొప్పవారిగా ప్రసిద్ధిచెందిన బ్రాహ్మణ శ్రేష్ఠులు "త్రిశుక్లులు" అని పిలువబడుతూ యజ్ఞయాగాది క్రతువుల్లో అందరిచేతా పూజించబడుతుంటారు.

## దేవతలు మహాత్ములు పూజించిన శివలింగాలు

లోకంలో శివుడికన్నా వేరే దైవం లేదు. ఇది ముమ్మాటికీ సత్యం. శివుణ్ణి విడిచి ఇతర దేవతల్ని ఉపాసించేవాడు, చేతిలో ఉన్న అమృతాన్ని విడిచిపెట్టి ఎండమావి వెంట పరుగెత్తినట్టే ఆ చరాచర ప్రపంచమంతా శివభక్తిమయంగా కనిపిస్తుంది. పాపాలు పోగొట్టుకోవాలనుకునేవారు శతరుద్రీయం, రుద్రాధ్యాయాలు పఠిస్తూ శివలింగాన్ని పూజించాలి. ఈ విషయాన్ని గ్రహించిన సకల దేవతలు, దిక్పాలకులు, యోగులు, మహాత్ములు, మహర్షులు వివిధ రకాల శివలింగాల్ని అర్చించి శివానుగ్రహాన్ని సంపూర్ణంగా పొంది తమ జీవితాల్ని సార్థకం చేసుకున్నారు.

## శతరుద్రీయ స్తోత్రం

శ్రుణుధ్వం యది పాపానామిచ్ఛధ్వం క్షాళణం పరమ్ ।
బ్రహ్మా హాటలింగం చ సమారాధ్య కపర్దినః ॥ 1

జగత్ప్రధానమితి చ నామ లబ్ధ్వా విరాజతే ।
కృష్ణమూలే కృష్ణలింగం నామ చార్జితమేవ చ ॥ 2

సనకాద్యైశ్చ తల్లింగం పూజ్యాజయుర్జగద్గతిమ్ ।
దర్భాంకురమయం సప్త మునయో విశ్వయోనికమ్ ॥ 3

నారదస్త్వంతరిక్షే స జగద్బీజమిదం గృణన్ ।
వజ్రమింద్రో లింగమేవం విశ్వాత్మానం చ నామ చ ॥ 4

సూర్యస్తామ్రం తథా లింగం నామ విశ్వసృజం జపన్ ।
చంద్రశ్చ మౌక్తికం లింగం జపన్నామ జగత్పతిమ్ ॥ 5

ఇంద్రనీలమయం వహ్నిర్నామ విశ్వేశ్వరం జపన్ ।
పుష్పరాగం గురుర్లింగం విశ్వయోనిం జపన్ హరమ్ ॥ 6

పద్మరాగమయం శుక్రో విశ్వకర్మేతి నామ చ ।
హేమలింగం చ ధనదో జపన్నామ్నా తథేశ్వరమ్ ॥ 7

రౌప్యజం విశ్వదేవాశ్చ నామాపి జగతాం పతిమ్ ।
వాయవో రీతిజం లింగం శంభుమిత్యేవ నామ చ ॥ 8

కాశజం వసవో లింగం స్వయంభుమితి నామ చ ।
త్రిలోహం మాతరో లింగం నామ భూతేశమేవ చ ॥ 9

లౌహం చ రక్షసాం నామ భూతభవ్యభవోద్భవమ్ ।
గుహ్యకః సీసజం లింగం నామయోగం జపన్తి చ ॥ 10

జైగీషవ్యో బ్రహ్మరంధ్రం నామ యోగేశ్వరం జపన్ ।
నిమిర్నయనయోర్లింగే జపన్ శర్వేతి నామ చ ॥ 11

ధన్వంతరిర్గోమయం చ సర్వలోకేశ్వరమ్ ।
గంధర్వా దారుజం లింగం సర్వశ్రేష్ఠేతి నామ చ ॥ 12

వైఢూర్యం రాఘవో లింగం జగజ్జ్యేష్ఠేతి నామ చ ।
బాణో మారకతం లింగం వసిష్ఠమితి నామ చ ॥ 13

వరుణః స్ఫాటికం లింగం నామ్నా చ పరమేశ్వరమ్ ।
నాగా విద్రుమలింగం చ నామ లోకత్రయంకరమ్ ॥ 14

భారతీ తారలింగం చ నామ లోకత్రయాశ్రితమ్ ।
శనిశ్చ సంగమావర్తే జగన్నాథేతి వామ చ ॥ 15

శనిదేశే మధ్యరాత్రౌ మహీసాగరసంగమే ।
జాతీజం రావణో లింగం జపన్నామ సుదుర్జయమ్ ॥ 16

సిద్ధాశ్చ మానసం నామ కామమృత్యుజరాతిగమ్ ।
ఉంఛజం చ బలిలింగం జ్ఞానాత్మేత్యస్య నామ చ ॥ 17

మరీచిపాః పుష్పజం చ జ్ఞానగమ్యేతి నామ చ ।
శకృతాః శకృతం లింగం జ్ఞానజ్ఞేయేతి నామ చ ॥ 18

ఫేనపాః ఫేనజం లింగం నామ చాపి సుదుర్విదమ్ ।
కపిలో వాలుకాలింగం వరదం చ జపన్ హరమ్ ॥ 19

సారస్వతో వాచిలింగం నామ నాగీశ్వరేతి  చ ।
గణా మూర్తిమయం లింగం నామ రుద్రేతి చాబ్రువన్ ॥ 20

జాంబూనదమయం దేవాః శితికంఠేతి నామ చ ।
శంఖలింగం బుధో నామ కనిష్టమితి సంజపన్ ॥ 21

అశ్వినౌ మృణ్మయం లింగం నామ్నా సువేధసమ్ ।
వినాయకః పిష్ఠలింగం నామ్నా చాపి కపర్దినమ్ ॥ 22

నావనీతం కుజో లింగం నామ చాపి కరాలకమ్ ।
తార్క్ష్య ఓదనలింగం చ హర్యక్షేతి హి నామ చ ॥ 23

గౌడం కామస్తథా లింగం రతిదం చేతి నామ చ ।
శచీ లవణలింగం తు బభ్రుకేతి నామ చ ॥ 24

విశ్వకర్మా చ ప్రాసాదలింగం యామ్యేతి నామ చ ।
వంశాంకురోత్థం సగరో నామ సంగతమేవ చ ॥ 25

రాహుశ్చ రామఠం లింగం నామ గమ్యేతి కీర్తయన్ ।
లేప్యలింగం తథా లక్ష్మీర్హరి నేత్రేతి నామ చ ॥ 26

యోగినః సర్వభూతస్థం స్థాణురిత్యేవ నామ చ ।
నానావిధం మనుష్యాశ్చ పురుషం నామ చ ॥ 27

తేజోమయం చ ఋక్షాణి భగం నామ చ భాస్వరమ్ ।
కిన్నరా ధాతులింగం చ సుదీప్తమితి నామ చ ॥ 28

దేవదేవేతి నామాస్థిలింగం చ బ్రహ్మరాక్షసాః ।
దంతజం వారణా లింగం నామ రంహసమేవ చ ॥ 29

సప్తలోకమయం సాధ్యా బహురూపేతి నామ చ ।
దూర్వాంకురమయం లింగమృతవః సర్వనామ చ ॥ 30

కౌంకుమమప్సరసో లింగం నామ శంభోః ప్రియేతి చ ।
సిందూరజం చోర్వశీ చ నామ చ ప్రియవాసనమ్ ॥ 31

బ్రహ్మచారీ గురులింగం నామ చోష్ణీషిణం విదుః ।
అలక్తకం చ యోగిన్యో నామ చాస్య సుబభ్రుకమ్ ॥ 32

శ్రీఖండం సిద్ధయోగిన్యః సహస్రాక్షేతి నామ చ ।
డాకిన్యో మాంసలింగం చ నామ చాస్య చ మీఢునమ్ ॥ 33

అప్యన్నజం చ మానవో గిరిశేతి చ నామ చ ।
అగస్త్యో వ్రీహిజం చాపి సుశాంతమితి నామ చ ॥ 34

యవజం దేవలో లింగం పరిమిత్యేవనామ చ ।
వల్మీకజం చ వాల్మీకిశ్చరవాసీతి నామ చ ॥ 35

ప్రతర్దనో బాణలింగం హిరణ్యభుజనామ చ ।
రాజికం చ తథా దైత్యా నామ ఉగ్రేతి కీర్తితమ్ ॥ 36

నిష్పావజం దానవాశ్చ లింగనామ చ దిక్పతిమ్ ।
మేఘా నీరమయం లింగం పర్జన్యపతి నామ చ ॥ 37

రాజమాషమయం యక్షా నామ భూతపతిం స్మృతమ్ ।
తిలాన్నజం చ పితరో నామ వృషపతిస్తథా ॥ 38

గౌతమో గోరజమయం నామ గోపతిరేవ చ ।
వానప్రస్థాః ఫలమయం నామ వృక్షావృతేతి చ ॥ 39

స్కందః పాషాణలింగం చ నామ సేనాన్య ఏవ చ ।
నాగశ్చాశ్వతరో ధాన్యం మధ్యమేత్యస్య నామ చ ॥ 40

పురోడాశమయం యజ్వా స్రువహస్తేతి నామ చ ।
యమః కాలాయసమయం నామ ప్రాహ చ ధన్వినామ్ ॥ 41

యవాంకురం జామదగ్న్యో భర్గదైత్యేతి నామ చ ।
పురూరవాశ్చాన్నమయం లింగం నామ నేత్రసహస్రకమ్ ॥ 42

మాంధాతా శర్కరాలింగం నామ బాహుయుగేతి చ ।
గానః పయోమయం లింగం నామ నేత్రసహస్రకమ్ ॥ 43

సాధ్యా భర్తృమయం లింగం నామ విశ్వపతిః స్మృతమ్ ।
నారాయణో నరో మౌంజం సహస్రశిరనామ చ ॥ 44

తార్క్ష్యస్తథా పృథులింగం సహస్రచరణాభిధమ్ ।
పక్షిణో వ్యోమలింగం చ నామ సర్వాత్మకేతి చ ॥ 45

పృథివీ మేరులింగం చ ద్వితనుశ్చాస్య నామ చ ।
భస్మలింగం పశుపతిర్నామ చాస్య మహేశ్వరః ॥ 46

ఋషయో జ్ఞానలింగం చ చిరస్థానేతి నామ చ ।
బ్రాహ్మణా బ్రహ్మలింగం చ నామ జ్యేష్ఠేతి తం విదుః ॥ 47

గోరోజనమయం శేషో నామ పశుపతిః స్మృతమ్ ।
వాసుకిర్విషలింగం చ నామ వై శంకరేతి చ ॥ 48

తక్షకః కాలకూటాఖ్యం బహురూపేతి నామ చ ।
హాలహలం చ కర్కోట ఏకాక్ష ఇతి నామ చ ॥ 49

శృంగీవిషమయం పద్మో నామ ధూర్జటిరేవ చ ।
పుత్రః పితృమయం లింగం విశ్వరూపేతి నామ చ ॥ 50

పారదం చ శివా దేవీ నామ త్ర్యంబక ఏవ చ ।
మత్స్యాద్యాః శాస్త్రలింగం చ నామ చాపి వృషాకపిః ॥ 51

ఏవం కిం బహునోక్తేన యద్యత్సత్త్వం విభూతిమత్ ।
జగత్యామస్తి తజ్జాతం శివారాధనయోగతః ॥ 52

భస్మనో యది వృక్షత్వం జ్ఞాయతే నీరసేవనాత్ ।
శివభక్తి విహీనస్య తతోఽస్య ఫలముచ్యతే ॥ 53

దర్మార్థకామమోక్షాణాం యది ప్రాప్తౌ భవేన్మతిః ।
తతో హరః సమారాధ్యస్త్రిజగత్యాః ప్రదో మతః ॥ 54

య ఇదం శతరుద్రీయం ప్రాతః ప్రాతః పఠిష్యతి ।
తస్య ప్రీతః శివో దేవః ప్రదాస్యత్యఖిలాన్ వరాన్ ॥ 55

నాతః పరం పుణ్యతమం కించిదస్తి మహాఫలమ్ ।
సర్వవేదరహస్యం చ సూర్యేణోక్తమిదం మమ ॥ 56

వాచా చ యత్కృతం పాపం మనసా వాప్యుపార్జితమ్ ।
పాపం తన్నాశమాయాతి కీర్తితే శతరుద్రియే ॥ 57

*(శ్లో॥144-200,అధ్యా. 2-13)*

| | పూజించినవారు | పూజించిన లింగం | లింగంపేరు |
|---|---|---|---|
| 1. | బ్రహ్మదేవుడు | స్వర్ణలింగం | స్వర్ణేశ్వరుడు |
| 2. | సనకాదిమునులు | కృష్ణమూల లింగం | కృష్ణేశ్వరుడు |
| 3. | సప్తర్షులు | దర్భాంకురలింగం | విశ్వయోనుడు |
| 4. | ఇంద్రుడు | వజ్రలింగం | విశ్వాత్మ |
| 5. | సూర్యుడు | తామ్రలింగం | విశ్వసృజుడు |
| 6. | చంద్రుడు | ముత్యపులింగం | జగత్పతి |
| 7. | అగ్ని | ఇంద్రనీలలింగం | విశ్వేశ్వరుడు |
| 8. | శుక్రుడు | పద్మరాగలింగం | విశ్వకర్మ |
| 9. | కుబేరుడు | స్వర్ణలింగం | ఈశ్వరుడు |
| 10. | విశ్వేదేవతలు | స్వర్ణలింగం | జగత్పతి |
| 11. | వాయుదేవుడు | రాతిలింగం | శంభువు |
| 12. | వసుదేవతలు | కాశలింగం | స్వయంభువు |
| 13. | మాతృకలు | త్రిలోహలింగం | భూతేశుడు |
| 14. | రాక్షసులు | లోహలింగం | భూతభవ్యభవోద్భవుడు |
| 15. | గుహ్యకులు | సీసలింగం | యోగుడు |
| 16. | జైగీషవ్యుడు | బ్రహ్మరంధ్రంలో | యోగీశ్వరలింగం |
| 17. | నిమి | నేత్రాలలో | శర్వలింగం |

| | | |
|---|---|---|
| 18. ధన్వంతరి | గోమయలింగం | సర్వలోకేశ్వరేశ్వరుడు |
| 19. గంధర్వులు | దారులింగం | సర్వశ్రేష్ఠుడు |
| 20. రాఘవుడు | వైఢూర్యలింగం | జగజ్జ్యేష్ఠ |
| 21. బాణాసురుడు | మరకతలింగం | వశిష్ఠేశ్వరుడు |
| 22. వరుణుడు | స్ఫటికలింగం | పరమేశ్వరుడు |
| 23. నాగులు | విద్రుమలింగం | లోకత్రయాకరుడు |
| 24. సరస్వతీదేవి | తారలింగం | లోకత్రయాశ్రితుడు |
| 25. శనిదేవుడు | సంగమావర్తంలో | జగన్నాథలింగం |
| 26. రావణాసురుడు | మహీసాగరసంగమంలో | జాతిజలింగం |
| 27. మరీచివులు | పుష్పజలింగం | జ్ఞానగమ్యుడు |
| 28. శకృత్తులు | శకృతలింగం | జ్ఞానజ్ఞేయుడు |
| 29. కపిలుడు | ఫేనజలింగం | సుదిర్విదుడు |
| 30. సారస్వతుడు | వాక్‌లింగం | వాగీశ్వరుడు |
| 31. గణాలు | మూర్తిలింగం | రుద్రుడు |
| 32. దేవతలు | జంబూనదలింగం | శితికంఠుడు |
| 33. బుధుడు | శంఖలింగం | కనిష్ఠుడు |
| 34. అశ్వినులు | మృణ్మయలింగం | సువేధసుడు |
| 35. వినాయకుడు | పిష్టలింగం | కపర్దీశ్వరుడు |
| 36. కుజుడు | నవనీత(వెన్న)లింగం | కరాలకుడు |
| 37. గరుత్మంతుడు | ఓదనలింగం | హర్యక్షుడు |
| 38. మన్మథుడు | గుడ(బెల్లం) లింగం | రతిదుడు |
| 39. శచీదేవి | లవణ(ఉప్పు)లింగం | బభ్రుకేశుడు |
| 40. విశ్వకర్మ | ప్రాసాద లింగం | యామ్య |

| | | |
|---|---|---|
| 41. విభీషణుడు | పాంసులింగం | సహృత్తముడు |
| 42. సగరుడు | వంశాకురలింగం | సంగతుడు |
| 43. రాహువు | రామఠలింగం | గమ్య |
| 44. లక్ష్మీదేవి | లేప్యలింగం | హరినేత్రుడు |
| 45. నక్షత్రాలు | తేజోలింగం | భాస్వరుడు |
| 46. కిన్నరులు | ధాతులింగం | సుదీప్తుడు |
| 47. బ్రహ్మరాక్షసులు | అస్థి(ఎముక)లింగం | దేవదేవుడు |
| 48. వారణులు | దంతజలింగం | రంహసుడు |
| 49. సాధ్యులు | సప్తలోక మయలింగం | బహురూపుడు |
| 50. ఋతువులు | దూర్వాంకుర లింగం | సర్వనామ |
| 51. అప్సరసలు | కుసుమలింగం | శంభుప్రియుడు |
| 52. ఊర్వశి | సిందూరలింగం | ప్రియవాసనుడు |
| 53. బ్రహ్మచారి | గురులింగం | ఉష్ణీషి |
| 54. యోగినిలు | ఆలక్తలింగం | సుబభ్రుకం |
| 55. సిద్ధయోగినులు | శ్రీఖండ లింగం | సహస్రాక్షుడు |
| 56. డాకినీ దేవతలు | మాంసలింగం | మీఢుష |
| 57. మానవుడు | అన్నజలింగం | గిరిశ |
| 58. అగస్త్యుడు | వ్రీహిలింగం | సుశాంతుడు |
| 59. దేవలుడు | యవలింగం | పతి |
| 60. వాల్మీకి | వల్మీకలింగం | చిరవాపి |
| 61. ప్రతర్ధనుడు | బాణలింగం | హిరణ్యభుజుడు |
| 62. దైత్యులు | రాజలింగం | ఉగ్రుడు |
| 63. దానవులు | నిష్పావజలింగం | దిక్పతి |

| | | |
|---|---|---|
| 64. మేఘాలు | వీరమయలింగం | పర్జన్యపతి |
| 65. యక్షులు | రాజమాషలింగం | భూతపతి |
| 66. పితృదేవతలు | తిలాన్నజలింగం | వృషపతి |
| 67. గౌతముడు | గోరజమయలింగం | గోపతి |
| 68. వానప్రస్థుడు | ఫలమయలింగం | వృక్షావృతుడు |
| 69. స్కందుడు | పాషాణ లింగం | సేవాస్యుడు |
| 70. అశ్వతరసుడు | ధ్యానలింగం | మధ్యమేశ్వరుడు |
| 71. యాజ్ఞికులు | పురోడాశమయ లింగం | స్రువహస్తుడు |
| 72. యముడు | కాలాయసమయ లింగం | ధన్వి |
| 73. జామదగ్ని | యవాంకురలింగం | భర్గదైత్యుడు |
| 74. పురూరవుడు | అన్నమయలింగం | బహురూపుడు |
| 75. మాంధాత | శర్కరలింగం | బాహుయుగుడు |
| 76. గోవులు | పయోమయలింగం | వేత్రసహస్రుడు |
| 77. సాధ్వీస్త్రీలు | భర్తృమయలింగం | విశ్వపతి |
| 78. నారాయణుడు, నరుడు | మౌంజిలింగం | సహస్రశీర్షుడు |
| 79. పృథువు | తార్క్ష్యలింగం | సహస్రచరణుడు |
| 80. పక్షులు | వ్యోమలింగం | సర్వాత్మక |
| 81. పశుపతి | భస్మలింగం | మహేశ్వరుడు |
| 82. పృథివి | మేరులింగం | ద్వితనువుడు |
| 83. ఋషులు | జ్ఞానలింగం | చిరస్థానుడు |
| 84. బ్రాహ్మణులు | బ్రహ్మలింగం | జ్యేష్ఠ |
| 85. శేషుడు | గోరోచనలింగం | పశుపతి |
| 86. వాసుకి | విషలింగం | శంకరుడు |

| | | |
|---|---|---|
| 87. తక్షకుడు | కాలకూటలింగం | బహురూప |
| 88. కర్కోటకుడు | హాలాహల లింగం | ఏకాక్షుడు |
| 89. పద్మడు | విషమయలింగం | ధూర్జటి |
| 90. పుత్రుడు | పితృమయలింగం | విశ్వరూపుడు |
| 91. పార్వతి | పాదరసలింగం | త్ర్యబంకుడు |
| 92. మత్స్యాలు | శాస్త్రలింగం | వృషాకపి |
| 93. సిద్ధులు | మానసలింగం | జ్ఞానాత్మ |

ఈ విధంగా ఎంతోమంది ఎన్నోరకాల లింగాలని పూజించి తమ జీవితాల్ని చరితార్థం చేసుకున్నారు.

ధర్మార్థకామమోక్షాణాం యదిప్రాప్తౌ భవేన్మతిః ।
తతోహరః సమారాధ్య స్త్రిజగత్యాః ప్రదోమతః ॥

*(శ్లో॥197,అధ్యా. 2-13)*

ధర్మార్థకామమోక్షాల్ని పొందాలనుకునే మానవులు, ప్రతిరోజు పరమేశ్వరుణ్ణి సేవించాలి. ముల్లోకాల్నీ అనుగ్రహించే దైవం శివుడు.

ఈ లింగాల పేర్లన్నీ కలిగిన స్తోత్రాన్ని శతరుద్రీయ స్తోత్రం అంటారు. దీన్ని శ్రద్ధగా పఠించినవాడికి శివుడు అన్ని వరాల్నీ ప్రసాదిస్తాడు. ఈ శతరుద్రీయ స్తోత్రాన్ని పఠించినవారికి మనసు చేతా, మాటచేతా, చేసిన పాపాలన్నీ నశిస్తాయి. రోగాలతో బాధపడేవాడు రోగాలనుంచి, బంధాలలో చిక్కుకున్నవాడు బంధనాల నుంచి, భయపడేవాడు బయం నుంచీ విముక్తులవుతారు.

## అరుణాచల మాహాత్మ్యం

పూర్వం ఒక కల్పంలో శేషపాన్పుమీద నిద్రించిన శ్రీహరి యోగనిద్ర నించి ఎంతకాలం గడిచినా మేలుకోలేదు. ఆయనలా నిద్ర మేలుకోకపోవటంతో జగత్తంతా అంధకారం ఆవరించింది. అది చూసి మునులంతా "అయ్యో! ఏమిటిది అకాలంలో కల్పాంతం అయినట్టుంది" అని ఆందోళన చెందారు.

ఏమిటీ దుఃస్థితి! కల్పం గడిచిపోయినా శ్రీహరి మేలు కోలేదే! అని భావించి వెంటనే తేజోరాశి సంభూతుడైన పరమేశ్వరుణ్ణి ధ్యానించారు.

మునుల ప్రార్థన విని ఈశ్వరుడు విశ్వరక్షణకి పూనుకున్నాడు. వెంటనే తన తేజస్సు నుంచి విస్ఫులింగాల్లాంటి ముప్పైమూడు కోట్ల దేవతల్ని సృష్టించాడు. వారందరూ ఒక్కసారిగా విష్ణువుని నిద్రలెమ్మని ప్రబోధించగా శ్రీహరికి మాయవదిలిపోయింది. వెంటనే నిద్రనుంచి మేలుకొన్నాడు. కళ్ళు తెరవగానే ఎదురుగా ప్రభాతకాంతిని చూసి "అయ్యో! తామసగుణం పెరిగిపోయి నేనిలా నిద్రలో మునిగిపోయాను. నన్ను లేపటం కోసం సాక్షాత్తు శివుడే స్వయంగా పూనుకోవాల్సివచ్చిందే. ఇదెంత దురదృష్టం! ఎంత అవివేకమైన పనిచేసాను. ఇక నాకు శంకరుణ్ణి క్షమించమని వేడుకోవటం తప్ప మరోమార్గం లేదు" అని అనుకుని పరమేశ్వరుణ్ణి శరణువేడుకుంటూ దివ్యంగా స్తుతించాడు.

శ్రీహరి ప్రార్థన విని ప్రసన్నుడైన శివుడు తేజోరూపంగా ఆవిర్భవించి శ్రీహరిని కటాక్షించాడు. దివ్యతేజోరూపంతో తనకి దర్శనమిచ్చిన శంకరుణ్ణి చూసి తన్మయత్వంతో – హే శంకరా! త్రిభువనపాలకా, త్రిమూర్తిరూపా, త్రినేత్రా, త్రిగుణాతీతా, త్రిపురహరా నీవే సర్వేశ్వరుడివి, జగదీశ్వరుడివి, నీ అంశతోనే ఈ దేవతలందరూ జన్మించారు. సర్వకార్యకారణ రూపంతో ఈ ప్రపంచాన్ని నడిపించేది నీవే! ఓ జగత్పాలకా నా భారమంతా నీదే.

అకాలంలో నిద్రపోయిన నన్ను దోషిగా కూడా నీవు పరిగణించటం లేదు. హరహర! శంకరా నాకేది గతి. నా మానసిక బాధని తొలగించేది నీవే" అని దీనంగా విలపించాడు. అలా బాధపడుతున్న శ్రీహరిని ఓదార్చి అతడికీ విధంగా ప్రాయశ్చిత్తాన్ని వివరించాడు.

మధుసూదనా! నేను భూలోకంలో అరుణాచలుడి రూపంలో కొలువున్నాను. అది నా జ్యోతిర్లింగం. ఆ దివ్యలింగాన్ని చూస్తే చాలు. నీలో వున్న తమో గుణం మొత్తం నశిస్తుంది. ప్రశాంతమైన ఆ జ్యోతిర్లింగం స్థావర లింగంగా నిలిచివుంది. అంతర్జ్యోతిమయమైన ఆ అరుణాచల పర్వతం సకల

ప్రాణులకీ వరప్రదమైనది. అంధులకి నేత్రాలని, పుత్రసంతానం లేని వారికి పుత్రుల్ని, మూగవారికి మాటల్ని, వ్యాధిపీడితులకి సంపూర్ణ ఆరోగ్యాన్నీ ప్రసాదిస్తుంది. అక్కడ నేను స్థిరంగా నిలిచి ఉన్నాను. వెళ్ళు వెళ్ళి ఆ దివ్య జ్యోతిర్లింగాన్ని దర్శించు. అప్పుడే నీవు చేసిన దోషానికి పరిహారం జరుగుతుంది" అని చెప్పి అంతర్ధానమయ్యాడు. శంకరుడి మాట ప్రకారం శ్రీహరి భూలోకంలో ఉన్న అరుణాచలానికి బయలుదేరాడు.

భూలోకానికి వచ్చిన శ్రీహరి అరుణాచలాన్ని చూసి ఎంతో ఆనందించాడు. అది గొప్ప తపోభూమి అని గుర్తించి వెంటనే సకల దేవతల్ని పిలిచి ఆ పర్వతం మీద నివసించమని ఆదేశించాడు. తాను ఆ పర్వతశిఖరం మీదకి చేరి తపస్సు చేయటం ప్రారంభించాడు. ఆ పర్వతం మీదే ఋషులు నివసించటానికి తగిన ఆశ్రమాలని నిర్మించి సాంగవేదాల్ని అధ్యయనం చేసుకునే వాతావరణాన్ని కల్పించాడు. అలాగే నిత్యం వందమంది అప్సరసల నృత్యగీతాలతో ఆ గిరి మొత్తం శోభాయమానంగా ఉండేలా చేసాడు.

ఈ విధంగా చేసిన శ్రీహరి తాను స్వయంగా, అక్కడున్న బ్రహ్మ సరస్సులో స్నానం చేసి, మహిమాన్వితమైన ఆ అరుణ గిరికి ప్రదక్షిణం చేసాడు. తరువాత అరుణాచలేశ్వరుణ్ణి అర్చించి సకల పాపాలనుంచీ విముక్తుడై తిరిగి సృష్టిని పాలించే శక్తిని పొందాడు శ్రీహరి.

## అరుణాచలేశ్వర మహిమలు

**సూర్యుడి వృత్తాంతం :** ఒకనాడు రాక్షసుల బారిన పడ్డ సూర్యుడు తన తేజస్సునంతా కోల్పోయాడు. ఏం చేయాలో తోచక బ్రహ్మదేవుడి దగ్గరకి వెళ్ళగా ఆయన అరుణాచలాన్ని దర్శించమని ప్రబోధించాడు. బ్రహ్మ ఆదేశం ప్రకారం సూర్యుడు అరుణగిరిని చేరుకుని అక్కడి బ్రహ్మ సరోవరంలో స్నానంచేసి, ఆ పర్వతానికి భక్తి శ్రద్ధలతో ప్రదక్షిణం చేసాడు. తరువాత అరుణాచలేశ్వరుణ్ణి దర్శించి సేవించటంతో సూర్యుడికి తాను పూర్వం కోల్పోయిన తేజస్సు తిరిగి లభించింది.

**చంద్రుడి వృత్తాంతం :** ఒకనాడు చంద్రుడు తన మామగారైన దక్షప్రజాపతి శాపానికి గురై రోజు రోజుకీ క్షీణించసాగాడు. అప్పుడు పరమేశ్వరుడి ప్రబోధాన్ని అనుసరించి అరుణగిరికి శ్రద్ధగా ప్రదక్షిణ చేసి తిరిగి తన పూర్వరూపాన్ని పొందాడు.

**ఇంద్రుడి వృత్తాంతం :** పూర్వం ఇంద్రుడు, పరమేశ్వర వర ప్రభావంతో రెచ్చిపోయి అన్ని లోకాల్ని పీడిస్తున్న వృతృడు బలుడు, పాకుడు, సముచి అనే అసురుల్ని సంహరించాడు. అయితే వారంతా శివభక్తులు. వారిని మాయోపాయంతో చంపటం వల్ల ఇంద్రుడికి తన బలం క్షీణించిపోయింది. ఏం చేయాలో పాలుపోక పరమేశ్వరుణ్ణి దీనంగా ప్రార్థించాడు. ఇంద్రుడి ప్రార్థన విని కరుణించిన శంకరడు ప్రత్యక్షమై బోధచేయగా, ఆయన మాటననుసరించి ఇంద్రుడు అరుణాచలానికి భక్తితో ప్రదక్షిణలు చేసాడు. అలా చేయటం ద్వారా తన పాపాలు పోగొట్టుకుని, దిగ్విజయంగా అశ్వమేధయాగాన్ని నిర్వహించి తిరిగి తన ఇంద్రపదవిని పొందాడు.

అరుణాచలేశ్వరుడి దయతో ఇంద్ర పదవిని పొందిన దేవేంద్రుడు స్వామి సేవకోసం వందమంది అప్సరసల్ని నియమించాడు. అలాగే పుష్పమేఘాల్ని పిలిచి అరుణగిరిమీద పూలవాన కురిపించాడు. తరువాత కాలంలో శివుడి ఆజ్ఞననుసరించి ఆదిశేషుడు కూడా అరుణాచలాన్ని సేవించి కామరూపశక్తిని పొందాడు. అంతేకాదు ఆయన దయవల్లే భూమండలాన్ని మొత్తం మోయగలిగే శక్తిని సంపాదించాడు. ఇంకా ఎంతోమంది నాగులు, సిద్ధులు, గంధర్వులు, అప్సరగణాలు, దిక్పాలకులు అరుణగిరిని సేవించి, అరుణాచలేశ్వరుణ్ణి దర్శించి తమ తమ కోరికల్ని సాధించుకున్నాయి.

**దేవతల వృత్తాంతం :** పూర్వం దక్షయజ్ఞ విధ్వంసం జరిగినప్పుడు, పరమేశ్వరుడి ద్వారా దేవతల శరీరాంగాలన్నీ ధ్వంసమయ్యాయి. అప్పుడు దేవతలంతా అరుణాచలాన్ని ఆశ్రయించి, తిరిగి తమ శక్తిని, అంతేకాదు ధ్వంసమైన తమ అంగాల్ని కూడా చేతులు కోల్పోయిన అగ్నిదేవుడు చేతుల్ని, కళ్ళు కోల్పోయిన భృగుమహర్షి నేత్రాలని, ముక్కు ఊడిన సరస్వతీదేవి ముక్కుని పొందారు.

పూర్వం బలిచక్రవర్తి వామనుడికి భూమిని దానమిస్తూ కమండలంలో నీరు పోస్తుండగా అతడి గురువు శుక్రాచార్యుడు ఆ కమండలంలో దూరి నీటిధారని అడ్డుకున్నాడు. అప్పుడు వామనుడు ఒక దర్భతో కమండలంలోకి పొడవగా లోపలున్న శుక్రాచార్యుడికి ఒక కన్నుపోయింది. అప్పుడు శుక్రాచార్యుడు అరుగా చలానికి వచ్చి గిరిప్రదక్షిణ చేసి, స్వామిని సేవించటంతో తిరిగి తన కంటిని పొందగలిగాడు.

**సప్తర్షుల వృత్తాంతం :** పూర్వం ఒకనాడు ప్రారబ్ధవశాన సప్తర్షులు శాపానికి గురయ్యారు. ఈశ్వరుడి ప్రబోధం విని వారంతా భూలోకానికి వచ్చి అరుణాద్రీశ్వరుణ్ణి సేవించి తమ శాపం నుంచి విముక్తి పొందారు. అందుకు కృతజ్ఞతగా వారంతా అక్కడొక చెఱువుని తవ్వించారు. అదే నేడు సప్తర్షి తీర్థంగా ప్రసిద్ధి చెందింది. ఆ సరస్సులో స్నానం చేస్తే సకల పాపాలూ నశిస్తాయని ప్రతీతి.

**వాలి వృత్తాంతం :** మహాబలశాలిగా ప్రసిద్ధి చెందిన వాలి ఇంద్రుడి పుత్రుడు. ఒకనాడు ఆ వాలి ఉదయాద్రి శిఖరం మీద నుంచి, అస్తాద్రి శిఖరం మీదకి లంఘించి దారిలో అరుణగిరిని చూసాడు. సకల దేవతలతో పూజించబడుతున్న అరుణగిరిని దాటబోయాడు. అంతో ఒక్కసారిగా వాలి బలమంతా క్షీణించిపోయి నేలమీద కూలబడ్డాడు. అప్పుడు ఇంద్రుడు చేసిన ప్రబోధాన్ని అనుసరించి, తేజోలింగమైన అరుణాచలాన్ని సేవించి తన బలాన్ని మళ్ళీ పొందాడు.

**ఇల-నలమహారాజుల వృత్తాంతం :** పూర్వం నలమహారాజు తేజోలింగ రూపుడైన అరుణాచలేశ్వరుణ్ణి పూజించి ఎంతో నీతిమంతంగా, ధర్మబద్ధంగా ప్రజల్ని పాలించే శక్తిని పొందాడు. పూర్వం ఇలుడనే మహారాజుండేవాడు. ఆయన ఒకనాడు వన విహారానికి వెళ్ళి తెలియక అక్కడున్న గౌరీవనంలోకి ప్రవేశించాడు. దాంతో అతడి పురుషరూపం పోయి స్త్రీగా మారిపోయాడు. తరువాత తన కులగురువైన వశిష్ఠ మహర్షి ఆదేశంతో స్త్రీగా మారిన ఇలుడు అరుణగిరి నాథుణ్ణి సేవించి మళ్ళీ తన పూర్వ రూపాన్ని పొందాడు.

# అరుణగిరి స్వరూపం

మహిమాన్వితమైన ఈ అరుణగిరికి నాలుగు దిక్కులా దేవతలు పరివేష్టించి ఉంటారు. తూర్పుదిశలో సూర్యుడు, దక్షిణ దిశలో విశ్వామిత్రుడు, పడమర దిశలో వరుణుడు, ఉత్తర దిక్కున త్రిశూలం రక్షణగా వున్నాయి. అరుణగిరి వ్యాపించిన రెండు యోజనాల పర్యంతం వీరు రక్షకులుగా వుంటారు.

అరుణాచలానికి ఉత్తర భాగంలోని శిఖరం మీద పెద్ద వటవృక్షం ఉంది. దాని నీడ ఎంతో విశాలంగా వ్యాపించి అందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. పవిత్రమైన ఆ వటవృక్షం క్రింద సిద్ధుడి రూపంలో పరమేశ్వరుడు నిత్యం నివసిస్తూ ఉంటాడు. అష్టదిక్పాలకులు ఈ గిరిచుట్టూ అష్టదిక్కుల్లో ఉండి స్వామిని సేవిస్తూ ఉంటారు. వీరు కూడా తమ చేతుల్తో స్వయంగా ఎనిమిది లింగాల్ని అరుణగిరి మీద స్థాపించారు.

శివభక్తులైన కొందరు రాజులు ఇక్కడొక మహామండపాన్ని నిర్మించారు. ఈ గిరి మూలం ఆగమార్థవిదుడైన వామదేవుడి చేత సేవించబడుతోంది. ఇక్కడ అగస్త్యముని, వశిష్ఠ మహర్షి లింగాల్ని స్థాపించి కఠోరమైన తపస్సు చేసారు. శోణానది ఇక్కడ తీవ్రమైన తపస్సు చేసి గంగకి అభిముఖంగా ప్రవహించే వరాన్ని పొందింది. పవిత్రమైన ఆ శోణానది అరుణగిరిని చుట్టి ప్రవహిస్తోంది.

**తీర్థాలు :** అరుణగిరికి వాయువ్యదిశలో వాయుతీర్థం వుంది. ఇందులో స్నానం చేసాకే వాయుదేవుడు ప్రపంచంలోని అన్ని జీవులకీ ప్రాణ స్వరూపుడిగా మారాడు. ఈ గిరికి ఉత్తరదిశలో సౌగంధికమల శోభితమై చక్కటి రాజహంసలతో, నిర్మలమైన జలాలతో నిండిన కుబేర తీర్థం వుంది. ఈ గిరికి ఈశాన్యదిశలో ఈశాన్యతీర్థం నెలకొంది. ఈ దివ్యతీర్థంలో స్నానం చేసిన తరువాతే శ్రీహరి అత్యంత సుందరుడై లక్ష్మీదేవిని చేపట్టి విష్ణుత్వాన్ని పొందాడు. ఈ ఈశాన్య తీర్థంలో స్నానంచేసి నవగ్రహాల్ని ఆరాధిస్తే సమస్త గ్రహదోషాలూ తొలగిపోతాయని ప్రతీతి. ఈశాన్యతీర్థం చుట్టూ– దుర్గాదేవి, గణపతి, కుమారస్వామి, క్షేత్రపాలుడు, సరస్వతి పరివేష్ఠించి ఉన్నారు.

అరుణాచల పర్వతానికి అన్ని దిక్కుల్లో గంగా, యమునా, గోదావరీ, సరస్వతీ, నర్మదా, సింధు, కావేరీ, శోణనది, మహానదీ దేవతలు అంతర్వాహినులుగా ప్రవహిస్తూ తమ తమ శక్తులతో అరుణగిరి నాథుణ్ణి సేవిస్తున్నారు.

అరుణగిరికి దక్షిణ దిశలో మహిమాన్వితమైన అగస్త్య తీర్థం ఉంది. ప్రతి సంవత్సరం భాద్రపద మాసంలో అగస్త్యమహర్షి శిష్యసమేతంగా ఈ తీర్థంలో స్నానం చేసి, అరుణగిరి నాథుణ్ణి సేవిస్తుంటారు. పవిత్రమైన ఈ తీర్థంలో స్నానంచేసిన వారికి సకలభాషా కోవిదత్వం కలుగుతుంది. ఈ గిరికి ఉత్తరదిశలో దివ్యమైన వశిష్ఠ తీర్థం ఉంది. ఈ తీర్థంలో స్నానం చేస్తే సకల వేదార్థ జ్ఞానం లభిస్తుంది. ప్రతి ఆశ్వయుజమాసంలో మేరు పర్వతం మీద నివసించే వశిష్ఠమహర్షి ఇక్కడికి వచ్చి తీర్థంలో స్నానం చేసి స్వామిని అర్చించి వెళతారు.

అరుణగిరికి ఈశాన్య భాగంలో గంగాతీర్థం ఉంది. ఇది సర్వపాప ప్రణాశిని. ప్రతి కార్తీక మాసంలో గంగాది సకల నదులూ వచ్చి ఈ తీర్థంలో కలుస్తాయి. అలాగే అరుణగిరినాథుడి సన్నిధిలో ఉన్న బ్రహ్మతీర్థం ఎంతో విశేషమైనది. ఈ తీర్థంలో స్నానం చేసిన వాడికి బ్రహ్మహత్యాపాపాలు కూడా తొలగిపోతాయి. ప్రతి మార్గశీర్ష మాసంలో సత్యలోకం నుంచి బ్రహ్మదేవుడు ఇక్కడికొచ్చి ఈ తీర్థంలో స్నానం చేసి స్వామిని అర్చించి వెళతాడు.

ఈ అరుణగిరిశిఖరం మీద ఇంద్రతీర్థం ఉంది. ప్రతి పుష్యమాసంలో ఇంద్రుడు ఇక్కడికొచ్చి స్నానంచేసి స్వామిని సేవిస్తాడు. అరుణగిరినాథుడి సన్నిధిలో శివతీర్థం ఒకటుంది. పూర్వం శివుడు బ్రహ్మ కపాలంతో సహా ఇక్కడికొచ్చి స్నానం చేసాడు. ప్రతిమాఘమాసంలో పరమేశ్వరుడు రుద్రగుణ పరివేష్ఠితుడై ఇక్కడ నిలిచి ఉంటాడు. ఇక్కడి ఆగ్నేయదిశలో వెలిసిన ఆగ్నేయ తీర్థంలో స్నానం చేశాకే అగ్నిదేవుడు స్వాహాదేవిని చేపట్టాడు. ప్రతి ఫాల్గుణ మాసంలో మన్మథుడు ఇక్కడికొచ్చి స్నానంచేసి స్వామిని సేవిస్తాడు.

అరుణగిరికి ఉత్తర దిశలో సూర్యతీర్థముంది. ఇది సకలరోగ నివారిణి. ప్రతివైశాఖమాసంలో వాలఖిల్యాది మహర్షులతో కలిసి సూర్యుడు, వేదాలు

ఈ తీర్థంలో స్నానమాచరిస్తాయి. ఈశాన్యదిలో ఉన్న అశ్వినీతీర్థంలో స్నానంచేసి అశ్వినీదేవతలు అరుణ గిరినాథుణ్ణి సేవించుకుంటారు. శోణగిరికి దక్షిణంలో పాండవతీర్థం ఉంది. పూర్వం పాండవులు ఈ తీర్థంలో స్నానంచేసి రాజ్యలాభాన్ని పొందారు. భూదేవి సకల ఓషధులతో, సకల దేవతలతో కలిసి జ్యేష్ఠమాసంలో ఇక్కడికొచ్చి స్వామిని సేవించుకుంటుంది.

పరమ పవిత్రమైన ఈ అరుణాచలాన్ని గంగానది పాదాలలో, యమునానది మధ్యభాగంలో, నర్మదానది శిరోభాగంలో నిలవబడి నిరంతరం సేవిస్తూ వుంటాయి. ఈ గిరి చుట్టూ ఇంకా ఎన్నో తీర్థాలు ఉద్భవించాయి. వాటన్నిటి గురించి చెప్పటం ఎవరికీ వశంకాదు.

కృతయుగంలో అగ్నిమయంగా ఉన్న ఈ అరుణలింగం, త్రేతాయుగంలో రత్నాచలం అన్న పేరుతో విలసిల్లింది. అదే ద్వాపరయుగంలో హేమపర్వతంగా ప్రసిద్ధి చెందింది. ఆ పర్వతమే కలియుగంలో మరకతాచలంగా వ్యాపించింది. ఎన్నో యోజనాలు విస్తరించిన ఈ అగ్నిమయలింగానికి మహర్షులందరూ ప్రదక్షిణాలు చేసి ప్రార్థించగా ఆ అగ్నిమయలింగం లోకక్షేమం కోసం తన ప్రకాశాన్ని, తేజస్సుని గుప్తంగా ఉంచుకుని ఒక పర్వతాకారాన్ని ధరించి నిలుచుంది.

## గౌతమ ముని వృత్తాంతం

పూర్వం ఒకనాడు పరమేశ్వరుడు గౌతమమునిని కైలాసానికి పిలిచి తీర్థయాత్రలు చేయమని ఆదేశించాడు. శివుడి ఆదేశం విని గౌతముడు భూలోకానికొచ్చి తీర్థయాత్రలు చేయటం ప్రారంభించాడు. రుద్రక్షేత్రంగా ప్రసిద్ధి చెందిన కేదారం, నారాయణ క్షేత్రంగా ప్రసిద్ధిచెందిన బదరికాశ్రమం, అలాగే కాశీక్షేత్రం ఇంకా ఉత్తర భారతంలో సుప్రసిద్ధమైన ఎన్నో పుణ్యక్షేత్రాల్ని దర్శించాడు.

గౌతముడు ఆ విధంగా ఉత్తరదేశ తీర్థాల్ని ముగించుకుని దక్షిణ దేశానికి వచ్చాడు. ఇక్కడ అతిపవిత్రమైన శ్రీశైలం, కాంచీపురం లాంటి పుణ్యక్షేత్రాల్ని దర్శించాడు. వాటితోపాటు ఋషులు, యోగులు, మునులు, స్థాపించిన మరెన్నో శివలింగాల్ని దర్శించాడు.

మరికొన్ని స్వయంభూ లింగాల్ని ఎంతో భక్తితో సేవించాడు. ఆ విధంగా అన్ని దివ్యక్షేత్రాల్నీ దర్శిస్తూ ఒకనాడు మహామహిమాన్వితుడైన అరుణాచలేశ్వరుడి దగ్గరకి వచ్చాడు.

గౌతముడికి అరుణగిరిమీద తపస్సు చేసుకుంటున్న సిద్ధులు, మహర్షులు, ఎందరో కనిపించారు. వారందరికీ నమస్కరించి అరుణాచలుడి సన్నిధికి చేరాడు. ఆదిమలింగమైన ఆ స్వామిని "ఓ దేవాదిదేవా! అరుణగిరినాథా! ప్రప్రథమంగా నీవు బ్రహ్మదేవుడికి దర్శనమిచ్చావు. నిన్ను వేదాలన్నీ ఎంతో ఘనంగా స్తుతిస్తున్నాయి. స్వామీ! నీ దివ్య దర్శనం సర్వఫలప్రదం. నీ దివ్యమంగళ లింగాన్ని దర్శించినవారికి వేరే ఏ రకమైన తపస్సులతో పనిలేదు. ఈ కర్మభూమి నీవల్ల పవిత్రభూమిగా మారిపోయింది. దేవతలందరూ నీ పర్వతం మీదే నివసించాలని తాపత్రయపడుతున్నారు. నేను చేసిన తపస్సు ఫలించి ఇన్నాళ్ళకి నీ దివ్య దర్శన భాగ్యం నాకు కలిగింది.

ప్రభూ!ఈశ్వరా! ఇలా ఒక లింగం పర్వతాకారాన్ని ధరించి ఉండటం భూలోకంలో మరెక్కడా లేదు. సూర్య, చంద్ర, అగ్ని సమన్వితమైన త్రికోణాలతో, త్రిమూర్తి స్వరూపమై ఈ పర్వతం విరాజిల్లుతోంది. త్రిశక్తి సమన్వితమై, త్రికాల విధాయకమై, త్రిదేవాత్మకమైన రూపాన్ని ధరించి అరుణగిరిగా నీవు వెలిసావు. దర్శనమాత్రంచేతనే మానవులందరికీ శ్రేయస్సు కలిగిస్తున్నావు. ఓ కరుణాసముద్రా! మహాదేవా! భవసాగరంలో మునిగిన నన్ను కటాక్షించు" అని ప్రార్థించాడు.

గౌతమముని ప్రార్థన విని కరుణించిన అరుణగిరినాథుడు ప్రత్యక్షమై "వత్సా! నీ భక్తి శ్రద్ధలు నాకెంతో ఆనందాన్ని కలిగించాయి. ఈనాటి నుంచీ నువ్వు నా సమక్షంలోనే ఉండి నా మహిమని లోకానికి తెలియచేయి అని ఆదేశించాడు. పూర్వం పరమేశ్వరుడు కూడా గౌతముడితో "గౌతమా! సప్తర్షులు దేవలోకంలో ఉన్న నన్ను నిత్యం అర్చిస్తున్నారు. తపోధనుడవైన నీవు భూలోకంలో అరుణగిరిని చేరి అక్కడ వెలిసిన నాకు నిత్యం పూజాదికాలు నిర్వహించు.

దేవతలు ఆకాశంలో ఎంతో ఘనంగా నా పూజ చేస్తారు. అదేవిధంగా భూలోకంలోని అరుణగిరిమీద కూడా నా పూజని ఘనంగా నీవు నిర్వహించు. ఇప్పటిదాకా నన్ను ఆరాధించిన వారికన్నా నీవు గొప్పవాడివి” అని పరమేశ్వరుడు పలకగా ఆయన ఆదేశాన్ని గౌతమముని శ్రద్ధగా పాటించాడు.

## అరుణాచలేశ్వరుడి దివ్యనామాలు

మహిమాన్వితుడైన అరుణాచలేశ్వరుణ్ణి పూజించేవారు పూజలో భాగంగా ఈ క్రింద తెలిసిన నామాల్ని పఠిస్తూ పూజచేయాలి.

ఓం శోభనాద్రీశాయ నమః
ఓం అరుణాద్రీశాయ నమః
ఓం దేవాధీశాయ నమః
ఓం జనప్రియాయ నమః
ఓం ప్రసన్నరక్షకాయ నమః
ఓం ధీరాయ నమః
ఓం శివాయ నమః
ఓం సేవకాయ నమః
ఓం వర్ధకాయ నమః
ఓం అక్షిపేయామృతేశాయ నమః 10
ఓం ఈశానాయ నమః
ఓం స్త్రీ పుంభావ ప్రదాయకాయ నమః
ఓం భక్తవిజ్ఞప్తి సంధాతాయ నమః
ఓం దీనబంధ విమోచకాయ నమః
ఓం ముఖరాంఘ్రిపతయే నమః
ఓం శ్రీహంతాయ నమః
ఓం మృడాయ నమః
ఓం మృగమదేశ్వరాయ నమః
ఓం భక్తప్రేక్షణకృతే నమః
ఓం సాక్షినే నమః 20
ఓం భక్తదోష నివర్తకాయ నమః
ఓం జ్ఞానసంబంధనాథాయ నమః
ఓం హాలాహలసుందరాయ నమః
ఓం మహదైశ్వర్య దాతాయ నమః
ఓం స్మర్త్యసర్వాఘనాశనాయ నమః
ఓం వ్యత్యస్తనృత్య ధ్వజదృక్ నమః
ఓం సంకాతయే నమః
ఓం నటనేశ్వరాయ నమః
ఓం సామప్రియాయ నమః
ఓం కలిధ్వంసినే నమః 30
ఓం వేదమూర్తయే నమః
ఓం నిరంజనాయ నమః
ఓం జగన్నాథాయ నమః
ఓం మహాదేవాయ నమః
ఓం త్రినేత్రాయ నమః
ఓం త్రిపురాంతకాయ నమః

ఓం భక్తాపరాధసోఢాయ నమః
ఓం యోగీశాయ నమః
ఓం భోగనాయకాయ నమః
ఓం బాలమూర్తయే నమః 40
ఓం క్షమారూపిణే నమః
ఓం ధర్మరక్షకాయ నమః
ఓం వృషధ్వజాయ నమః
ఓం హరాయ నమః
ఓం గిరీశ్వరాయ నమః
ఓం భర్గాయ నమః
ఓం చంద్రలేఖావతంసకాయ నమః
ఓం స్మరాంతకాయ నమః
ఓం అంధకరిపవే నమః
ఓం సిద్ధరాజాయ నమః 50
ఓం దిగంబరాయ నమః
ఓం ఆరామప్రియాయ నమః
ఓం ఈశానాయ నమః
ఓం భస్మరుద్రాక్షలాంఛనాయ నమః
ఓం శ్రీపతయే నమః
ఓం శంకరాయ నమః
ఓం స్రష్టాయ నమః
ఓం సర్వవిద్యేశ్వరాయ నమః
ఓం అనఘాయ నమః
ఓం గంగాధరాయ నమః 60
ఓం క్రతుధ్వంసినే నమః
ఓం విమలాయ నమః
ఓం నాగభూషణాయ నమః
ఓం అరుణాయ నమః
ఓం బహురూపాయ నమః
ఓం విరూపాక్షాయ నమః
ఓం అక్షరాకృతయే నమః
ఓం అనాదయే నమః
ఓం అంతరహితాయ నమః
ఓం శివకామాయ నమః 70
ఓం స్వయంప్రభవే నమః
ఓం సచ్చిదానంద రూపాయ నమః
ఓం సర్వాత్మాయ నమః
ఓం జీవధారకాయ నమః
ఓం స్త్రీ సంగవామసుభగాయ నమః
ఓం విధియే నమః
ఓం విహిత సుందరాయ నమః
ఓం జ్ఞానప్రదాయ నమః
ఓం ముక్తిదాతాయ నమః
ఓం భక్తవాంఛితదాయకాయ నమః 80
ఓం ఆశ్చర్యవైభవాయ నమః
ఓం కామ్యై నమః
ఓం నిరవద్యాయై నమః
ఓం నిధిప్రదాయ నమః
ఓం శూలినే నమః
ఓం పశుపతయే నమః
ఓం శంభవే నమః
ఓం స్వయంభువే నమః
ఓం గిరీశాయ నమః
ఓం మృడాయ నమః 90

# అరుణగిరి ప్రదక్షిణా మాహాత్మ్యం

కైలాసవాసుడైన పరమేశ్వరుడు అగ్నిలింగంగా అరుణాచలం రూపంలో భూమిమీద వెలిసాడు. ఆ దివ్య పర్వతం చుట్టూ ఎంతో మంది దేవతలు పరివేష్ఠించి ఉన్నారు. "యానికానిచపాపాని జన్మాంతకృతానిచ। తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే" అన్న శ్లోకం ప్రకారం, జన్మాంతరాల్లో చేసిన పాపాలు కూడా ఆ అరుణగిరికి ప్రదక్షిణ చేస్తే తొలగిపోతాయి. కోటి అశ్వమేధయాగాలు, కోటి వాజపేయ యాగాలు చేస్తే వచ్చే ఫలితం, సర్వతీర్థాలలో స్నానం చేస్తే వచ్చే ఫలితం, కేవలం ఒక్కసారి అరుణగిరి చుట్టూ ప్రదక్షిణ చేస్తే కలుగుతుంది. ఎంత నికృష్టజన్మ ఎత్తిన వారికైనా సరే, అరుణగిరి ప్రదక్షిణ ముక్తిని ప్రసాదిస్తుంది. ఆ గిరికి భక్తి శ్రద్ధలతో ప్రదక్షిణ చేసేవారు, సకల యజ్ఞాలు చేసిన ఫలం పొందుతారు.

అరుణాచల ప్రదక్షిణ కోసం వెళ్ళేవారు ఒక్క అడుగు వేసినంత మాత్రాన్నే భూలోకాన్ని, రెండో అడుగుతో అంతరిక్షాన్ని, మూడో అడుగుతో స్వర్గాన్ని పొందుతారు. అలాగే మొదటి అడుగుతో మానసికంగా చేసిన పాపం, రెండో అడుగుతో వాక్కుద్వారా చేసిన పాపం, మూడో అడుగుతో శరీరం ద్వారా చేసిన పాపం తొలగిపోతుంది. ఒక్కడుగుతో సకల పాపాలూ నశిస్తాయి. రెండో అడుగు వేస్తే సర్వతపస్సుల ఫలితం వస్తుంది.

పరమపవిత్రమైన ఈ అరుణగిరి చుట్టూ ఎన్నో సిద్ధాశ్రమాలున్నాయి. ఈ శిఖరం మీదే సర్వేశ్వరుడు సిద్ధేశ్వర రూపంతో, దేవతలందరిచేతా పూజించబడుతుంటాడు. "ఈ దివ్య పర్వతం అగ్ని మయమని, ఈ పర్వతం అంతర్భాగంలో సర్వభోగాలతో కూడిన ఒక గుహ ఉందని భావిస్తూ ధ్యానిస్తూ, ఈ గిరికి ప్రదక్షిణ చేయాలి. అలా చేసిన వారి పాపాల్ని దోషాల్ని తొలగిస్తానని పరమేశ్వరుడు స్వయంగా చెప్పాడు. అలాగే ఈ గిరిని పరమేశ్వరుడి అష్టమూర్తిగా కూడా అందరూ గ్రహించి నమస్కరించాలి. అరుణగిరికి నిత్యం ప్రదక్షిణ చేసేవారికి నిత్యత్వం లభిస్తుంది. ఈ గిరి ప్రదక్షిణ చేసేవాడి పాదధూళితో భూమి పవిత్రమవుతుంది.

## - ప్రదక్షిణా విధి -

- అరుణగిరికి ప్రదక్షిణ చేసేవాళ్ళు ఎవరు చేయినీ పట్టుకోకుండా నెమ్మదిగా నడవాలి.
- పరుగులు తీస్తూ హడావుడిగా గిరిప్రదక్షిణ చేయకూడదు.
- నడిచేవారి అడుగుల చప్పుడు కూడా వినపడకూడదు.
- స్నానంచేసి పరిశుభ్రమైన వస్త్రాలు ధరించి, భస్మాన్ని, రుద్రాక్షల్ని ధరించి పవిత్రంగా ప్రదక్షిణ చేయాలి.
- ఈ పవిత్రమైన గిరిప్రదక్షిణని మనువులు, సిద్ధులు, మహర్షులు, దేవతలు అదృశ్యరూపంలో చేస్తారు. ఇది గ్రహించి వారి దారికి తాము అడ్డులేకుండా నడవాలని భావిస్తూ తమ ప్రదక్షిణ కొనసాగించాలి.
- శివనామ సంకీర్తన చేస్తూ గానీ, శివనృత్యం చేస్తూగానీ భక్తులతో కలిసి వెళ్ళాలి.
- మనసులో ఓం అరుణాచలేశ్వరాయ నమః అన్న నామాన్ని నిరంతరాయంగా జపిస్తూ ముందుకి సాగాలి.
- కృతయుగంలో అగ్నిమయం, త్రేతాయుగంలో మణిమయం, ద్వాపర యుగంలో బంగారుమయం, కలియుగంలో మరకతాచలంగా ఈ అరుణగిరి వుండేదని భావించాలి.
- పవిత్రమైన అరుణాచలం స్ఫటికమయమని, స్వయంప్రభామయమైనదని ధ్యానిస్తూ ప్రదక్షిణ చేయాలి.
- పరమేశ్వరుణ్ణి అగ్నిమయ స్వరూపుడిగా భావిస్తూ ప్రదక్షిణ చేసేవారిని ఆయన సర్వదా రక్షిస్తాడు. ఈ అరుణగిరి ప్రదక్షిణ చేసేవాడి పాదాలు మోయటానికి దేవతల వాహనాలు పోటీపడుతుంటాయి. ఈ గిరిప్రదక్షిణ చేసినవారికి దృఢమైన శరీరం ఏర్పడుతుంది. వారి వ్యాధులన్నీ నశిస్తాయి. అదృశ్యంగా ఈ గిరిప్రదక్షిణ చేసే దేవతలు తమతో పాటు ప్రదక్షిణ చేస్తున్న భక్తులకి ఎన్నో వరాల్ని ప్రసాదిస్తారు. పూర్వం 33 మంది మాత్రమే ఉన్న దేవతలు, ఈ గిరిప్రదక్షిణ చేసిన తరువాత 33 కోట్లమంది అయ్యారు.

## ప్రదక్షిణ ఫలితాలు

1. **ఆదివారం :** ఈ రోజు అరుణగిరి ప్రదక్షిణ చేసినవారు శరీర పతనానంతరం సూర్యమండలాన్ని ఛేదించుకుని యోగులలాగా శివలోకాన్ని చేరుకుంటారు
2. **సోమవారం :** శివుడికి ప్రీతిపాత్రమైన సోమవారం నాడు ఈ గిరిప్రదక్షిణ చేస్తే అజరామరత్వప్రాప్తి కలుగుతుంది
3. **మంగళవారం :** శుభప్రదమైన మంగళవారం నాడు చేసే అరుణగిరి ప్రదక్షిణ వల్ల సార్వభౌమాధికారం ప్రాప్తిస్తుంది
4. **బుధవారం :** జ్ఞానప్రదమైన ఈ వారంలో గిరిప్రదక్షిణ చేసేవారికి సర్వజ్ఞత్వం, మహాపాండిత్యం లభిస్తాయి.
5. **గురువారం :** గురుసంబంధమైన ఈ వారంలో ప్రదక్షిణ చేసిన వారికి సకల దేవతలూ నమస్కరించతగ్గ గురుత్వం ప్రాప్తిస్తుంది.
6. **శుక్రవారం :** మంగళ ప్రదమైన ఈ వారంలో గిరిప్రదక్షిణ చేసేవారికి సర్వసంపత్ప్రదమైన విష్ణులోకం లభిస్తుంది.
7. **శనివారం :** అత్యంత ప్రభావవంతమైనది శనివార ప్రదక్షిణ. ఈ రోజు అరుణగిరికి ప్రదక్షిణ చేసేవారికి సకల గ్రహబాధలు తొలగిపోయి అన్ని కార్యాలలో విజయం లభిస్తుంది.

పూర్వం ఎంతోమంది నక్షత్ర దేవతలు, గ్రహదేవతలు ఈ గిరి ప్రదక్షిణ చేసి, శివానుగ్రహాన్ని పొందారు. అన్ని తిథులు, యోగాలు, కరణాలు, సకల ముహూర్తాలు, హోరలు, సౌమ్యాలు అన్నీ అరుణగిరి ప్రదక్షిణ చేసేవారికి అత్యంత సానుకూలంగా ఉంటాయి.

## ప్రదక్షిణ

ప్ర – బలంగా పాపాల్ని కొట్టి తరిమేసేది.

ద – సకల కోరికలనీ తీర్చేది.

క్షి – కర్మల ఫలితాలని క్షీణింపచేసేది.

ణ – ముక్తి ప్రదాయకమైనది అని అర్థం.

✤ దుర్బలులు, కృశించిన శరీరం కలిగిన వారు ఎలాగో శ్రమపడి ఈ గిరి ప్రదక్షిణ చేస్తే, సకల దోషాల నుంచీ పాపాల నుంచీ విముక్తులవుతారు.

✤ అరుణగిరికి ఒక్కసారి ప్రదక్షిణ చేస్తే, ముల్లకాలకీ ప్రదక్షిణ చేసిన ఫలితం లభిస్తుంది.

✤ ఉత్తరాయణ పుణ్యకాలంలో (మకర సంక్రమణం) పరమేశ్వరుడు స్వయంగా తన ప్రమథగణాలతో, ఋషి ముని సమూహాలతో ఈ గిరికి ప్రదక్షిణ చేస్తాడు.

✤ ఉత్తరాయణ పుణ్యకాలంలో అరుణగిరికి ప్రదక్షిణ చేసే వారిని, జగన్మాత పార్వతీదేవి కరుణించి కాపాడుతుంది.

✤ పవిత్రమైన అరుణగిరి ప్రదక్షిణని రథాలు, గుర్రాలులాంటి వాహనాలతో చేయకూడదు. కేవలం కాలినడకతోనే చేయాలి.

## అరుణాచలేశ్వరుడి పూజాఫలం

✤ ఆదివారం నాడు స్వామిని ఎర్ర కలువలతో పూజిస్తే సార్వభౌమత్వం సిద్ధిస్తుంది.

✤ సోమవారం నాడు కరవీరపుష్పాలతో, కస్తూరికుసుమాలతో పూజించినవారికి సత్యలోక ప్రాప్తి కలుగుతుంది.

✤ గురువారం నాడు అరుణాచలేశ్వరుణ్ణి తెల్ల తామరలతో అర్చిస్తే సిద్ధులతో కూడిన జనోలోకానికి వెళతారు.

✤ శుక్రవారం నాడు చంపకపుష్పాలతో అరుణగిరినాథుణ్ణి పూజించినవాడికి బ్రహ్మర్షులతో నిండిన తపోలోకంలో నివసించే అవకాశం దక్కుతుంది.

✤ శనివారం నాడు జాజీ, మల్లికా పుష్పాలతో స్వామిని అర్చిస్తే మహాపాపాలు చేసిన వాడైనా సరే యమలోకాన్ని చూడడు.

## తిథులు - నైవేద్యాలు

✤ పాడ్యమినాడు అరుణాచలేశ్వరుడికి పాయసాన్ని నివేదించిన వాడికి ధనధాన్య సమృద్ధి కలుగుతుంది.

✤ విదియనాడు దధ్యోదనం స్వామికి నివేదిస్తే వారికి భోగభాగ్యాలు లభిస్తాయి.

- తదియనాడు అరుణగిరీశ్వరుడికి అపూపాలు నివేదన చేసిన వారు జీవితాంతం దృఢమైన శరీరంతో ఆరోగ్యంగా ఉంటారు.
- చతుర్థినాడు పూర్ణకుంభాలు స్వామికి సమర్పించినవాడు సకల కామ్యాలనీ సిద్ధింప చేసుకుంటాడు.
- పంచమినాడు పులగాన్ని స్వామికి నివేదిస్తే అక్షయ భోగాలు కలుగుతాయి.
- షష్ఠినాడు చక్కెర పొంగలిని స్వామికి నివేదించాలి. అలా చేసినవాడి సంతానం అవిచ్ఛనంగా కొనసాగుతుంది.
- సప్తమీతిథినాడు నువ్వుల అన్నాన్ని అరుణగిరి నాథుడికి నైవేద్యం పెడితే, మానవులు సమస్త ఋణాలనుంచీ విముక్తి పొందుతారు.
- అష్టమినాడు రాజనాలబియ్యంతో అన్నం వండి నైవేద్యం పెడితే, రాజవశ్యం కలుగుతుంది.
- నవమీ తిథిలో గోధుమాన్నాన్ని శోణగిరినాథుడికి నివేదించాలి. అలా చేసినవారికి రాజయక్ష్మాది రోగబాధలు వుండవు.
- దశమినాడు అన్నిరకాల కూరలు కలిపి వండిన కదంబాన్ని స్వామికి సమర్పిస్తే సకల లోక ప్రియులవుతారు.
- ఏకాదశి తిథినాడు అరుణాచలేశ్వరుడికి అటుకులు నైవేద్యం పెట్టాలి. తద్వారా ఆయన అభయం మానవులకి లభిస్తుంది.
- ద్వాదశినాడు పప్పన్నం స్వామికి నివేదిస్తే కోరిన కోరికలన్నీ సిద్ధిస్తాయి.
- త్రయోదశి తిథి ఉన్నరోజు సత్తుపిండిని అరుణగిరి నాథుడికి నివేదించాలి. దానివల్ల శాంతితో కూడిన జీవితం లభిస్తుంది.
- చతుర్దశినాడు వివిధరకాల ఫలాల్ని స్వామికి నివేదించాలి. అలా చేసినవాడు మూర్ఖుడైనా సరే మహాపండితుడౌతాడు.
- పౌర్ణమి పర్వదినాన పనసపండుని అరుణాచలేశ్వరుడికి నైవేద్యం పెట్టాలి. అలా చేసిన వారికి కంటి జబ్బులు తొలగిపోతాయి.
- అమావాస్య నాడు కందమూలాల్ని తెచ్చి స్వామికి సమర్పించాలి. తద్వారా సమర్పించిన వాడి పితృదేవతలు సంతోషిస్తారు.

# నక్షత్రాలు - ద్రవ్యాలు

✦ అశ్వినీ నక్షత్రంనాడు స్వామికి వస్త్రాలు సమర్పించాలి.

✦ భరణీ నక్షత్రంనాడు స్వామికి ఆభరణాలు సమర్పించాలి.

✦ కృత్తికా నక్షత్రంనాడు స్వామికి దీపాలు వెలిగించాలి.

✦ రోహిణీ నక్షత్రం నాడు స్వామికి వెండిని సమర్పించాలి.

✦ మృగశీర్షా నక్షత్రంనాడు స్వామికి చందనాన్ని సమర్పించాలి.

✦ ఆర్ద్రా నక్షత్రంనాడు స్వామికి హరిచందనాన్ని సమర్పించాలి.

✦ పునర్వసు నక్షత్రంనాడు స్వామికి పునుగు, గంధాన్ని సమర్పించాలి.

✦ పుష్యమీ నక్షత్రంనాడు స్వామికి కర్పూరాన్ని సమర్పించాలి.

✦ ఆశ్లేషా నక్షత్రంనాడు స్వామికి కుంకుమపువ్వు సమర్పించాలి.

✦ పూర్వఫల్గుణీ నక్షత్రంనాడు స్వామికి తాంబూలాన్ని సమర్పించాలి.

✦ ఉత్తర ఫల్గుణీ నక్షత్రంనాడు స్వామికి అగరుధూపాన్ని సమర్పించాలి.

✦ హస్తా నక్షత్రంనాడు స్వామికి కాలాగరు ద్రవ్యాన్ని సమర్పించాలి.

✦ చిత్రా నక్షత్రంనాడు స్వామికి యక్షకర్దమాన్ని సమర్పించాలి.

✦ స్వాతీ నక్షత్రంనాడు స్వామికి తులసీ దళాల్ని సమర్పించాలి.

✦ విశాఖా నక్షత్రంనాడు స్వామికి చామరాలని సమర్పించాలి.

✦ అనూరాధా నక్షత్రంనాడు స్వామికి ముత్యాల గొడుగుని సమర్పించాలి.

✦ జ్యేష్ఠా నక్షత్రంనాడు స్వామికి గోవుని సమర్పించాలి.

✦ మూలా నక్షత్రంనాడు స్వామికి ముత్యాలహారాన్ని సమర్పించాలి.

✦ పూర్వాషాఢా నక్షత్రంనాడు స్వామికి కిరీటాన్ని సమర్పించాలి.

✦ ఉత్తరాషాఢా నక్షత్రంనాడు స్వామికి రత్నాభరణాల్ని సమర్పించాలి.

✦ శ్రవణానక్షత్రం నాడు స్వామికి భద్రపీఠాన్ని సమర్పించాలి.

✦ ధనిష్ఠా నక్షత్రం నాడు స్వామికి బంగారాన్ని సమర్పించాలి.

✦ శతభిషా నక్షత్రం నాడు స్వామికి వస్త్రాల్ని సమర్పించాలి.

✦ పూర్వాభాద్రా నక్షత్రంనాడు స్వామికి భోగ్యవస్తువులు సమర్పించాలి.

✦ ఉత్తరాభాద్రా నక్షత్రంనాడు స్వామికి అశ్వాల్ని సమర్పించాలి.

✦ రేవతీ నక్షత్రం నాడు స్వామికి బంగారు రథాన్ని సమర్పించాలి.

మహాశివుడికి అత్యంత ప్రీతి పాత్రమైన శివరాత్రి (మాఘకృష్ణ చతుర్దశి) నాడు, అరుణాచలేశ్వరుడికి శతరుద్రీయాన్ని పఠిస్తూ సహస్రఘటాభిషేకం చేయాలి. ఆ రోజు ప్రత్యేక బిల్వాలతోవీ కర,దీర పుష్పాలతో అరుణాచలేశ్వరుణ్ణి పూజించి రాత్రంతా జాగారం చేయాలి.

భూలోకంలో స్వర్గాపవర్గాల ప్రాప్తికి, అరుణాచలుణ్ణి మించిన దైవం మరొకడు లేడు. అరుణాచలం అన్న స్మరణ, అరుణాచల శ్రవణ దర్శనాల చేతనే, మానవులు ఎంతో పవిత్రులవుతారు. ఈ క్షేత్రంలో జన్మించినవారికి సమస్తభోగభాగ్యాలు, మరణానంతరం ముక్తి కలుగుతాయి. ఇతర ప్రదేశాల్లో మరణించిన వారికి ఈ అరుణాచలంలో శ్రాద్ధకర్మ చేస్తే, వారికి ఉత్తమగతులు కలుగుతాయి. అయోధ్యా-మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా, పూరీ, ద్వారకా క్షేత్రాలకన్నా అరుణాచలం అత్యంత విశిష్ఠమైనది.

## వేంకటాచల మాహాత్మ్యం

పూర్వం దేవయుగంలో ఒకనాడు నారదమహర్షి వివిధరకాల రత్నాలతో ప్రకాశిస్తున్న సుమేరు పర్వతం మీదకి వెళ్లాడు. ఆ పర్వతం మధ్యలో ఉన్న విశాలమైన ప్రాంతం బ్రహ్మదేవుడి నివాసస్థానం. అక్కడికి వెళ్లిన నారదుడు దానికి ఉత్తరదిశలో పెద్ద రావిచెట్టుని చూసాడు. అది వెయ్యి యోజనాల పొడవుతో రెండువేల యోజనాల విస్తీర్ణంతో వ్యాపించి వుంది. ఆ దివ్య వృక్షం మొదట్లో నవరత్నాలతో నిర్మించిన ఒక అందమైన మండపం ఉంది. పద్మరాగ మణులతో చేసిన వేలకొద్దీ స్తంభాలు ఆమండపంలో కొలువుదీరాయి. దాని ముఖద్వారం పద్మరాగమణులతో అలంకరించబడి ఉంది. ఆ ద్వారం నుంచి లోపలికి ప్రవేశించిన నారదుడు, అక్కడొక ముత్యాల మండపాన్ని చూసాడు. ఆ మండపంలో వైఢూర్యాలతో చేసిన ఎత్తైన వేదిక ఉంది. నారదుడు దాని మీదకెక్కాడు.

ఎదురుగా గొప్ప కాంతితో మెరిసిపోయే బంగారు సింహాసనం కనిపించింది. ఆ సింహాసనం మీద వేయి రేకులతో, వేయి చంద్రుల కాంతితో వెలుగొందుతూ కర్ణికా కేసరాలతో ప్రకాశిస్తున్న ఒక అందమైన తామరపువ్వుని చూసాడు. ఆ తామరపువ్వు మధ్యలో చిద్విలాసంగా యజ్ఞవరాహమూర్తి ఆసీనుడై నారదుడికి దర్శనమిచ్చాడు. బ్రహ్మ, వశిష్ఠుడు, అత్రి, మార్కండేయుడు, భృగువులాంటి మహర్షులు ఆయన్ని సేవిస్తున్నారు. ఆవిధంగా లోకపాలకులతో, గంధర్వులతో, అప్సరసలతో సేవించబడుతున్న ఆ వరాహమూర్తికి నారదుడు ఎంతో భక్తిగా నమస్కరించాడు.

**భూదేవి రాక :** అదే సమయంలో దేవదుందుభులు మ్రోగాయి ఆ ధ్వనితో పాటు రత్నాభరణాలు ధరించిన భూదేవి తన చెలికత్తెలతో కలిసి అక్కడికొచ్చింది. భూదేవి సఖులిద్దరిపేర్లు ఇళా-పింగళా. వారిద్దరూ తెచ్చిన పూలని తీసుకుని యజ్ఞవరాహమూర్తి పాదాల మీద చల్లింది భూదేవి. అప్పుడు వరాహమూర్తి సంతోషించి భూదేవిని తన ఒడిలో కూర్చోబెట్టుకున్నాడు.

భూదేవిని కుశల ప్రశ్నలు వేసి "దేవీ! నిన్ను మోస్తూ వుండమని నీ కింద పాతాళంలో ఆదిశేషుణ్ణి నిలిపాను. అలాగే నీకు సహాయంగా ఎన్నో పర్వతాల్ని నీ మీద నెలకొల్పాను. ఎందుకు ఇక్కడికి వచ్చావు? నీకేమైనా కష్టం కలిగిందా! చెప్పు" అని ప్రశ్నించాడు. అందుకు భూదేవి నాథా! పాతాళంలో ఉన్న నన్ను పైకి తెచ్చి ఆదిశేషుడి పడగలమీద ఉంచావు. నాకు తోడుగా నన్ను ధరించే శక్తి కలిగిన నీ అంశతో వుండే పర్వతాల్ని ఏర్పాటు చేసావు. చాలా సంతోషం. అయితే నాకు ఆధారంగా ఉన్న పర్వతాలలో ఏవి ముఖ్యమైనవో తెలియచేయి. ఈ విషయం తెలుసుకుందామనే నేనిక్కడికి వచ్చాను" అని అడిగింది భూదేవి. వరాహమూర్తి ఆమెకిలా సమాధానం చెప్పటం ప్రారంభించాడు.

## భూలోకంలో ఉన్న పవిత్ర పర్వతాలు

సుమేరు ర్హిమవాన్వింధ్యో మందరో గంధమాదనః ।
సాలగ్రామ శ్చిత్రకూటో మాల్యవాన్పారియాత్రకః ॥ 1

మహేంద్రో మలయః సహ్యః సింహాద్రిరపి కైవతః ।
మేరుపుత్రోంఽజనో నామశైలః స్వర్ణమయో మహాన్ ॥ 2

ఏ తే శైలవరాః సర్వే త్వదాధారా వసుంధరే ।
సాలగ్రామశ్చ సింహాద్రి శ్శైలేంద్రో గంధమాధనః ॥ 3

ఏతే శైలవరా దేవి దిశం హైమవతీం శ్రితాః ।
దక్షిణస్యాం ప్రతీతాంస్తు వక్ష్యే శైలాన్వసుంధరే ॥ 4

అరుణాద్రిర్హస్తిశైలో గృధ్రాద్రిర్ఘటికా చలః ।
ఏతే శైలవరాః సర్వే క్షీరనద్యా స్సమీపగాః ॥ 5

హస్తి శైలా దుత్తరతః పంచయోజనమాత్రతః ।
సువర్ణముఖరీ నామ నదీనాం ప్రవరా నదీ ॥ 6

తస్యా ఏవోత్తరే తీరే కమలాఖ్యం సరోవరమ్ ।
తత్తీరే భగవానాస్తే శుకస్య వరదో హరిః ॥ 7

బలభద్రేణ సంయుక్తః కృష్ణో భక్తార్తి నాశనః ।
వైఖానసర్మునిగణై ర్నిత్య మారాదితో ఽమలైః ॥ 8

*(శ్లో॥37-45,అధ్యా-2,వైష్ణవఖండం)*

దేవీ! సుమేరువు, హిమవంతం, వింధ్య, మందరం, గంధమాదనం, సాలగ్రామం, చిత్రకూటం, మాల్యవంతం, పారియాత్రికం, మహేంద్రం, మలయం, సహ్యాద్రి, రైవతం, మేరుపుత్రం, అంజనాద్రి, అనే పర్వతాలన్నీ నీకు ఆధారమైనవి. వీటిలో గొప్పవి ఏమిటంటే? ఉత్తరదిశలో ఉన్న పర్వతాలలో సాలగ్రామ పర్వతం, సింహాద్రి, గంధమాదనం ముఖ్యమైనవి. దక్షిణ దిశలో ఉన్న పర్వతాలలో అరుణాద్రి, గజపర్వతం, గృధ్ధాద్రి, ఘటికాచలం అనే పర్వతాలు చాలా గొప్పవి. ఈ పర్వతాలన్నీ పాలసముద్రానికి దగ్గర్లో ఉన్నాయి.

గజపర్వతానికి ఉత్తరదిశలో, అయిదు యోజనాల దూరంలో 'సువర్ణముఖరి' అనే నది ఉంది. ఆ నదికి ఉత్తరంగా 'కమల' అనే పేరుతో

ఒక సరోవరం వుంది. ఆ సరోవర తీరంలో పూర్వం శుకమహర్షికి వరప్రదానం చేసిన శ్రీహరి కొలువై ఉన్నాడు. ఆయన నిత్యం వైఖానస ముని గణాల చేత ఆరాధించబడుతూ ఉంటాడు.

**వేంకటాచలం :** కమల సరోవరానికి ఉత్తరంగా ఉన్న అరణ్యంలో, రెండున్నర యోజనాల దూరంలో, హరిచందన వృక్షాలు దట్టంగా ఉన్న ప్రదేశంలో, వాసుదేవుడి నివాసస్థానమైన వేంకటాచలం నెలకొంది. ఏడు యోజనాల విస్తీర్ణంతో ఉన్న ఆ పర్వతం బంగారంతో నిండి, రత్నాల సానువులతో చాలా ఉన్నతంగా కనిపిస్తోంది. ఇంద్రాది దేవతలు వశిష్ఠాది మునీశ్వరులు, సిద్ధులు, సాధ్యులు, మరుత్తులు, దానవులు, గరుడులు, కిన్నెరులు, రాక్షసులు, రంభాది అప్సరసలు అక్కడ తపస్సు చేస్తుంటారు. దేవీ! వీరంతా తపస్సు చేసే ఆ వేంకటాచలం మీద ఎన్నో దివ్యమైన సరోవరాలు తీర్థాలు వున్నాయి.

**వేంకటాచలం మీదున్న తీర్థాలు :** దేవీ! వేంకటాచలం మీద నెలకొన్న దివ్య తీర్థాలలో ఏడు ముఖ్యమైనవి.

చక్రతీర్థం దైవతీర్థం వియద్గంగా తథైవ చ ।
కుమారధారికా తీర్థం పాపనాశనమేవ చ ॥

పాండవం నామ తీర్థం చ స్వామి పుష్కరిణీ తథా ।
సప్తైతాని వరాణ్యాహం ర్నారాయణగిరే ముఖే ॥ *(శ్లో॥50-51,అధ్యా-1)*

1.చక్రతీర్థం 2.దైవతీర్థం 3.వియద్గంగా తీర్థం 4.కుమారధారికా తీర్థం 5.పాపనాశన తీర్థం 6.పాండవతీర్థం 7.స్వామి పుష్కరిణి అనేవి. ఈ ఏడు దివ్యతీర్థాలూ నారాయణగిరిమీద ఉన్నాయి. వీటన్నిటిలోకీ శ్రేష్ఠమైనది స్వామి పుష్కరిణి. భూదేవీ! ఆ స్వామి పుష్కరిణికి ఉత్తరతీరంలో నీవు నేనూ నివసిస్తున్నాం. దక్షిణ తీరంలో జగత్పతి శ్రీనివాసుడు అర్చామూర్తిగా కొలువున్నాడు.

స్వామి పుష్కరిణి గంగాది సకల తీర్థాలతో సమానమైనది. ముల్లోకాల్లో ఏ ఏ సరస్సులున్నాయో అవన్నీ ఈ సరోవరంలో కూడా ఉన్నాయి. సకలదేవతలూ ఈ పుష్కరిణిలో స్నానం చేస్తుంటారు. ఈ పుష్కరిణిలో స్నానంచేసిన వారికి సకల పాపాలూ నశిస్తాయి.

**వేంకటాద్రి మహత్మ్యం :** భూదేవీ! వేంకటాద్రి ఎంతోగొప్పది. ఎందుకంటే సాక్షాత్తు శ్రీనివాసుడు స్వయంగా కొలువున్న దివ్య పర్వతం ఇది.

దేవాశ్చఋషయశ్చైవ యోగినః సనకాదయః ।
కృతేఽఞ్జనాద్రిం త్రేతాయాం నారాయణగిరిం తథా ॥
ద్వాపరే సింహశైలం చ కలౌ శ్రీవేంకటాచలం ।
ప్రదంతీహ విద్వాంసః పరమాత్మాలయం గిరిమ్ ॥

*(శ్లో॥60-61,అధ్యా-1)*

దేవీ! దేవతలు, ఋషులు, సనకాదియోగులు కృతయుగంలో అంజనాద్రి, త్రేతాయుగంలో నారాయణాద్రి ద్వాపరయుగంలో సింహాద్రి కలియుగంలో శ్రీవేంకటాద్రి పరమాత్మకి స్థానమైన స్థావరాలని చెబుతారు.

యోజనానాం సహస్రాంతే ద్వీపాంతరగతోఽపివా ।
యోనమో ద్భూధరేంద్రం తద్దిశముద్దిశ్య భక్తితః ।
సర్వపాప వినిర్ముక్తో విష్ణులోకం సగచ్ఛతి ॥ *(శ్లో॥62,అధ్యా-1)*

దేవీ సాక్షాత్తు శ్రీనివాసుడు కొలువున్న వేంకటాద్రికి యోజనాల దూరంలో ఉన్నప్పటికీ, మరోద్వీపానికి వెళ్ళినప్పటికీ ఒక్కసారి వేంకటాద్రి ఉన్న దిక్కుకి తిరిగా భక్తితో నమస్కరిస్తే చాలు ఆ మానవుడు సకల పాపాలనుంచీ విముక్తుడవుతాడు. చివరికి అతడికి విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది. దేవీ! దివ్యమైన వెంకటాద్రి మీద స్వామి పుష్కరిణి తరువాత ఆరు మహిమాన్వితమైన తీర్థాలున్నాయి.

**1. కుమారధారా తీర్థం :** సకల పాపాల్ని పోగొట్టే తీర్థం ఇది. సూర్యుడు కుంభలగ్నంలో ఉండే కుంభమాసంలో పుణ్యతిథి అయిన పౌర్ణమినాడు ఈ తీర్థానికి అత్యంత పవిత్రమైన తిథి. పార్వతీదేవి పుత్రుడైన కుమారస్వామి నిత్యం శ్రీనివాసుణ్ణి అర్చిస్తూ ఈ తీర్థం దగ్గరే నివసిస్తుంటాడు. ఈ కుమారధారా తీర్థంలో మధ్యాహ్నం పూట స్నాం చేస్తే, గంగాది సకలతీర్థాలలో నియమంగా పన్నెండు సంవత్సరాలు స్నానం చేస్తే లభించే ఫలితాన్ని పొందుతారు.

అదేవిధంగా ఆ తీర్థానికి సమీపంలో అన్నదానం చేసినవాడికి కూడా పై తెలిపిన పుణ్యఫలమే లభిస్తుంది.

**2. తుంబుర తీర్థం :** సూర్యుడు మీనరాశిలో ఉన్నప్పుడు పౌర్ణమినాడు, చంద్రుడు ఉత్తరఫల్గుణీ నక్షత్రంతో కూడివున్నప్పుడు, నాలుగోఝాము తుంబుర తీర్థంలో స్నానంచేయటానికి అత్యంత పవిత్రమైన సమయం. ఆ సమయంలో గనుక తుంబుర తీర్థంలో స్నానం చేస్తే, వారికి పునర్జన్మ వుండదు.

**3. ఆకాశగంగా (వియద్గంగ) తీర్థం :** సూర్యడు మేషరాశిలో ఉన్నప్పుడు, చంద్రుడు చిత్తానక్షత్రం ఉన్నరోజు, పౌర్ణమి నాటి తెల్లవారురుఝామున, ఆకాశగంగలో స్నానం చేసిన వాడికి ముక్తి లభిస్తుంది.

**4. పాండవ తీర్థం :** సూర్యుడు వృషభరాశిలో ఉండగా, అదే సమయంలో చంద్రుడు విశాఖా నక్షత్రంతోకూడిఉన్నప్పుడు, ద్వాదశి ఆదివారం నాడు, శుక్లపక్షంలేక కృష్ణపక్షంలో గానీ, కుజుడితో చంద్రుడు కలిసినపుడు లేదా ద్వాదశి ఆదివారంనాడు గానీ, చంద్రుడు పుష్యమీ నక్షత్రంలో ఉన్నప్పుడు గానీ, హస్తా నక్షత్రంలో ఉన్నరోజు గానీ, పాండవతీర్థంలో స్నానం చేయటానికి తగిన సమయం. ఈ సమయంలో స్నానంచేసినవాడు ఇహలోకంలో దుఃఖాన్ని పొందడు.

**5. పాపనాశన తీర్థం :** శుక్లలేక కృష్ణపక్షంలో సప్తమీ ఆదివారం నాడు, చంద్రుడు పుష్యమీ నక్షత్రంలోగానీ, హస్తా నక్షత్రంలోగానీ కలిసి ఉన్నప్పుడు, పాపనాశ తీర్థంలో నియమంగా స్నానం చేసినవారికి కోటి జన్మల్లో చేసిన పాపం నశిస్తుంది.

**6. దేవ తీర్థం :** అనంతగిరి మీద వరాహస్వామి స్థానానికి వాయువ్యదిశలో ఒక కొండ గుహ ఉంటుంది. ఆ గుహలో దేవతీర్థం అనే అందమైన సరస్సు ఉంది. గురువు పుష్యమీనక్షత్రంలో, చంద్రుడు శ్రవణా నక్షత్రంలో, వ్యతీపాతాన్ని పొందినప్పుడు ఆ సరోవరంలో స్నానం చేసినవారికి తెలిసి–తెలియక చేసిన పాపాలన్నీ నశిస్తాయి. పుణ్యం పెరుగుతుంది.

దీర్ఘాయువు కలుగుతుంది. శరీరపతనానంతరం ఇక్కడ స్నానం చేసిన మానవుడు ఉన్నతమైన చంద్రలోకాన్ని చేరుకుంటాడు. ఈ సరోవర ప్రాంతంలో అన్నదానం చేసినవాడికి అక్షయమైన పుణ్యఫలాలు లభిస్తాయి.

ఈ విధంగా యజ్ఞవరాహ మూర్తి భూదేవి అడిగిన ప్రశ్నలకి సమాధానం చెప్పగా, విని ఎంతో ఆనందించిన భూదేవి స్వామినిలా స్తుతించింది.

## భూదేవి చేసిన వరాహస్తుతి

నమస్తే దేవదేవేశ వరాహ వదనాచ్యుత ।
క్షీరసాగర సంకాశ వజ్రశృంగ మహాభుజ ॥ 1

ఉద్ధృతాస్మి త్వయా దేవ కల్పాదౌ సాగరాంభసః ।
సహస్రబాహునా విష్ణో ధారయాసి జగంత్యహమ్ ॥ 2

అనేక దివ్యాభరణ యజ్ఞసూత్ర విరాజిత ।
అరుణారుణాంబరధర దివ్యరత్న విభూషిత ॥ 3

ఉద్యద్భాను ప్రతీకాశ పాదపద్మ నమో నమః ।
బాలచంద్రాభ దంష్ట్రాగ్ర మహాబల పరాక్రమ ॥ 4

దివ్యచందన లిప్తాంగ తప్తకాంచన కుండల ।
ఇంద్రనీల మణిద్యోతి హేమాంగద విభూషిత ॥ 5

వజ్ర దంష్ట్రాగ్ర నిర్భిన్న హిరణ్యాక్ష మహాబల ।
పుండరీకాభిరామాక్ష సామస్వన మనోహర ॥ 6

శ్రుతిసీమంత భూషాత్మ న్సర్వాత్మం శ్చారు విక్రమ ।
చతురానన శంభుభ్యాం వందితాయతలోచన ॥ 7

సర్వవిద్యామయాకార శబ్దాతీత నమో నమః ।
ఆనంద విగ్రహానంత కాలకాల నమోనమః ॥ 8

*(శ్లో॥85-92,అధ్యా-1)*

ఈవిధంగా వరాహమూర్తిని స్తుతించి ఆయన పాదాలకు నమస్కరించింది. తరువాత వరాహమూర్తి భూదేవిని తీసుకుని నారదాది మునీంద్రులు స్తుతిస్తుండగా గరుడిడి పైకెక్కి వేంకటాచలానికి వెళ్ళాడు. అక్కడ స్వామి పుష్కరిణికి పశ్చిమ భాగంలో కొలువయ్యాడు. ఆనాటి నుంచి స్వామి బ్రహ్మతో సమానులైన వైఖానసుల చేత నిత్యం పూజించబడుతున్నాడు.

## వరాహస్వామి మంత్రోపాసన

పూర్వం భూదేవి ఒకనాడు వరాహస్వామిని దర్శించి నాథా!ఏ మంత్రాన్ని ఉపాసిస్తే నీ అనుగ్రహం కలుగుతుంది? జపించినవారి కోరికలన్నీ తీర్చేది, నియమంగా పఠించిన వారికి నీ దివ్యానుగ్రహాన్ని కలిగించేది, అయిన మంత్రాన్ని లోకహితం కోసం చెప్పండి స్వామీ! అని ప్రార్థించింది. ఆమె కోరిక విని చిరునవ్వుతో యజ్ఞ వరాహమూర్తి తన దివ్య మంత్రాన్ని ఇలా తెలియచేశాడు.

దేవీ! అతి రహస్యమైనది, సకల సంపదల్ని, విద్యని వెంటనే ప్రసాదించేది, భూలాభాన్ని, పుత్రలాభాన్ని కలిగించేది, ఇతరులకి బహిరంగంగా చెప్పకూడనిది అయిన నా మంత్రాన్ని చెబుతున్నా విను. దీన్ని శ్రద్ధ కలిగినవాడికి తప్పకుండా చెప్పాలి.

అస్య శ్రీ వరాహమహామంత్రస్య సంకర్షణ ఋషిః ।
పంక్తి ఛందః । శ్రీ యజ్ఞ వరాహో దేవతా ॥ శ్రీ బీజం
శ్రీ వరాహస్వామి అనుగ్రహసిద్ధ్యర్థం జపే వినియోగః ॥

**ధ్యానం :**

శుద్ధ స్ఫటిక శైలాభం రక్తపద్మదళేక్షణం ।
వరాహ వదనం సౌమ్యం చతుర్బాహుం కిరీటినం ॥

శ్రీవత్స వక్షసం చక్రశంఖాభయ కరాంబుజమ్ ।
వామోరు స్థితయా యుక్తం త్వయా మాం సాగరాంబరే ॥

రక్తపీతాంబరధరం రక్తాభరణ భూషితమ్ ।
శ్రీకూర్మ పృష్ఠ మధ్యస్థ శేష మూర్త్యబ్జసంస్థితం ॥ *(శ్లో॥14-16,అధ్యా-2)*

**మంత్రం : ఓం నమః శ్రీ వరాహాయ ధరణ్యుద్ధరణాయ చ**

**భావం :** భూమిని ఉద్ధరించిన శ్రీ వరాహస్వామికి నమస్కారం.

ఈ మంత్రాన్ని గురువుద్వారా ఉపదేశం పొంది 4 లక్షల సార్లు జపించాలి. తరువాత దశాంశహోమాన్ని పాయసం, తేనె, నేయిలతో కలిపి చేయాలి. నిత్యం ధ్యానంతో సహా ఈ మంత్రాన్ని 108 సార్లు పఠిస్తే శుభం జరుగుతుంది.

"పూర్వం ఈ మంత్రాన్ని కృతయుగంలో ధర్ముడనే వాడు బ్రహ్మద్వారా ఉపదేశం పొంది జపించాడు. తరువాత ఇంద్రుడు, ఆదిశేషుడు ఈ మంత్రాన్ని జపించి నా అనుగ్రహాన్ని పొందారు. ఆదిశేషుడు ఈ మంత్రాన్ని జపించే, భూమిని భరించగలిగిన సామర్థ్యాన్ని పొందాడు" అని భూదేవికి చెప్పాడు శ్రీహరి.

## ఆనంద విమానం

పూర్వం వైవస్వత మన్వంతరం కృతయుగంలో జరుగుతున్నప్పుడు వాయుదేవుడు శ్రీహరి కోసం గొప్ప తపస్సు చేసాడు. ఈ తపస్సు ఫలితంగా శ్రీనివాసుడు శ్రీ దేవీ- భూదేవీ సమేతుడై, స్వామి పుష్కరిణికి దక్షిణ భాగంలో 'ఆనందం' అనే విమానం మీద నివసించసాగాడు. అలా నిలిచిన స్వామిని కుమార తీర్థంలో ఉన్న కుమారస్వామి నిత్యం అర్చిస్తూ ఉండేవాడు. ఆ విమానం నచ్చిన శ్రీనివాసుడు, కల్పాంతం దాకా అక్కడే అదృశ్యంగా నివసించాలని నిర్ణయించుకున్నాడు.

ఒకనాడు అగస్త్యమహర్షి అక్కడికి వచ్చి విమానంలో నివసిస్తున్న శ్రీనివాసుణ్ణి పన్నెండు సంవత్సరాలు ఆరాధించి ఆయన్ని సంతోషపరిచాడు. అగస్త్య మహర్షి స్వామిని "ప్రభూ! అందరికీ కనిపించేలా ఈ ఆనంద శిఖరం మీద నివసించు" అని కోరగా, శ్రీదేవీ భూదేవీ సహితుడైన శ్రీనివాసుడు ఇలా అన్నాడు.

అగస్త్యా! నీ కోరిక ప్రకారం ఇకపై సకల జీవులకీ కనిపిస్తా. అయితే ఈ ఆనంద విమానం మాత్రం ఎవరికీ కనిపించదు. ఈ కల్పాంతం వరకూ నేనిక్కడే కొలువుంటాను.

అహంద్రుశ్యో భవిష్యామి త్వత్కృతే సర్వదేహినామ్ ।
ఏతద్విమానం దేవర్షే నదృశ్యం స్యాత్కదాచన ।
ఆకల్పాంతం మునీంద్రాస్మిన్దృశ్యోహం నాత్రసంశయః ॥

*(శ్లో॥ 9, అధ్యా-3)*

అని స్వామి చెప్పగా విని, అగస్త్యమహర్షి ఎంతో సంతోషించాడు. స్వామికి తిరిగి నమస్కరించి తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు. ఇక ఆనాటినుంచీ చతుర్భుజుడైన శ్రీనివాసుడు ఈ విమానం నుంచి అందరికీ దర్శనమిస్తున్నాడు. కుమారస్వామి, వాయుదేవుడు నిత్యం స్వామిని అర్చిస్తూ ఉన్నారు. ఇలా నాలుగు యుగాలు గడిచిపోయాయి.

## దేవతలు చేసిన లక్ష్మీస్తుతి

పూర్వం దుర్వాసుడి వల్ల శపించబడ్డ లక్ష్మీనారాయణులు వైకుంఠాన్ని వదిలి భూలోకంలో కాంచనపద్మం అనే సరస్సు దగ్గర నివాసం ఏర్పర్చుకున్నారు. ఈ సరోవరం దగ్గరే లక్ష్మీదేవి పదివేల దివ్యసంవత్సరాల తపస్సులో మునిగిపోయింది. అక్కడ వైకుంఠంలో లక్ష్మీనారాయణులు కనపడక దేవతలంతా ఎంతో ఆందోళన పడ్డారు. వారి కోసం అన్ని లోకాలూ వెతికి, ఇంద్రుడితో సహా ఈ సరోవరం దగ్గరకి వచ్చారు. అక్కడ బంగారు కమలంలో శ్రీహరితో కలిసి చిద్విలాసంగా ఉన్న లక్ష్మీదేవిని దర్శించి ఎంతో ఆనందించారు. లోకాలకి తల్లి అయిన ఆ దేవిని ఇంద్రాది దేవతలు ఇలా స్తుతించారు.

నమః శ్రియై లోకధాత్ర్యై బ్రహ్మమాత్రే నమో నమః ।
నమస్తే పద్మనేత్రాయై పద్మముఖ్యై నమోనమః ॥ 1

ప్రసన్న ముఖపద్మాయై పద్మకాంత్యై నమోనమః ।
నమో బిల్వవనస్థాయై విష్ణుపత్న్యై నమోనమః ॥ 2

విచిత్ర క్షేమధారిణ్యై పృథుశ్రోణ్యై నమోనమః ।
పక్వబిల్వ ఫలాపీనతుంగస్తన్యై నమోనమః ॥ 3

సురక్త  పద్మపత్రాభ కరపాదతలే శుభే ।
సురత్నాంగద కేయూర కాంచీనూపుర శోభితే ।
యక్షకర్దమ సంలిప్త సర్వాంగే కటకోజ్జ్వలే ॥ 4

మాంగల్యాభరణై శ్చిత్రై ర్ముక్తాహారై ర్విభూషితే ।
తాటంకైరవతంసైశ్చ శోభమాన ముఖాంబుజే ॥ 5

పద్మహస్తే నమస్తుభ్యం ప్రసీద హరివల్లభే ।
ఋగ్యజుః సామరూపాయై విద్యాయై తే నమో నమః ॥ 6

ప్రసీదస్మాస్కృపా దృష్టిపాతై రాలోకయాబ్ధిజే ।
యే దృష్టా స్తే త్వయా బ్రహ్మరుద్రేంద్రత్వం సమాప్నుయుః ॥ 7

సురారీ న్సహసా హత్వా స్వపదాని గమిష్యథ ।
యే స్థానహీనాః స్వస్థానాద్భ్రంశితా యే నరా భువి ॥ 8

తే మామనేన స్తోత్రేణ స్తుత్వా స్థానమవాప్నుయుః ।
అఖండై ర్బిల్వపత్రై ర్మామర్చయంతి నరా భువి ॥ 9

స్తోత్రేణానేన యే దేవా నరా యుష్మత్కృతేన వై ।
ధర్మార్థకామ మోక్షాణా మాకారాస్తే భవంతి వై ॥ 10

ఇదం పద్మసరోదేవా యే కేచన నరా భువి ।
ప్రాప్య స్నానం  కరిష్యంతి మాం స్తుత్వా విష్ణువల్లభామ్ ॥ 11

తేఽపి శ్రియం దీర్ఘమాయుర్విద్యాం పుత్రాన్సువర్చసః ।
లబ్ధ్వా భోగాంశ్చ భుక్త్వాంతే నరా మోక్షమవాప్నుయుః ॥ 12

ఇతి దత్త్వా వరం దేవీ దేవేన సహ విష్ణునా ।
ఆరుహ్య గరుడేశానం వైకుంఠస్థానమాయయౌ॥ 13

*(శ్లో॥99-105/107-112,అధ్యా-9)*

ఓ లోకమాతా, బ్రహ్మమాతా, పద్మనేత్రా, పద్మముఖీ నీకు నమస్కారం. ప్రసన్నమైన ముఖపద్మము కలదానా, పద్మకాంతి కలిగినదానా, బిల్వనములో నివసించుదానా, ఓ విష్ణుపత్నీ నీకు నమస్కారం. విచిత్రమైన పట్టువస్త్రములు

ధరించుదానా! విశాలమైన జఘనస్థలము కలదానా! పండిన మారేడు పండు వంటి ధృఢమైన ఉన్నతమైన స్తనములు కలదానా! నీకు నమస్కారం. ఎర్రతామరల వంటి పాదములు కలదానా! ఓ శుభా! చక్కని అంగదములు, కేయూరములు, కాంచి, నూపురములచే ప్రకాశించుదానా! యక్షకర్దమము శరీరమంతటా అలదుకొన్నదానా! కటకములచే ఉజ్జ్వలముగా ఉన్నదానా! మాంగల్యము మొదలైన వివిధములైన ఆభరణములచే, ముత్యాలహారములచే అలంకరింపబడినదానా! చెవి కమ్మలచే, శిరోభూషణములచే ప్రకాశించుచున్న ముఖాంబుజము కలదానా! పద్మమును హస్తమునందు ధరించినదానా నీకు నమస్కారం. హరికి మిక్కిలి ఇష్టురాలా అనుగ్రహించు. ఋక్, యజుస్, సామవిద్యల రూపమా నీకు నమస్కారం. మమ్ము కాపాడు. సాగరంలో పుట్టినదానా! నీ కృపాకటాక్షాలతో మమ్ము వీక్షించు. నీ చూపును పొందిన వారు బ్రహ్మత్వాన్ని, ఇంద్రత్వాన్ని, రుద్రత్వాన్ని పొందుతున్నారు.

## భూదాన మాహాత్మ్యం

భూమిదానం వినిశ్చిత్య సర్వదానోత్తమోత్తమమ్ ।
ప్రాపకం పరలోకస్య సర్వకామ ఫలప్రదమ్ ॥

దానానాముత్తమం దానం భూదానం పరికీర్తితమ్ ।
తద్దత్వా సమవాప్నోతి యద్యదిష్టతమం నరః ॥

*(శ్లో॥31-32,అధ్యా-20)*

అన్నిదానాల కన్నా ఉత్తమమైనది భూదానం. ఇది ఉత్తమలోకాన్ని కలిగిస్తుంది. అన్ని కోరికల్నీ తీరుస్తుంది. దానాలలో గొప్పదిగా ప్రశంసించబడింది. భూదానం వల్ల కలిగే శుభఫలితాల్ని వివరించి చెప్పటానికి ఎవరికీ సాధ్యంకాదు.

భూదానాత్పరం దానం న భూతం నభవిష్యతి ।
పరం నిర్వాణ భూమిదోనాత్రసంశయః ॥ *(శ్లో॥38,అధ్యా-20)*

భూదానాన్ని మించిన దానం ఇంతకుముందు లేదు. ఇకపై ఉండబోదు. భూదానం ఇచ్చినవాడు గొప్పసంతోషాన్ని పొందుతాడు. ఇందుకు ఏమాత్రం

సందేహం లేదు. వేదం చదువుకున్న విప్రుడికి ఏ కొంచెం భూమిని దానం చేసినా అది అనంతమైన ఫలితాన్నిస్తుంది. భూలోకంలో పరమపవిత్రమైన వేంకటాద్రిమీద భూదానం చేసినవాడు అన్నిపాపాల నుంచీ విముక్తుడవుతాడు. సత్పాత్రుడికి భూదానం చేసిన వాడు అన్ని దానాలు చేసిన ఫలాన్ని పొందుతాడు.

బ్రాహ్మణుడు విష్ణు స్వరూపుడు. ఎలాంటి వృత్తి జీవనాధారం లేని బ్రాహ్మణుడికే భూదానం చేయాలి. అలాంటి వాడికి చేసిన భూదానం వల్ల అక్షయమైన ఫలితాలు కలుగుతాయి.

## భద్రమతి వృత్తాంతం

పూర్వం భద్రమతి అనే విప్రుడుండేవాడు. అతడు పరమ సౌమ్యుడు. అన్ని రకాల ధర్మాల్నీ శ్రద్ధగా పాటించేవాడు. ఒకనాడు భద్రమతి వేంకటాద్రికి భార్యతో సహా బయలుదేరి, దారిలో సుశాలి అనే నగరాన్ని చేరాడు. ఆ నగరంలో సకల సంపదలతో తులతూగే సుఘోషుడనే విప్రుడి ఇంటికి వెళ్ళాడు. సుఘోషుడు వచ్చిన అతిథిని ఎంతో గౌరవంగా ఆదరించాడు. అప్పుడు భద్రమతి సుఘోషుణ్ణి అయిదడుగుల భూమిని దానం చేయమని యాచించాడు. అందుకు ఎంతో ఆనందించిన సుఘోషుడు, భద్రమతి అడిగినంత భూమిని దానం చేసాడు.

ఈ భూమిమొత్తం విష్ణుమయం కనుక విష్ణువుచేతే పాలించబడేది కనుక

పృథివీ వైష్ణవీ పుణ్యా పృథివీ విష్ణుపాలితా ।
పృథివ్యాస్తు ప్రదానేన ప్రీయతాం మే జనార్ధన ॥

*(శ్లో॥60,అధ్యా-20)*

నేను చేసే భూదానం చేత శ్రీహరి నామీద సంప్రీతి కలిగిఉండుగాక! అనే మంత్రాన్ని చదివి, భద్రమతిని సాక్షాత్తు విష్ణువుగా భావించి, భూమిని దానం చేసాడు సుఘోషుడు. ఆ విధంగా వేదపండితుడైన భద్రమతికి భూదానం చేసిన ఫలితంగా సుఘోషుడు తన ఏడుతరాల వారితో కలిసి తరించాడు.

అక్కడి నుంచి బయలుదేరిన భద్రమతి భార్యా పుత్రులతో కలిసి గంధర్వులు, యక్షులు, సకల పర్వతాలు నిత్యం కొలిచేది, మేరు పర్వతానికి

మిత్రుడైనది, వైకుంఠం నించి వచ్చింది శ్రీనివాసుడికి నిత్యవిహార స్థలమైనది అయిన వేంకటాద్రికి చేరుకున్నాడు. అక్కడ పావనమైన స్వామి పుష్కరిణిలో సంకల్పం చెప్పుకుని శుచిగా స్నానం చేసాడు. తరువాత పుష్కరిణి పశ్చిమ తీరంలో ఉన్న వరాహస్వామికి ముందుగా నమస్కరించి, శ్రీనివాసుడి ఆలయానికి వెళ్ళాడు.

ఆలయంలో భార్యాబిడ్డలతో కలిసి, నిత్యం బ్రహ్మాది దేవతలు అర్చించే స్వామిని దర్శించాడు. ఆలయం నుంచి బైటికి వచ్చి సరాసరి పాపవినాశన తీర్థానికి వెళ్ళాడు. అక్కడ సకుటుంబంగా పుణ్యస్నానం చేసి, వేదవేదాంగాలు చదువుకున్న ఒక విప్రుడికి సంకల్ప పూర్వకంగా భూదానం చేసాడు భద్రమతి. ఎప్పుడైతే భద్రమతి పవిత్రమైన పాపవినాశన తీర్థం దగ్గర భూదానం చేశాడో, అప్పుడే అతడి ఎదుట శంఖచక్రాలు ధరించిన శ్రీనివాసుడు గరుడ వాహనం మీద కూర్చుని ప్రత్యక్షమయ్యాడు. దివ్య మంగళాకారుడైన శ్రీనివాసుణ్ణి చూసి తన్మయత్వంలో భద్రమతి ఇలా స్తుతించాడు.

## భద్రమతి చేసిన శ్రీనివాస స్తుతి

నమో నమస్తేఽఖిల కారణాయ నమో నమస్తేఽఖిల పాలకాయ ।
నమో నమస్తే ఽమరనాయకాయ నమోనమో దైత్యవిమర్దనాయ ॥ 1

నమో భక్తిజన ప్రియాయ నమోనమః పాపవిదారణాయ ।
నమో నమో దుర్జననాశకాయ నమోఽస్తు తస్మైజగదీశ్వరాయ ॥ 2

నమో నమః కారణవామనాయ నారాయణాయాతి విక్రమాయ ।
శ్రీ శార్ఙ్గచక్రా గదాధరాయ నమోఽస్తు తస్మై పురుషోత్తమాయ ॥ 3

నమః పయోరాశి నివాసకాయ నమోఽస్తు లక్ష్మీపతయేఽవ్యయాయ ।
నమోఽస్తు సూర్యాద్యమిత ప్రభాయ నమోనమః పుణ్యగతా గతాయ ॥ 4

నమో నమోఽర్కేందు విలోచనాయ నమోఽస్తు తే యజ్ఞ ఫలప్రదాయ ।
నమోఽస్తు యజ్ఞాంగ విరాజితాయ నమోఽస్తు తే సజ్జనవల్లభాయ ॥ 5

నమోనమః కారణ కారణాయ నమోஉస్తు శబ్దాదివివర్జితాయ ।
నమోஉస్తు తే உభీష్టసుఖప్రదాయ నమోనమో భక్త మనోరమాయ ॥ 6
నమోనమస్తేஉద్భుతకారణాయ నమోஉస్తు తే మందరధారకాయ ।
నమోஉస్తుతే యజ్ఞవరాహ నామ్నే నమోహిరణ్యాక్ష విదారకాయ ॥ 7
నమోஉస్తుతే వామనరూపభాజ్ నమోஉస్తు తే క్షత్రకులాంతకాయ ।
నమోஉస్తుతే రావణ మర్దనాయ నమోஉస్తుతే నందసుతాగ్రజాయ ॥ 8
నమస్తే కమలాకాంత నమస్త సుఖదాయినే ।
శ్రితార్తి నాశినే తుభ్యం భూయో భుయో నమో నమః ॥ 9

*(శ్లో॥ 75-83, అధ్యా-21)*

సమస్తమునకు కారణమైన వాడా నీకు నమస్కారం. అందరను పాలించువాడా, దేవతలందరకు నాయకుడా, రాక్షసులను నాశనము చేసినవాడా నీకును నమస్కారం. భక్తజనులకు ఇష్టుడైనవాడా, పాపములను పోగొట్టువాడా, దుర్జనులను నాశనము చేయువాడా, జగత్తుకు ప్రభువైన వాడా నీకు నమస్కారం. కారణము చేత వామన రూపము ధరించినవాడా! నారాయణా, త్రివిక్రమ రూపము ధరించినవాడా, లక్ష్మిని, శార్ఙ్గమును, చక్రమును, ఖడ్గమును, గదను ధరించినవాడా, పురుషులలో ఉత్తముడా నీకు నమస్కారం.

పాల సముద్రమునందు నివసించువాడా, లక్ష్మీపతి, నాశనము లేనివాడా, సూర్యుడు మొదలైన వారికంటే మిక్కిలి కాంతి కల్గినవాడా, పుణ్యము చేసినవారికి గతి అయినవాడా నీకు నమస్కారం. సూర్యుడు, చంద్రుడు కన్నులుగా కలిగినవాడా, సజ్జనులకు ఇష్టుడైనవాడా, యజ్ఞఫలమును ఇచ్చువాడా, యజ్ఞాంగములచే ప్రకాశించువాడా నీకు నమస్కారం. కారణమునకే కారణమైనవాడా, శబ్దము మొదలైన వాటిచే వర్ణించుటకు శక్యము కాని వాడా, కోరిన సుఖములనిచ్చువాడా, భక్తుల మనస్సులకు ఆహ్లాదము కలిగించువాడా నీకు నమస్కారం. జగత్తుకు అద్భుతమైన కారణమగువాడా, మందర పర్వతమును మోసినవాడా, యజ్ఞవరాహమను పేరు గలవాడా,

హిరణ్యాక్షుని చీల్చి చంపినవాడా. వామనరూపమునందు కనిపించినవాడా, క్షత్రియ కులమును నాశనము చేసినవాడా, రావణుని సంహరించినవాడా, బలరాముడు అగ్రజునిగా కల్గినవాడా నీకు నమస్కారం. లక్ష్మీపతీ, సుఖమును ఇచ్చువాడా, ఆశ్రయించినవారి దుఃఖమును తొలగించువాడా నీకు మరల మరల నమస్కారం.

## రామానుజుడి వృత్తాంతం

పూర్వం వేంకటాద్రిమీద నెలకొన్న ఆకాశగంగ తీర్థం దగ్గర పరమవిష్ణు భక్తుడు, ఇంద్రియ నిగ్రహం కలిగినవాడు, ధర్మాత్ముడు, అయిన 'రామానుజుడు' అనే వైఖాసన విప్రుడుండేవాడు. ఆ ధర్మాత్ముడు, ఎండాకాలంలో పంచాగ్నుల మధ్య నిలబడి, హేమంత ఋతువుల్లో సరోవరాల్లో నిలబడి తపస్సు చేస్తున్నాడు. నిరంతరం తదేక దీక్షతో శ్రీమన్నారాయణ అష్టాక్షరీమంత్రాన్ని ధ్యానిస్తూ, కొంతకాలం పరిమిత ఆహారాన్ని, మరికొంతకాలం నిరాహారంగా ఉంటూ శ్రీహరి దర్శనం కోసం తపిస్తున్నాడు.

## శ్రీనివాస దర్శనం

రామానుజుడు చేసే తీవ్రమైన తపస్సు శ్రీనివాసుణ్ణి కదిలించింది. భక్తవాత్సల్యం కలిగిన స్వామి శంఖ, చక్ర, గదా బాణాల్ని ధరించి అతడి ముందు ప్రత్యక్షమయ్యాడు.

అథ తత్తపసా తుష్టో భగవాన్భక్తవత్సలః ।
ప్రత్యక్షతామగాత్తస్య శంఖచక్రగదాధరః ॥ 1

వికచాంబుజపత్రాక్షః సూర్యకోటి సమప్రభః ।
వినతా నందనారూఢ శ్ఛత్రచామర శోభితః ॥ 2

హారకేయూర ముకుటః కటకాది విభూషితః ।
విష్వక్సేనసునందాది కింకరైః పరివారితః ॥ 3

వీణావేణుమృదంగాది వాదకైర్నారదాదిభిః ।
గీయమానః సువిభవః పీతాంబర విరాజితః ॥ 4

సనకాది మహాయోగిసేవితః పార్శ్వయోః ద్వయోః ।
మందస్మితేన సకలం మోహయన్భువనత్రయమ్ ॥ 5

స్వభాసామానయప్సర్వా దిశోదశ విరాజయన్ ।
సుభక్త సులభో దేవో వేంకటేశో దయానిధిః ॥ 6

పునః సన్నిదధే తస్య రామానుజ మహామునేః ।
ఆవిర్భూతం తదా దృష్ట్వా శ్రీనివాసం కృపానిధిమ్ ॥ 7

పీతాంబరధరం దేవం తుష్టిం ప్రాప మహామునిః ।
భక్త్యా పరమాయాయుక్త స్తుష్టావ జగదీశ్వరమ్ ॥ 8

*(శ్లో॥7-15,అధ్యా-21)*

వికసించిన తారమరలాంటి కళ్ళు కలిగినవాడు, కోటిసూర్యులకాంతితో ప్రకాశించేవాడు, గురుడిపైన ఎక్కినవాడు, ఛత్రచామరాల చేత వెలుగొందేవాడు, హారాలు, కేయూరాలు కిరీటం కటకం వంటి వాటి చేత అలంకరించబడినవాడు, విష్వక్సేనుడు, సునందుడు వంటివారిచేత సేవలందుకుంటున్నవాడు, వీణ వేణువు మృదంగం లాంటి వాద్యాలు వాయిస్తూ నారదాది మునులచేత పాడబడుతున్న కీర్తి కలిగినవాడు, పచ్చటి పట్టు పీతాంబరాలు ధరించినవాడు, వక్షఃస్థలం మీద లక్ష్మీదేవిని నిలుపుకున్నవాడు, నీలమేఘంలాంటి శరీరఛాయ కలిగిన వాడు, సనకాది యోగుల చేత స్తుతించబడేవాడు, తన చిరునవ్వుతో ముల్లోకాలనీ మోహింపచేసేవాడు, పది దిక్కుల్నీ తన శరీరకాంతితో ప్రకాశింపచేసేవాడు, భక్తసులభుడు, దేవదేవుడు, వేంకటేశ్వరుడు, దయానిధి అయిన శ్రీనివాసుడు సర్వాంగ సుందరంగా రామానుజుడికి దర్శనమిచ్చాడు.

జగన్మోహనాకారుడైన శ్రీనివాసుడి దర్శనంతో, రామానుజుడు పులకించి పోయాడు. తన్మయత్వంతో స్వామిని ఇలా మధురంగా కీర్తించాడు.

## శ్రీనివాస స్తుతి

నమో భక్తార్తిహంత్రే తే కవ్యహవ్య స్వరూపిణే ।
నమస్త్రిమూర్తయే తుభ్యం సృష్టిస్థిత్యంతకారిణే ॥ 1

నమః పరేశాయ నమోతి భూమ్నే నమోఽస్తు లక్ష్మీ పతయే విధాత్రే ।
నమోఽస్తు సూర్యేందువిలోచనాయ నమో విరించా ద్యభివందితాయ ॥ 2

యో నామ జాత్యాదివికల్పహీనః సమస్తదోషైరపి వర్జితో యః ।
సమస్తసంసార భయాపహారిణే తస్మై నమో దైత్య వినాశకాయ ॥ 3

వేదాంత వేద్యాయ రమేశ్వరాయ వృషాద్రివాసాయ విధాతృపిత్రే ।
నమోనమః సర్వజనార్తిహారిణే నారాయణా యామిత విక్రమాయ ॥4

నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ శార్ఙ్గిణే ।
భూయో భూయో నమస్తుభ్యం వేంకటాద్రి నివాసినే ॥ 5

*(శ్లో॥17-21,అధ్యా-21)*

ఓ దేవాధిదేవా ! శంఖము, చక్రము, గద ధరించువాడా, నిత్యమైనవాడా, శుద్ధుడా, ఓ వెంకటేశా నీకు నమస్కారం. భక్తుల దుఃఖమును హరించువాడా! కవ్యము, హవ్యము అస్వరూపమైనవాడా, త్రిమూర్తుల స్వరూపమా, సృష్టికి, స్థితికి, అంతమునకు కారణమైనవాడా. పరమేశా, భూమిని అతిక్రమించువాడా, లక్ష్మీపతీ, విధాతా, సూర్యుడు, చంద్రుడు కన్నులుగా కలవాడా, బ్రహ్మాదులచేత స్తుతింపబడువాడా నీకు నమస్కారం. జాతి, వర్ణము మున్నగునవి లేనివాడా, ఏ దోషములు అంటనివాడా, సమస్త సంసారము యొక్క భయములను నాశనము చేయువాడా, రాక్షసులను నాశనము చేయువాడా నీకు నమస్కారం. ఉపనిషత్తుల చేత తెలియబడువాడా! రమాపతీ, వృషాద్రిపై నివసించువాడా, బ్రహ్మకు తండ్రీ, సమస్త జనుల శోకమును హరించువాడా, నారాయణా, అమితమైన విక్రమము కలవాడా నీకు నమస్కారం. భగవంతుడైన వాసుదేవా, శార్ఙ్గమును ధరించువాడా, వేంకటాద్రిపై నివసించువాడా, నీకు మరల మరల నమస్కారం.

ఈ విధంగా జగద్గురువైన శ్రీనివాసుణ్ణి స్తుతించి అలాగే స్వామిని చూస్తూ నిలబడిపోయాడు. రామానుజుడి స్తుతి విని శ్రీనివాసుడెంతో ఆనందించాడు. తన నాలుగు చేతులతో అతన్ని మనసారా కౌగిలించుకుని “రామానుజా! నీ తపస్సుకి, స్తోత్రానికి నేనెంతో సంతోషించాను. నీకేం వరం కావాలో కోరుకో”

అన్నాడు. శ్రీనివాసుడి మాటలు విని ఎంతో పులకించిపోయిన రామానుజుడు పరంధామా! పరాత్పరా! నీ దివ్య దర్శనంతో నా జన్మ ధన్యమయ్యింది. హరిహరబ్రహ్మాదులు సైతం ఎవరిని తెలుసుకోలేరో! ఎవరి గుణగణాల్ని వర్ణించలేరో అలాంటి నిన్ను కళ్ళారా చూడగలిగాను. నాకు అంతకన్నా గొప్పవరం ఇంకేముంటుంది. ఎవరి దివ్యనామాన్ని ఒక్కసారి ఉచ్చరిస్తే సకల పాపాలూ నశించి పోతాయో అలాంటి శ్రీనివాసుణ్ణి చూసాను. నా జన్మ ధన్యమయ్యింది. స్వామీ! నీ పాదపద్మాల మీద నాకు నిశ్చలమైన భక్తి వుండేలా దీవించు. "ఇదే నేను కోరేవరం" అని అన్నాడు.

రామానుజుడి నిష్కళంక భక్తికి మెచ్చుకున్న శ్రీనివాసుడు "రామానుజా! నీవు కోరినట్టే నీకు నామీద దృఢమైన భక్తి స్థిరంగా వుండుగాక! మరో విషయం చెబుతున్నా విను. సూర్యుడు మేషరాశిలో ప్రవేశించినప్పుడు పౌర్ణమినాడు చంద్రుడు చిత్తానక్షత్రంలో ప్రవేశించినప్పుడు ఆకాశగంగలో స్నానంచేసే మానవుడు, పునరావృత్తి లేని వైకుంఠ దివ్యధామాన్ని చేరుకుంటాడు. నీవు ఇక్కడే నివసించు. ఈ జన్మ అయిపోయాక నీవు సరాసరి నా లోకానికి వస్తావు. ఇక్కడ స్నానం చేసిన వారంతా పరమ భాగవతోత్తములు అని చెప్పాడు శ్రీనివాసుడు.

శ్రీనివాసుడు తనకి వరప్రదానం చేసినందుకు ఆనందించిన రామానుజుడు ఆయనతో "స్వామీ! నాకు ఎప్పట్నుంచో సందేహం పట్టిపీడిస్తోంది తమరు భాగవతోత్తములని చెప్పారు కదా అసలు భాగవతోత్తముడంటే ఎవరు? భాగవతోత్తముడి లక్షణాలు ఏవి? దయచేసి చెప్పు స్వామీ! అని ప్రార్థించగా, శ్రీనివాసుడు భాగవతుల లక్షణాలని ఇలా వివరించాడు.

## భాగవతోత్తములు

రామానుజా! భాగవతుల లక్షణాలు చాలా గొప్పవి. వారి ప్రభావాన్ని కోటి సంవత్సరాలైనా వర్ణించలేము. అయినా సంక్షిప్తంగా వారి గురించి చెబుతున్నా విను.

వర్ణినాం చ యతీనాం చ పరిచర్యాపరాశ్చ యే ।
పరనిందా మకర్వాణాస్తే వై భాగవతోత్తమాః ॥ 1

సర్వేషాం హితవాక్యాని యే వదంతి నరోత్తమాః ।
యే గుణగ్రాహిణో లోకే తే వై భాగవతోత్తమాః ॥ 2

ఆత్మవత్సర్వభూతాని యే పశ్యంతి నరోత్తమాః ।
తుల్యాః శత్రుషు మిత్రేషు తే వై భాగవతాః స్మృతాః ॥ 3

ధర్మశాస్త్ర ప్రవక్తారః సత్యవాక్య రతాశ్చ యే ।
తేషాం శుశ్రూషనో యే చ తే వై భాగవతోత్తమాః ॥ 4

వ్యాకుర్వంతి పురాణాని తాని శ్రుణ్వంతి యే తథా ।
తద్వక్తరి చ భక్తా యే తే వై భాగవతోత్తమాః ॥ 5

యే గోబ్రాహ్మణ శుశ్రూషాం కుర్వంతి సతతం నరాః ।
తీర్థయాత్రా పరా యే చ తే వై భాగవతోత్తమాః ॥ 6

అన్యేషాముదయం దృష్ట్వా యేఽభినందంతి మానవాః ।
హరినామపరా యే చ తేవై భాగవతోత్తమాః ॥ 7

ఆరామారోపణ రతా స్తరూక పరిరక్షికాః ।
కాసారకూపకర్తార స్తే వై భాగవతోత్తమాః ॥ 8

యే వై తటాక కర్తారో దేవ సద్మాని కుర్వతే ।
గాయత్రీ నిరతా యే చతే వై భాగవతోత్తమాః ॥ 9

యేఽభినందంతి నామాని హరేః శ్రుత్వాఽతి హర్షితాః ।
రోమాంచిత శరీరాశ్చ తే వై భాగవతోత్తమాః ॥ 10

తులసీ కాననం దృష్ట్వా యే నమస్కుర్వతే నరాః ।
తత్కాష్ఠాంకిత వర్ణా యే తే వై భాగవతోత్తమాః ॥ 11

తులసీ గంధమాఘ్రాయ సంతోషం కుర్వతో తు యే ।
తన్మూలముద్ధరా యేచ తే వైపై భాగవతోత్తమాః॥ 12

స్వాశ్రమాచార నిరతా స్తథైవాతిథి పూజకాః ।
యే చ వేదార్థ వక్తారస్తే వై భాగవతోత్తమాః ॥ 13

విదితాని చ శాస్త్రాణి పరార్థం ప్రవదంతియే ।
సర్వత్ర గుణభాజో యే తే వై భాగవతోత్తమాః ॥ 14

పానీయ దాననిరతా హ్యన్న దానరతాశ్చయే ।
ఏకాదశే వ్రతపరాస్తే వై భాగవతోత్తమాః ॥ 15

గోదాననిరతా యే చ కన్యాదాన రతాశ్చ యే ।
మదర్థం కర్మకర్తార స్తే వై భాగవతోత్తమాః ॥ 16

మన్మానసాశ్చ మద్భక్తా తే వై భాగవతోత్తమాః ।
మన్నామస్మరణాసక్తా స్తేవై భాగవతోత్తమాః ॥ 17

బహునాత్ర కిముక్తేన సంక్షేపాత్తేం బ్రవీమ్యహమ్ ।
సద్గుణాయ ప్రవర్తంతే తే వై భాగవతోత్తమాః ॥ 18

ఏతే భాగవతా విప్రాః కేచిదత్ర ప్రకీర్తితాః ।
మమాపి గదితుం శక్యా నాబ్ధికోటిశతైరపి ॥ 19

రామానుజ మహాభాగ మద్భక్తానాం చ లక్షణమ్ ।
మయి భక్తే త్వయి ప్రీత్యా యుక్తం కిల మహామతే ॥ 20

*(శ్లో॥44-63)*

బ్రహ్మచారులకు, సన్యాసులకు సేవ చేయువారు, ఇతరులను నిందింపనివారు భాగవతోత్తములు. అందరికి హితమగు మాటలు చెప్పువారు, ఇతరుల యందలి గుణములను గ్రహించువారు భాగవతోత్తములు. సమస్తజీవులను తనవలె చూచువారు. శత్రువులయందు, మిత్రులయందు సమానముగ వుండువారు భాగవతోత్తములు. ధర్మశాస్త్రమును చెప్పువారు ఎల్లప్పుడు సత్యమునే పలుకువారు, వారికి సేవచేయు వారు భాగవతోత్తములు. పురాణములను వ్యాఖ్యానించువారు, వాటిని వినువారు, పురాణములను చెప్పువాని యందు భక్తి కల్గినవారు భాగవతోత్తములు. ఆవులకు, బ్రాహ్మణులకు సేవచేయువారు, తీర్థయాత్రలు చేయువారు భాగవతోత్తములు.

ఇతరుల అభ్యుదయమును చూచి అభినందించువారు, హరినామమును స్మరించువారు భాగవతోత్తములు. తోటలను వేయువారు, తటాకములను రక్షించువారు, సరస్సులు, బావులు తవ్వించువారు భాగవతోత్తములు. చెరువులను తవ్వించువారు, దేవాలయములను నిర్మించువారు, గాయత్రీ మంత్రమును జపించువారు భాగవతోత్తములు, హరినామములను స్తుతించువారు, విని ఆనందించువారు, పులకించువారు భాగవతోత్తములు తులసివనమును చూచి నమస్కరించువారు, దానిచే ముద్రలను వేయించుకొనువారు భాగవతోత్తములు. తమ ఆశ్రమ ధర్మములను పాటించువారు, అతిథులను పూజించువారు, వేదము యొక్క అర్థమును వివరించువారు భాగవతోత్తములు. తులసీ గంధమును ఆఘ్రాణించి ఆనందమును పొందువారు, దాని మూలను ఉద్ధరించువారు భాగవతోత్తములు. తెలిసికొన్నటువంటి శాస్త్రముల అర్థమును ఇతరులకు చెప్పువారు, ఎల్లప్పుడు గుణములు కలిగి ఉండువారు భాగవతోత్తములు. జలదానము చేయువారు, అన్నదానము చేయువారు, ఏకాదశ వ్రతమును పాటించువారు భాగవతోత్తములు.

గోదానమిచ్చువారు, కన్యాదానమిచ్చువారు, నా కొరకు కర్మచేయువారు భాగవతోత్తములు. నాయందు మనస్సు నిలుపువారు, నా భక్తులగువారు, నా నామమును స్మరించుటయందు ఆసక్తిగలవారు భాగవతోత్తములు. ఇన్ని చెప్పుట ఏల. సంక్షేపముగా చెప్పెదను వినుము. సద్గుణములు కలవారందరును భాగవతోత్తములు. ఇపుడు చెప్పినవారు భాగవతోత్తములలో కొందరు మాత్రమే. వారందరిని గూర్చి చెప్పుట కోటి సంవత్సరములలో నాకైనను శక్యము కాదు. మహానుభావుడైన ఓ రామానుజా! నా భక్తుల లక్షణాలని, నా మీద భక్తిగల నీకు ప్రీతితో చెప్పాను.

నీ కోరిక ప్రకారం భాగవతుల గుణగణాలు తెలిపాను. నీవు కూడా పరమభాగవతోత్తముడిగా మారి, నీ జీవితాన్ని చరితార్థం చేసుకుని తరించు. నీకు వైకుంఠ ప్రాప్తి కలుగుగాక! "అని ఆశీర్వదించి శ్రీనివాసుడు

అంతర్థానమయ్యాడు. రామానుజుడు శ్రీనివాసుడి ఆజ్ఞననుసరించి ఆకాశగంగ తీర్థం దగ్గరే నివసించి, వైష్ణవ ధర్మాన్ని పాటించి చివరికి మోక్షాన్ని పొందాడు.

## పద్మనాభుడి వృత్తాంతం

పూర్వం పద్మనాభుడనే శ్రీవత్సగోత్రానికి చెందిన విప్రుడు ఎంతో నియమంగా, శిష్టాచారాల్ని పాటించేవాడు, ఆ విప్రుడు వేంకటాద్రిమీదున్న చక్రతీర్థం దగ్గర శ్రీహరి గురించి తపస్సు చేసాడు. లభించిన ఆహారాన్నే తింటూ సత్యం, దయ వంటి సద్గుణాలతో ఇంద్రియాల్ని జయించి అన్ని కాలాల్లో శీతోష్ణాల్ని, వర్షాన్ని సహిస్తూ తన తపస్సు కొనసాగించాడు.

పద్మనాభుడు చేసిన తపస్సుకి సంతోషించిన శ్రీనివాసుడు శంఖ చక్ర గదాయుధాల్ని ధరించి ప్రత్యక్షమయ్యాడు. దివ్య సుందరుడై కోటి సూర్యుల కాంతితో తన ముందు నిలిచిన శ్రీనివాసుణ్ణి చూసి పులకించిపోయి ఇలా స్తుతించటం ప్రారంభించాడు.

## శ్రీ వేంకటేశ స్తుతి

నమస్త్రై లోక్యనాథాయ విశ్వరూపాయ సాక్షిణే ।
శివబ్రహ్మాది వంద్యాయ శ్రీనివాసాయ తే నమః ॥ 1

నమః కమల నేత్రాయ క్షీరాబ్ధిశయనాయ తే ।
దుష్టరాక్షససంహర్త్రే శ్రీనివాసాయ తే నమః ॥ 2

భక్త ప్రియాయ దేవాయ దేవానాం పతయే నమః ।
ప్రణతార్తి వినాశాయ శ్రీనివాసాయ తే నమః ॥ 3

యోగినాం పతయే నిత్యం వేద వేద్యాయ విష్ణవే ।
భక్తానాం పాప సంహర్త్రే శ్రీనివాసాయ తే నమః ॥ 4

*(శ్లో॥14-18,అధ్యా-23)*

దేవాధిదేవా, వేంకటేశా, శార్ఙ్గము ను ధరించువాడా, నారాయణాద్రిపై నివసించువాడా, శ్రీనివాసా నీకు నమస్కారం. కల్మషమును నశింపచేయువాడా, వాసుదేవా, విష్ణుమూర్తీ, శేషాచలముపై నివసించువాడా, శ్రీనివాసా నీకు నమస్కారం.

త్రిలోకములకు నాథుడైనవాడా, విశ్వరూపుడా, అన్ని కర్మలకు సాక్షి అయినవాడా, శివుడు, బ్రహ్మ మొదలగు వారిచే నమస్కరించబడేవాడా నీకు నమస్కారం. కమలము వంటి నేత్రములు కలవాడా, పాలసముద్రముపై నిదురించువాడా, దుష్టరాక్షసులను సంహరించువాడా, శ్రీనివాసా నీకు నమస్కారం. భక్తులకు ఇష్టుడైనవాడా, దేవదేవుడా నీకు నమస్సులు. నమస్కరించినవారి దుఃఖమును పోగొట్టువాడా, శ్రీనివాసా నీకు నమస్కారం. యోగులకు గతి అయినవాడా, నిత్యము వేదముల ద్వారా తెలియువాడా, విష్ణుమూర్తీ, భక్తుల పాపములను సంహరించువాడా శ్రీనివాసా నీకు నమస్కారం.

ఈ విధంగా పద్మనాభుడి చేత స్తుతించబడ్డ శ్రీనివాసుడు పద్మనాభుడితో ఇలా అన్నాడు. "భక్తా! ఈ కల్పాంత వరకూ ఈ చక్రతీర్థంలోనే నివసిస్తూ నన్ను సేవించు. నీకు కైవల్యం లభిస్తుంది" అని ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు. శ్రీనివాసుడి ఆజ్ఞప్రకారం పద్మనాభుడు ఆ తీర్థం దగ్గరే నివసించసాగాడు.

కొంతకాలం తరువాత భయంకరమైన ఒక రాక్షసుడు తీవ్రమైన ఆకలితో చక్రతీర్థం దగ్గరున్న పద్మనాభుడి దగ్గరకొచ్చాడు. తనకి తగిన ఆహారం లభించిందని ఆనందించి అతన్ని గట్టిగా పట్టుకున్నాడు. రాక్షసుడు పట్టుకోగానే పద్మనాభుడికి భయంవేసింది. ఆపద మొక్కుల వాడైన శ్రీనివాసుణ్ణి రక్షించమని దీనంగా ప్రార్థించాడు.

నారాయణా! చక్రపాణీ! వెంకటేశ్వరా! దయాసముద్రా! శరణన్న వారిని రక్షించేవాడా! పురుష వ్యాఘ్రా! నన్ను రక్షించు. లక్ష్మీకాంతా! గరుడధ్వజా! శ్రీహరీ! పూర్వం మొసలి గజేంద్రుణ్ణి పట్టుకున్నట్టు ఈ రాక్షసుడు నన్ను పట్టుకున్నాడు. వాడి పీడ వదిలించి నన్ను రక్షించు! అని దీనంగా విలపించాడు.

పద్మనాభుడి ఆర్తనాదం విని అతన్ని రక్షించటానికి శ్రీహరి తన చక్రాయుధాన్ని పంపించాడు. స్వామి పంపిన ఆ చక్రాయుధం వేల సూర్యుల కాంతితో ప్రకాశిస్తూ చక్రతీర్థం వైపు దూసుకువచ్చింది. మహోజ్జ్వలంగా వెలిగిపోతున్న ఆ చక్రాన్ని చూసి భయపడ్డ రాక్షసుడు పద్మనాభుణ్ణి వదిలి

వెంటనే పారిపోయాడు. అయితే ఆ చక్రం వాణ్ణి వదిలిపెట్టలేదు. వెంటబడి తరిమి తరిమి చివరికతణ్ణి సంహరించింది. అలా ఆ రాక్షసుడు చక్రాయుధం దెబ్బకి ప్రాణాలు కోల్పోవటంతో, పద్మనాభుడికి భయం తగ్గిపోయి, ఇంతటి ఘనకార్యం చేసి తన ప్రాణాలు కాపాడిన సుదర్శన చక్రాన్ని ఇలా స్తుతించాడు.

## సుదర్శన చక్ర స్తుతి

విష్ణుచక్ర నమస్తేస్తు విశ్వరక్షణ దీక్షిత ।
నారాయణ కరాంభోజ భూషణాయ నమోஉస్తు తే ॥ 1

యుద్ధేష్వసుర సంహారకుశలాయ మహారవ ।
సుదర్శన నమస్తుభ్యం భక్తానామార్తినాశన ॥ 2

రక్ష మాం భయసంవిగ్నం సర్వస్మాదపి కల్మషాత్ ।
స్వామిన్సుదర్శన విభో చక్ర తీర్థే సదా భవన్ ॥ 3

సన్నిధేహి హితాయ త్వం జగతో ముక్తికాంక్షిణః ।
బ్రాహ్మణేనైవముక్తం తద్విష్ణుచక్రం మునీశ్వరాః ॥ 4

*(శ్లో॥37-40,అధ్యా-23)*

పద్మనాభుడి సహృదయతకి మెచ్చుకున్న సుదర్శనుడు (చక్రం) అతడితో ఇలా అన్నాడు. "పద్మనాభా! నీవు నివసించే ఈ చక్రతీర్థం మహాపుణ్యప్రదమైనది. అత్యుత్తమమైనది. లోకాలన్నిటికీ హితాన్ని చేకూర్చటం కోసం నేనిక్కడ నివసిస్తాను. శ్రీహరి పంపగా నేను నిన్ను రక్షించటానికొచ్చాను. నీ కోరిక మేరకు నేనిక్కడ రక్షణగా ఉంటాను. ఇకపై నీకు గానీ వేరేవారికి గానీ రాక్షసుల పీడ ఉండదు. ఈ చక్రతీర్థంలో స్నాన చేసినవారు, వారి పూర్వీకులతో సహా అందరూ తరిస్తారు" అని చెప్పి సుదర్శనుడు జ్యోతిరూపంగా మారి చక్రతీర్థంలోకి ప్రవేశించాడు.

పరమ పవిత్రమైన చక్రతీర్థంలాంటి దివ్యతీర్థం మరొకటిలేదు. ఇకపై ఉండబోదు. ఈ వృత్తాంతాన్ని చదివిన వారికీ విన్నవారికీ కూడా చక్రతీర్థ జలాల్లో స్నానం చేసినంత పుణ్యఫలం లభిస్తుంది.

## పురాణ శ్రవణం - పౌరాణికుడు

* పురాణాన్ని చెప్పేవాడు చిన్నవాడైనప్పటికీ, యువకుడైనప్పటికీ, వృద్ధుడైనప్పటికీ అతన్ని శ్రద్ధగా గౌరవించాలి.
* పురాణవేత్తని ఎప్పుడూ తక్కువగా చూడకూడదు.
* జీవుడికి ముక్తినిచ్చే పురాణం వారికి పరమ గురువులాంటిది.
* పౌరాణికుడు వ్యాసపీఠం మీద కూర్చుని ప్రవచనం చేస్తున్నప్పుడు ఎవరూ నమస్కరించకూడదు.
* పురాణాన్ని పవిత్రమైన దేవాలయాలు, నదీతీరాల్లో చెప్పించుకోవాలి.
* పురాణాన్ని వినే శ్రోతలు భక్తి శ్రద్ధలతో ఏకాగ్రంగా మనసుని లగ్నంచేసి పురాణ శ్రవణం చేయాలి.
* భక్తి శ్రద్ధలు లేకుండా పురాణ శ్రవణాన్ని కేవలం కాలక్షేపం కోసం వినేవారికి ఎలాంటి ఫలితం దక్కదు.
* పురాణకథని వింటూ మధ్యలో లేచి వెళ్ళిపోయేవారికి భార్య సంపదలు నష్టమవుతాయి.
* పురాణాన్ని తాంబూలం తింటూ విన్నవాడు నరకానికి వెళతాడు.
* తుంగచాప మీద కూర్చుని పురాణం వినేవాడు కాకిగా పుడతాడు.
* పురాణం చెప్పే ముందు పౌరాణికుడికి నమస్కరించకుండా పురాణాన్ని వినేవాడు విషవృక్షంగా జన్మిస్తాడు.
* పడుకొని పురాణాన్ని వినేవాడు కొండచిలువగా జన్మిస్తాడు.
* పౌరాణికుడితో సమానంగా ఆసనం మీద కూర్చుని పురాణం వినేవాడు ఘోరమైన నరకానికి వెళతాడు.
* పౌరాణికుణ్ణి నిందించేవాడు, పురాణ కథల్ని దూషించేవాడు వంద జన్మల వరకూ కుక్కగానే జన్మిస్తారు.
* ఎప్పుడూ పురాణ కథల్ని వినని వారు ఎన్నోనరకాలు అనుభవించి పందులుగా జన్మిస్తారు.

* పురాణ కథలు చెప్పేవారికి, వినేవారికి, చదివేవారికి విఘ్నాలు కలిగించేవారు కోటి సంవత్సరాలు నరకబాధలనుభవించి ఊరపందులుగా పుడతారు.
* పురాణ కథల్ని వినలేకపోయినప్పటికీ అని చెప్పటానికి సహాయ సహకారాలందించే వారు శాశ్వతమైన ముక్తిని పొందుతారు.
* పురాణాల్ని రసరంజకంగా ప్రవచనం చేసేవారు వందకోట్ల కల్పాలవరకూ బ్రహ్మలోకంలో నివసిస్తారు.
* పురాణం చెప్పే పౌరాణికుడికి కంబళిగానీ, ఆసనంగానీ, వస్త్రాల్ని గానీ ఏర్పాటుచేసేవారు స్వర్గలోకంలో సుఖభోగాలనుభవించి చివరికి ముక్తిని పొందుతారు.
* పౌరాణికుడికి శ్రేష్ఠమైన కొత్తసూత్రాన్ని (బంగారు గొలుసు)ఇచ్చేవారు ప్రతిజన్మలో ధనవంతులుగా పుడతారు
* మహాపాతకాలు ఉపపాతకాలు ఆచరించినవారు పురాణ శ్రవణం వల్ల తమ పాపాలు పోగొట్టుకుంటారు.

## శ్రీ వేంకటేశ్వర వైభవం

పూర్వం భరద్వాజ మహర్షి తీర్థయాత్ర చేస్తూ తన ఆశ్రమానికి వచ్చిన అర్జునుడికి, వేంకటాచలం మీద వెలిసిన వేంకటేశ్వరుడి వైభవాన్ని ఇలా వివరించి చెప్పాడు.

అర్జునా! అన్ని జీవుల్లో ఆద్యుడు శ్రీమన్నారాయణుడే. ఆయనే విశ్వానికి ప్రభువు. ఈ ప్రపంచమంతా నిండినవాడు, ప్రపంచాన్ని సృష్టించినవాడు, ఎలాంటి దుఃఖాలూ అంటనివాడు, వేయి తలలు కలిగినవాడు, వేయి కళ్ళతో, వేయి పాదాలతో వెలుగొందేవాడు. ఈ సృష్టి మొత్తం ఆయన తేజస్సుతోనే ప్రకాశిస్తోంది. ఆయనకన్నా గొప్ప జ్ఞానం కానీ మరొకటి లేదు. ఆయనకన్నా గొప్ప విద్యలేదు. సృష్టిలో ఉన్న అన్నిరకాల జీవులకీ ఆయన చాలా సన్నిహితంగా ఉంటాడు. సృష్టిలో ఉన్న సకల భూతాలూ ఆయనలోనే ఉన్నాయి.

వేంకటేశ్వరుడే యజ్ఞం, స్రుక్కు, స్రువం. ఆయనే యజ్ఞఫలం. ఆయనే అందరూ చేరుకోవాల్సిన పరమగతి. అల్పులైన మానవులు స్వామిని శరణు వేడుకుంటే చాలు ఆయన కరుణిస్తాడు. కర్మ బంధాలనే పశువుల్ని తెచ్చి జ్ఞానం అనే అగ్నిలో వేసి హోమం చేస్తే, స్వామి సాయుజ్యం లభిస్తుంది. హరి, ఈశ్వరుడు, బ్రహ్మ, ఇంద్రుడు – ఇవన్నీ శ్రీనివాసుడి పర్యాయపదాలే. వేంకటేశ్వరుడి గురించి సంపూర్ణంగా తెలుసుకుని, ఆయన మాహాత్మ్యాన్ని గ్రహించినవారికి పునర్జన్మ కలగదు.

నిత్యుడు, ఆనందమయుడు, సర్వకర్మలకి సాక్షి, నిర్గుణుడు, ఉపాధి లేనివాడు, పవిత్రుల్లో పవిత్రుడు, గతిలేని వారికి గతిగా ఉన్నవాడు, దేవతలకు కూడా దేవత వేంకటేశ్వర స్వామి మాత్రమే. వెలుగులన్నీ సృష్టించే గొప్ప వెలుగు, తపస్సుల్లో గొప్ప తపస్సు, జీవులన్నిటికీ ఆధారం ఆ శ్రీనివాసుడే. ఆయన గురించి సంపూర్ణంగా తెలుసుకోవటం ఆ బ్రహ్మకి కూడా సాధ్యంకాదు. సాక్షాత్తు ఆ బ్రహ్మే స్వామి నుంచి పుట్టాడు.

తస్యస్వరూపం మునయో మృగయంతే సమాహితాః ।<br>
సంకర్షణో వాసుదేవః సర్వజ్ఞో గరుడ ధ్వజః ।<br>
అనిరుద్ధ ఇతిఖ్యాతం తన్మూర్తీనాం చతుష్టయం ॥ *(శ్లో॥44,అధ్యా-35)*

స్వామి స్వరూపాన్ని సంపూర్ణంగా అధ్యయనం చేసుకోవాలని మునులు ఎప్పుడూ ప్రయత్నిస్తుంటారు. సంకర్షణుడు, వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే నాలుగు రూపాల్ని స్వామి కలిగివుంటాడు. ఓంకార స్వరూపం కూడా ఆయనే. శ్రీనివాసుడి దివ్యతత్వాన్ని తెలియచేసేది అతడి వాసుదేవ మంత్రమే. మంత్రాలలో ఉత్తమమైన ఈ దివ్య మంత్రాన్ని ఎవరైతే నిశ్చలమైన మనసుతో జపిస్తారో వారికి స్వామి సకల సిద్ధుల్ని ప్రసాదిస్తాడు.

## వేంకటాచల మాహాత్మ్యం

వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండే నాస్తికించన ।<br>
వేంకటేశ సమోదేవో నభూతో న భవిష్యతి ॥

వేంకటాద్రి సమం స్థానం న భూతం న భవిష్యతి ।
స్వామితీర్థ పరస్తుల్యం న కుత్రాపి చ విద్యతే ॥

*(శ్లో॥ 71-72,అధ్యా-38)*

ఈ బ్రహ్మాండంలో వేంకటాద్రితో సమానమైన స్థానం వేంకటేశ్వరుడితో సమానమైన దైవం మరొకరు లేరు. ఇకపై ఉండబోదు. అలాగే వేంకటాచలంతో సమానమైన పర్వతం ఇంతకుముందు లేదు, ఇకపై ఉండదు. అలాగే వేంకటాద్రి మీద ఉన్న స్వామి పుష్కరిణితో సమానమైన పుష్కరిణి కూడా మరొకటి లేదు.

ప్రాతరుత్థాయ యే నిత్యం వేంకటేశం స్మరంతివై ।
తేషాం కరస్థామోక్షశ్రీ ర్నాత్ర కార్యా విచారణా ॥

ప్రాతఃకాలంలోనే నిద్రలేచి ప్రతిరోజూ శ్రీవేంకటేశ్వర స్వామిని ఎవరైతే స్మరిస్తారో, వారికి మోక్షం అనేది అరచేతిలో ఉంటుంది. వేంకటాద్రి చేరి స్వామి పుష్కరిణిలో స్నానంచేసి, నియమంగా శ్రీనివాసుడి దర్శనం చేసుకున్న వారికి వేయి అశ్వమేధాలు, వందవాజపేయ యాగాలు చేసిన ఫలితం లభిస్తుంది.

## పురుషోత్తమ క్షేత్రం

భూలోకంలో శ్రీమన్నారాయణుడు అవతరించిన వైష్ణవక్షేత్రాల్లో ప్రముఖమైనది పురుషోత్తమ క్షేత్రం. ఈ క్షేత్రంలో నివసించినవారికి ఇక్కడి స్వామిని దర్శించిన వారికి సకల పాపాలూ నశిస్తాయి. ఇది పది యోజనాల దూరం వ్యాపించింది. ఇసుకతో కూడుకున్నది. ఈ క్షేత్రం మధ్యభాగంలో నీలాచలం వున్నది. దూరం నుంచి చూసే వారికి ఇది ఒక స్తనంలాగా కనిపిస్తుంది.

పూర్వం వరాహ రూపంలో భూమిని ఉద్ధరించిన స్వామి భూమిమీద పర్వతాలన్నిటినీ సరిచేసాడు. అలా సంపూర్ణమైన రూపాన్ని సంతరించుకున్న భూమి మీద, తన సృష్టిని కొనసాగించాలనుకున్నాడు బ్రహ్మదేవుడు. అందుకు తగిన శక్తి కలగటం కోసం జగన్నాథుడైన నారాయణుణ్ణి స్తుతించాడు.

జగత్తునకు ఆధారమైనవాడా, శంఖమును, చక్రమును, గదను ధరించువాడా నీకు నమస్కారం. నీ నాభినుంచి పుట్టిన పద్మము నందు

ఈ విశ్వాన్ని సృష్టించటం కోసం నేను పుట్టాను. నీ పరమార్థ స్వరూపాన్ని నీవు మాత్రమే తెలుసుకోగలవు. నీ మాయ చేతనే ఈ జగత్తు మొత్తం నిర్మించబడింది. నీ నిఃశ్వాసం నుంచి వెలువడ్డ శబ్ద బ్రహ్మం మూడుగా విభజించబడింది. దాన్ని ఆధారంగా చేసుకొని, నేను ముల్లోకాలను సృష్టించాను. నీకంటే స్థూలమైనది, సూక్ష్మమైనది, దీర్ఘమైనది, హ్రస్వమైనది మరొకటి లేదు. బంగారము, కటకము మొదలైన రూపాల్ని పొందినట్టే గుణత్రయం యొక్క విభాగాలను, వికారభేదాలను పొంది, నీవే చరాచరాలుగా అవుతున్నావు.

సృష్టించేవాడివి, సృష్టించబడేది నీవే, పోషించేవాడివి, పోషించబడేది నీవే, ఆధారము, భరించబడేది నీవే. నీవు ప్రేరేపించుటచేతనే సమస్తమైన శుభాశుభాలు కలుగుతున్నాయి. అందరూ నీవు నిర్ణయించిన విధంగా తగిన గతిని పొందుతున్నారు. ఈ జగత్తునకు గతివి, భర్తవు, సాక్షివి నీవే! ఓ పరమేశ్వరా! చరాచరములకు గురువగు వాడా, అన్ని జీవములపై కృపను చూపువాడా! ఓ జగన్నాథా! నీ పాదములవద్ద నాకు ఎప్పుడూ ఆశ్రయాన్ని కల్పించు.

ఈ విధంగా బ్రహ్మచేత స్తుతించబడ్డ నారాయణుడు గరుడధ్వజుడై, శంఖ, చక్ర, గదాయుధాల్ని ధరించి బ్రహ్మముందు ప్రత్యక్షమయ్యాడు. బ్రహ్మతో "పితామహా! నీవు మరణాన్ని పొందే జీవుల్ని సృష్టించాలని భావించి నన్ను ప్రార్థించావు. అవిద్యతో నిండినవారు ఎలా సమర్థులవుతారు. బ్రహ్మా! సముద్రానికి ఉత్తరతీరంలో మహానదికి దక్షిణ భాగంలో ఒక దివ్యమైన ప్రదేశం ఉంది. ఆ ప్రదేశంలో నివసించేవారు పూర్వజన్మ పుణ్యఫలాన్ని పొందుతున్నారు. ఆ సముద్ర తీరంలో నీల పర్వతం ఉంది. ఆ పర్వతం మీదే నా రహస్యమైన స్థానం ఉంది. దాన్ని తెలుసుకోవటం నీకు కూడా సాధ్యంకాదు. నేనక్కడ స్వయంగా నివసిస్తున్నాను. ఆ క్షేత్రంలో నాశనం అనేది లేక పోవటం వల్ల అది పురుషోత్తమ క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. ఆ దివ్యక్షేత్రం సృష్టి- లయాలకి అతీతమైనది. బ్రహ్మా! ఇప్పుడిక్కడ నన్నేవిధంగా శంఖచక్రాలతో దర్శిస్తున్నావో అదే విధంగా ఆ క్షేత్రంలో కూడా నన్నిలాగే చూడగలవు.

నీలాచలం మధ్యభాగంలో ఒక కల్పవృక్షం ఉంటుంది. దానికి పడమర భాగంలో రౌహిణం అనే కుండం కనిపిస్తుంది. దాని తీరంలోనే నేను నివసిస్తున్నాను. అక్కడ కొలువైవున్న నన్ను ఆ తీర్థంలో స్నానం చేసి దర్శించినవారు సకల పాపాలూ నశించి నా సాయుజ్యాన్ని పొందుతారు. కనుక బ్రహ్మదేవా! నన్ను ధ్యానిస్తూ నీవు ఆ దివ్యక్షేత్రానికి వెళ్ళి నివసించు. అప్పుడే నీకా పురుషోత్తమక్షేత్ర మహిమ సంపూర్ణంగా అవగతమవుతుంది.

వేదాల చేతా, పురాణాల చేతా, స్మృతుల చేతా, ఇతిహాసాల చేతా, తెలియబడని నా ద్వివ్య స్వరూపం, కేవలం నన్ను స్తుతించటం వల్ల ఆ దివ్య క్షేత్రంలో నీకు తెలుస్తుంది. వ్రతాలు, తీర్థాలు, యజ్ఞాలు, దానాలు చేయటం ద్వారా ఎలాంటి ఫలితం వస్తుందో, అదే పుణ్యఫలం పురుషోత్తమ క్షేత్రంలో కేవలం ఒక్కరోజు నివసిస్తే వస్తుంది" అని నారాయణుడు బ్రహ్మకి చెప్పి అదృశ్యమయ్యాడు.

శ్రీహరి ఆదేశం ప్రకారం బ్రహ్మదేవుడు పురుషోత్తమ క్షేత్రానికి వెళ్ళి శ్రీహరి చెప్పి ప్రదేశాన్ని చూసాడు. అక్కడ సరిగ్గా స్వామి తాను పూర్వం చూసిన విధంగానే చతుర్భుజుడై కనిపించాడు. పురుషోత్తమ దర్శనంతో ఆనంద తన్మయంలో మునిగిపోయాడు బ్రహ్మ. అంతలో అక్కడికి ఒక కాకి వచ్చింది. బ్రహ్మ చూస్తుండగానే రౌహిణికుండంలో మునిగి స్నానంచేసి, తీరంలో ఉన్న స్వామిని దర్శించుకుంది. కొద్ది క్షణాల్లోనే ఆ కాకి శరీరం వదిలేసింది. ఆశ్చర్యంగా అది ప్రాణాలు కోల్పోయిన వెంటనే చతుర్భుజుడైన పురుషోత్తముడు దాని ఎదురుగా నిలిచాడు.

ఆ దృశ్యాన్ని చూసిన బ్రహ్మకి చాలా దిగులు కలిగింది. ఇకపై తన సృష్టి కొనసాగటం చాలా కష్టమని తెలిసింది. ఈ క్షేత్రంలో విష్ణు భక్తులకి దుర్లభమైనది ఏదీ లేదని గ్రహించాడు. ఈ పురుషోత్తమ క్షేత్రంలో శ్రీహరి నామం జపిస్తూ ప్రాణాలు విడిస్తే వెంటనే ఆయన ప్రత్యక్షమవుతున్నాడు. ఇది సామాన్యమైన క్షేత్రం కాదు. కాకి కూడా స్వామి ప్రత్యక్ష దర్శనాన్ని పొంద గలిగిందంటే దీని మాహాత్మ్యం ఎంత గొప్పదో కదా!" అని భావించాడు.

ఇదిలా ఉండగా యమధర్మరాజు మరణించిన కాకి ప్రాణాలు తీసుకుపోవటానికి పరుగున అక్కడికి వచ్చాడు. అక్కడ కాకికి అడ్డుగా పురుషోత్తముడు చతుర్భుజుడై కనిపించాడు. యముడు స్వామికి నమస్కరించి తన అధికారాన్ని స్థిరంగా ఉంచుకోవటం కోసం పురుషోత్తముణ్ణి ఘనంగా కీర్తించాడు. యముడు చేసిన స్తుతికి ఎంతో సంతోషించిన స్వామి యముడి ప్రార్థనకి తగిన సమాధానం చెప్పమని లక్ష్మీదేవిని ఆదేశించాడు. స్వామి ఆజ్ఞ పొందిన లక్ష్మీదేవి సకలలోకాలకీ శుభాన్ని కలిగించటం కోసం యముడితో ఇలా అన్నది.

సమవర్తీ! నీ అధికారం ఈ క్షేత్రంలో చెల్లదు. ఎందుకంటే మేమిద్దరం ఈ క్షేత్రాన్ని విడిచి ఉండము. ఈ కల్పాంతం వరకూ మాకిదే నివాస స్థానం. బ్రహ్మ! నీవే కాదు, ఇంకా ఇతర దిక్పాలకుల అధికారం కూడా ఇక్కడ చెల్లదు. మానవుల కర్మఫలితాలు ఈ క్షేత్రంలో అనుభవించబడవు. ఇక్కడ జీవించే మానవులైనా, ఇతర జీవులైనా, ఎన్ని పాపాలు చేసినప్పటికీ అవన్నీ క్షణాల్లో దహించుకుపోతాయి. నీకు పాప పుణ్యాల్ని విచారించే అధికారాన్ని ఇచ్చాము. అయితే ఇక్కడ ఇంద్రనీల మణిలాగా దర్శనమిచ్చే స్వామిని సేవించిన వారికి కర్మబంధాల నుంచి విముక్తి లభిస్తుంది కనుక, నీ అధికారం ఇతర ప్రాంతాల్లో జీవించే ప్రాణులుమీదే తప్ప, ఇక్కడ జీవించేవారి మీద ప్రభావం చూపదు.

ఓ వైవస్వతుడా! ఇక్కడ మరణించే పశుపక్ష్యాదులకి కూడా ముక్తి లభిస్తుంది. ఇక్కడ జీవన్ముక్తులైన వారు మాత్రమే నివసిస్తారు. ఇక నీ అధికారానికి లోబడి ఇక్కడి జీవులు ఉండరు. కనుక నీ ప్రయత్నాన్ని మానుకో" అని ఉద్బోధించింది.

లక్ష్మీదేవి మాటలు విని ఆశ్చర్యపోయిన యముడు "అమ్మా! నీవు చెప్పిన విషయం నేనింతవరకూ వినలేదు. ఇంతగొప్ప రహస్యాన్ని నేనెలా తెలుసుకోగలను. పురుషోత్తముడి తత్త్వాన్ని వేదాలు, బ్రహ్మదేవుడు కూడా తెలుసుకోలేరు కదా! ఇక అల్పుణ్ణైన నావల్ల ఏమవుతుంది. నీవల్ల నాకీ దివ్యక్షేత్రం

ముక్తి క్షేత్రమన్న విషయం తెలిసింది. తల్లీ! వాసుదేవుడు మిగతా అన్ని చోట్లా బంధాలు కల్పిస్తూ ఇక్కడ మాత్రమే జీవులకి ముక్తిని ప్రసాదిస్తున్నాడు. నన్ను, సకల దేవతల్ని దిక్పాలకుల్ని సృష్టించాడు. నా అపరాధాన్ని మన్నించు. నాకిక్కడ పనిలేదని గ్రహించాను" అని లక్ష్మీదేవికి విన్నవించి వెనుదిరిగిపోయాడు.

## వైష్ణవులు

★ శ్రీ మహావిష్ణువు మీద అచంచలమైన భక్తి ప్రపత్తి శరణాగతిని చూపే వారే వైష్ణవులు. అలాంటి విష్ణు భక్తులకీ – విష్ణువుకి ఎలాంటి భేదం వుండదు. విష్ణు భక్తులైన వైష్ణవుల లక్షణాలు ఈ విధంగా ఉంటాయి. ఉండాలి.

★ ప్రశాంతచిత్తులు, ఇంద్రియనిగ్రహం కలిగినవారు, సౌమ్యులు, ఇతరులకి ఎలాంటి దోషం తలపెట్టనివారు వైష్ణవులు.

★ దయతో నిండిన హృదయం కలిగినవారు, హింసచేయనివారు, ఇతరుల గుణాల్ని ప్రశంసించేవారు వైష్ణవులు.

★ సదాచార సంపన్నులు, దానగుణం కలిగినవారు, మాత్సర్యబుద్ధిలేనివారు, నిష్కపటులు, హరి సంకీర్తనా ప్రియులు వైష్ణవులు.

★ ఎప్పుడూ దీనుల మీద జాలి చూపించేవారు, ఇతరులకి వీలైనంత సాయం చేసేవారు, బాహ్యవిషయాలపై శ్రద్ధలేనివారు, విష్ణు భక్తుల్ని సేవించేవారు.

★ విష్ణువుకన్నా వేరొకర్ని చూడరు. విష్ణువుకన్నా వేరైనది చూడరు.

★ ఇతరులకి అవమానం జరిగినప్పుడు జాలి చూపేవారు వైష్ణవులు.

★ రాయిమీద, ఇతరుల ధనం మీద, మట్టిగడ్డమీద ఇతర స్త్రీల మీద, శత్రువుల మీద, బంధువులమీద సమానమైన భావం కలిగిన వారే వైష్ణవులు

★ ఇతరుల రహస్యాల్ని దాచేవారు, గుణాల్ని ప్రేమించేవారు, స్వామి మీదే మనసు నిలిపేవారు వైష్ణవులు.

★ ప్రియమైన మాటలు చెప్పేవారు, శ్రీహరి శుభనామాన్నే నిరంతరం తలచేవారు, స్వామికి జయజయ ధ్వానాలు చేసేవారు వైష్ణవులు.

★ స్వామి చరణ కమలాల మీదే దృష్టి నిలిపి సుఖదుఃఖాలని సమానంగా చూస్తూ, వినయంగా మాట్లాడేవారు వైష్ణవులు

★ స్వామిని ఉత్తమమైన గంధంతో, తులసీ దళాలతో అర్చించి, ఎలాంటి అహంకారం లేకుండా ప్రశాంతమైన మనసుతో సంచరించేవారు వైష్ణవులు

## కార్తీకమాసం దీపారాధన మాహాత్మ్యం

★ కార్తీకమాసంలో శివాలయ గోపురంలో, ద్వారం దగ్గర, శిఖరం మీద, శివలింగం సన్నిధిలో దీపారాధన చేస్తే సకల పాపాలూ తొలగిపోతాయి.

★ ఎవరైతే కార్తీక మాసంలో ఆవునేతితో గానీ, నువ్వుల నూనెతో గానీ, విప్పనూనెతో గానీ, నారింజనూనెతో గానీ శివాలయంలో భక్తిగా దీపారాధన చేస్తారో వారు సంపూర్ణ శివానుగ్రహాన్ని పొందుతారు.

★ కేవలం ఆముదంతో కార్తీక దీపాన్ని వెలిగించినా అఖండమైన పుణ్యం లభిస్తుంది.

★ కార్తీక మాసంలో యోగ్యుడైన విప్రుడికి దక్షిణతో సహా దీపదానం చేస్తే కైలాస ప్రాప్తి కలుగుతుంది.

## కార్తీకమాసం వనభోజనం

కార్తీకమాసంలో చేసే వనభోజనం చాలా విశేషమైన ఫలితాన్నిస్తుంది. ఇతర సమయాల్లో భోజనం చేసేడప్పుడు, హోమాలు, పూజలు చేసినప్పుడు, తర్పణాలు చేసేడప్పుడు, చండాలుర, పాపాత్ముల దుష్టసంభాషణలు వినేడప్పుడు కలిగిన దోషాలని పోగొట్టుకోవాలంటే వనభోజనం చేసి తీరాలి.

ఈ కార్తీక వనభోజనాన్ని ఏ విధంగా చేయాలంటే – ఎన్నో రకాల వృక్షాలతో వున్న వనంలోకి వెళ్ళాలి. అక్కడ ఉసిరి చెట్టు తప్పకుండా ఉండాలి. ఆ ఉసిరి చెట్టు క్రింద సాలగ్రామాన్ని ఉంచి గంధపుష్పాక్షతలతో యథావిధిగా పూజించాలి. ఆ తరువాత శక్తికొద్దీ విప్రుల్ని దక్షిణ తాంబూలాలతో తగిన విధంగా సత్కరించి, వారందరితో కలిసి భోజనం చేయాలి.

ఈ విధంగా శాస్త్ర బద్ధంగా కార్తీకమాస వనభోజనాన్ని చేస్తే సకల పాపాలూ నశించి విష్ణులోక ప్రాప్తి కలుగుతుంది.

## కార్తీకమాసం - గీతాపారాయణం

★ కార్తీకమాసంలో శ్రీహరి సన్నిధిలో భగవద్గీతని పారాయణ చేస్తే అనంతమైన పుణ్యం కలుగుతుంది.

★ కార్తీకమాసంలో తులసీదళాలతో తెల్లని, ఎర్రని గన్నేరు పూలతో నారాయణుణ్ణి పూజిస్తే వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది.

★ కార్తీకంలో భగవద్గీతలోని విభూతి యోగం, విశ్వరూపయోగం అనే అధ్యాయాల్ని వైష్ణవాలయాలల్లో పారాయణ చేస్తే శ్రీహరి అనుగ్రహం సంపూర్ణంగా లభిస్తుంది.

## హరిసన్నిధిలో దీపారాధన

★ పవిత్రమైన కార్తీకమాసం శివుడికే కాదు శ్రీహరికి కూడా ప్రీతి పాత్రమైనది.

★ కార్తీకమాసంలో సాయంత్రంపూట వైష్ణవాలయంలో దీపారాధన చేసేవారు ఉత్తమ గతుల్ని పొందుతారు.

★ కార్తీకమాసంలో శ్రీహరి సన్నిధిలో దీపదానం చేసిన వారు గొప్ప జ్ఞానాన్ని పొందుతారు.

★ పత్తిని చక్కగా దుమ్ము లేకుండా విడదీసి, వత్తిని చేసి, బియ్యప్పిండితో లేక గోధుమపిండితో ప్రమిదనిచేసి, అందులో ఆవునెయ్యి పోసి, వత్తిని వెలిగించి యోగ్యుడైన విప్రుడికి దక్షిణతో సహా దీపాన్ని దానం చేయాలి.

## కార్తీక ద్వాదశి

కార్తీకమాసంలో సోమవారం ఎంతో విశేషమైనది. దానికన్నా శనిత్రయోదశి గొప్పది. దానికన్నా గొప్పది కార్తీకపూర్ణిమ. పూర్ణిమకన్నా శుక్లపక్ష పాడ్యమి విశేషమైనది, దీనికన్నా కార్తీకమాసం చివరి ఏకాదశి విశేషమైనది. ఈ చివరి ఏకాదశికన్నా విశిష్టమైన రోజు కార్తీక బహుళ ద్వాదశి.

★ కార్తీక మాసంలో ద్వాదశినాడు అన్నదానం చేస్తే సకల సంపదలు వృద్ధి చెందుతాయి.

★ సూర్యగ్రహణం నాడు గంగాతీరంలో కోటిమందికి అన్నదానం చేసిన ఫలితం, కార్తీక ద్వాదశినాడు ఒక్క బ్రాహ్మణుడికి అన్నదానం చేస్తే కలుగుతుంది.

★ వేయి గ్రహణాలు, పదివేల వ్యతీపాత యోగాలు, లక్ష అమావాస్యలు కార్తీక ద్వాదశికి సరిరావు.

★ కార్తీక ద్వాదశినాడు వస్త్రదానం చేసేవాడు పూర్వజన్మలో చేసిన పాపాలు నశింపచేసుకుంటాడు.

★ కార్తీక ద్వాదశినాడు పాలిచ్చే ఆవుకి బంగారు కొమ్ములు, వెండిడెక్కలు చేయించి వాటితో సహా ఆవుని ఆవుదూడని కలిపి గోదానం చేస్తే ఆ గోవులకి ఎన్ని లక్షల వెంట్రుకలుంటాయో అంతకాలం స్వర్గలోకంలో నివసిస్తారు.

## కార్తీకమాస విధులు

★ కార్తీక మాసంలో శివప్రీతి కోసం సోమవార వ్రతాన్ని ఆచరించాలి. కార్తీక సోమవారం నాడు చేసిన స్నానం, జపం, ధ్యానం, హోమం, దానం - ఇవన్నీ వెయ్యి అశ్వమేధయాగాలు చేసిన ఫలితాన్నిస్తాయి

★ కార్తీకమాసంలో 1.ఉపవాసం 2.ఏకభుక్తం 3.రాత్రిభోజనం 4.అయాచిత భోజనం 5.స్నానం 6.తిలదానం అనే ఈ ఆరుక్రియలూ ఉపవాసంలో సమానమైనవిగా చెప్పబడ్డాయి. అనగా వీటిలో ఏ ఒక్కటి ఆచరించినా అది ఉపవాసదీక్షతో సమానమైన ఫలితాన్నిస్తుంది.

★ కార్తీకమాసంలో శక్తి ఉన్నప్పటికీ కార్తీక వ్రతాలలో ఓ ఒక్కటైనా చేయకపోతే కుంభీపాక, రౌరవనరకంలో పడతారు.

## వైశాఖమాస ప్రాశస్త్యం

న మాధవ సమోమాసో నకృతేన యుగం సమం ।
న చ వేదసమం శాస్త్రం న తీర్థం గంగయా సమం ॥

వైశాఖమాసాన్ని మించిన మాసంలేదు. యుగాల్లో కృత యుగాన్ని మించిన యుగం లేదు. అలాగే శాస్త్రాల్లో వేదాన్ని మించింది లేదు. తీర్థాల్లో గంగని మించిన పుణ్యతీర్థం లేదు.

వైశాఖమాసం భగవంతుడైన శ్రీహరికి అత్యంత ప్రీతిపాత్రమైనది. విష్ణుభగవానుణ్ణి మించిన దైవం ఎలా లేదో, వైశాఖమాసాన్ని మించిన మాసం మరొకటి లేదు. ఎంతో విశిష్టమైన ఈ మాసంలో చేసే దానాలు అఖండమైన, అనంతమైన ఫలితాలనిస్తాయి.

★ వైశాఖ మాసంలో జలదానం చేసినవాడికి సకల తీర్థాలనీ సేవించిన పుణ్యఫలితం లభిస్తుంది

★ వైశాఖంలో యాత్రికులకి దాహం తీరిస్తే పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి

★ దాహంతో బాధపడేవారికి చల్లటినీళ్ళు దానం చేస్తే పదివేల రాజసూయ యాగాలు చేసిన ఫలితం లభిస్తుంది.

★ వైశాఖంలో మధ్యాహ్న కాలంలో వచ్చిన అతిథికి అన్నదానం చేస్తే విశేషమైన పుణ్యం కలుగుతుంది.

★ వైశాఖమాసంలో ఎండలో తిరిగి అలసిపోయి వచ్చిన వారికి సుఖమైన వసతి, భోజనం ఏర్పాటు చేసిన వారికి పునర్జన్మ వుండదు

★ వైశాఖంలో పక్కబట్టలు, ధరించే వస్త్రాలు, దానం చేసిన వారికి ఈ జన్మలోనే సుఖభోగాలు లభిస్తాయి

★ పడుకోవటానికి చాపని దానం చేస్తే శ్రీహరి ఆనందిస్తాడు

★ మజ్జిగా ఎండతాపాన్ని చల్లారుస్తుంది. కనుక దాహంతో అలమటించేవారికి మజ్జిగ దానం చేస్తే శ్రీహరి అనుగ్రహం కలుగుతుంది

★ తెల్లటి బియ్యాన్ని దానం చేస్తే ఆయుర్దాయం పెంపొందుతుంది.

★ వైశాఖంలో బ్రాహ్మణులకి ఆవు నెయ్యి దానం చేసినవాడు, అశ్వమేధయాగ ఫలితం పొందుతాడు.

## – వైశాఖమాసంలో పాటించాల్సిన నియమాలు –

తైలాభ్యంగనం దివాస్వాపం తథావై కాంస్య భోజనం ।
ఖట్వా నిద్రాం గృహేస్నానం నిషిద్దస్య చ భక్షణం ।
వైశాఖే వర్జయే దష్టౌ ద్విభుక్తం నక్త భోజనం ॥

పవిత్రమైన వైశాఖమాసంలో 1. వళ్ళంతా నూనె పట్టించి అభ్యంగన స్నానం చేయటం 2.పగటిపూట నిద్రపోవటం 3.కంచుపాత్రలో భోజనం చేయటం 4.మంచం మీద పడుకోవటం 5.ఇంట్లో స్నానం చేయటం 6.నిషిద్ధపదార్థాలని (ఉల్లి–వెల్లుల్లి–మాంసాహారం) భుజించటం 7.ఎక్కువసార్లు తినటం 8.రాత్రిపూట భోజనం చేయటం అనే ఈ ఎనిమిది పనుల్ని విడిచిపెట్టాలి.

★ వైశాఖ వ్రతాన్ని ఆచరించేవాడు తామరాకులో భుజిస్తే సకల పాపాలనుంచీ విముక్తుడై విష్ణులోకాన్ని చేరుకుంటాడు.

★ వైశాఖమాసంలో నదీస్నానం చేస్తే పుణ్యం వస్తుంది.

★ ప్రాతఃకాలంలో సముద్ర స్నానం చేసినవాడు ఏడు జన్మల పాపాల్ని తొలగించుకోగలుగుతాడు.

★ జాహ్నవీ (గంగానది), వృద్ధగంగా (గోదావరీ నది), కాళిందీ (యమునానది), సరస్వతి, కావేరి, నర్మదా, వేణీ (కృష్ణవేణి) – ఈ ఏడు నదుల్ని సప్త గంగ లంటారు. వైశాఖమాసంలో ఈ ఏడు గంగల్లో ఏ గంగలో స్నానం చేసినా కోట్ల జన్మల్లో చేసిన పాపం నశిస్తుంది.

## – ప్రాతఃస్నాన మంత్రం –

మధుసూదన దేవేశ వైశాఖే మేషగే రవౌ ।
ప్రాతః స్నానం కరిష్యామి నిర్విఘ్నం కురుమాధవ ॥

ప్రాతఃకాలంలో నదీతీరానికి లేక సముద్ర తీరానికి వెళ్ళి ముందుగా పై శ్లోకాన్ని పఠించి(ఓ మధుసూదనా! పరంధామా! నేను మేషరాశిలో సూర్యుడు ఉన్నప్పుడు వైశాఖ మాసంలో పవిత్రమైన ప్రాతఃకాల స్నానాన్ని చేస్తున్నాను.

దయచేసి ఈ కార్యక్రమం నిర్విఘ్నంగా జరిగేలా చూడు) అని చెప్పి ఆ తరువాత స్నానం చేయాలి.

### - అర్ఘ్య మంత్రం -

స్నానమంత్రం చదివి నదిలో దిగి స్నానం చేసిన తరువాత అర్ఘ్య మంత్రాన్ని పఠించి శ్రీహరికి అర్ఘ్యం సమర్పించాలి.

వైశాఖే మేషగే భానౌ ప్రాతః స్నాన పరాయణ ।
అర్ఘ్యంతేஉ హం ప్రదాస్యామి గృహాణ మధుసూదన ॥

ఓ మాధవా! సూర్యభగవానుడు మేషరాశిలో ఉండగా నేను వైశాఖమాస ప్రాతః స్నానవిధిలో భాగంగా నీకు అర్ఘ్యాన్ని సమర్పిస్తున్నాను. ఈ అర్ఘ్యాన్ని నీవు స్వీకరించు" అని చెప్పి మూడు సార్లు శ్రీహరికి అర్ఘ్యాన్ని సమర్పించాలి.

తరువాత శుభ్రమైన వస్త్రాలు ధరించి సంధ్యావందనాది నిత్యకర్మల్ని పూర్తిచేసుకుని, వైశాఖంలో పుష్పించే పూలతో శ్రీహరిని శ్రద్ధగా అర్చించాలి. తరువాత వైశాఖమాస మాహాత్మ్యాన్ని తెలియచేసే విష్ణు కథల్ని శ్రవణం చేయాలి.

ఎవరైతే వైశాఖ మాసంలో పవిత్రమైన తులసీ దళాలతో శ్రీహరిని అర్చిస్తాడో వాడికి శ్రీహరి సాయుజ్య ముక్తి లభిస్తుంది.

## మార్గశిర మాస మాహాత్మ్యం

'మాసానాం మార్గశీర్షోహం' అని విష్ణు భగవానుడు స్వయంగా చెప్పిన మాట ఇది. శ్రీహరికి అత్యంత ప్రీతిపాత్రమైనది మార్గశీర్ష మాసం. ఈ మాసంలో ప్రాతః కాలంలోనే నిద్రలేచి విధిగా ఆచమనం చేసి, గురువులకి నమస్కరించి, ఎలాంటి బద్ధకం లేకుండా శ్రీహరిని స్మరిస్తూ విష్ణు సహస్రనామాల్ని పారాయణ చేయాలి. తరువాత మౌనంగా కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేయాలి.

స్నానం చేసే నీళ్ళని అష్టాక్షరీ మంత్రంతో శుద్ధిచేసి ఈ చెప్పబోయే మంత్రాన్ని పఠిస్తూ గంగని ప్రార్థించాలి.

విష్ణుపాద ప్రసూతాసి వైష్ణవీ విష్ణుదేవతా ।
త్రాహి సస్త్వమఘా దస్మాదాజన్మ మరణాంతికాత్ ॥

అమ్మా! గంగాదేవీ నీవు శ్రీహరి పాదాల నుంచి పుట్టావు. అందుకే వైష్ణవీ శక్తిగా కీర్తి పొందావు. శ్రీమహావిష్ణువే నీకు దైవం. నేను పుట్టినప్పటినుంచీ చేసిన పాపాలన్నీ ప్రక్షాళన చేయి "నన్ను రక్షించు" అని ఏడుసార్లు ఈ మంత్రాన్ని జపించి స్నానంచేసే నీళ్ళకి లేదా నదీ జలాలకి నమస్కరించి అయిదు సార్లు మునిగి స్నానం చేయాలి.

తరువాత పరిశుభ్రమైన వస్త్రాలు, ఊర్ధ్వపుండ్రాలు(నామాలు) ధరించి యథావిధిగా షోడశోపచారాలతో శ్రీహరిని పూజించాలి. పూజలో ప్రధానంగా తులసీ దళాన్ని ఎక్కువగా ఉపయోగించాలి. ఎందుకంటే తులసి అంటే శ్రీహరికి ఎంతో ఇష్టం గనుక.

## – తులసీదళాలు –

★ తులసిచెట్టు కొమ్మలతో నూరిన గంధాన్ని శ్రీహరికి సమర్పిస్తే వందజన్మల్లో చేసిన పాపం పోతుంది.

★ మార్గశీర్ష మాసంలో శ్రీహరికి తులసిని, తులసీచందనాన్ని సమర్పించిన వాడికి సకల కోరికలూ తీరుతాయి

★ మార్గశీర్షంలో తులసీ దళాలతో పాటు ఉసిరిక దళాలు కూడా ఉపయోగించి శ్రీహరిని పూజించేవాడు వైకుంఠానికి చేరుకుంటాడు

★ తులసీదళాల్ని ఉపయోగించి లక్ష్మీనారాయణ పూజచేసిన వాడికి శ్వేతద్వీప నివాస ప్రాప్తి కలుగుతుంది

★ తులసీ దళాలు, గంగాజలం నిల్వ ఉన్నప్పటికీ అవి అపవిత్రం కావు.

## – ధూపం –

★ శ్రీహరికి అత్యంత ప్రీతి పాత్రమైనది ధూపం. ఇది చేసిన పూజని పవిత్రం చేస్తుంది.

★ మార్గశీర్షంలో దశాంగధూపాన్ని శ్రీహరికి సమర్పిస్తే అత్యంత దుర్లభమైన కోరికలు కూడా తీరిపోతాయి.

★ నల్లని అగరుతో ధూపం వేసిన వాడు శ్రీహరి అనుగ్రహంతో నరకబాధని తప్పించుకుంటాడు.

★ గుగ్గిలం, గేదెనెయ్యి, చక్కెర కలిపి శ్రీహరికి ధూపం సమర్పిస్తే కోరిన కోరికలు తీరుతాయి.

★ సాలవృక్షం జిగురుతో శ్రీహరికి ధూపం వేస్తే యక్షరాక్షసులు నశిస్తారు.

**దీపం – హారతి**

★ మార్గశీర్షమాసంలో ఆవునెయ్యితో దీపాన్ని వైష్ణవాలయంలో వెలిగించాలి. లేదా స్వగృహంలో పూజామందిరంలోనైనా దీపారాధన చేయవచ్చు.

★ శ్రీహరి సన్నిధిలో దీపదానం చేస్తే సకల పాపాలూ నశిస్తాయి

★ ముద్ద కర్పూరంలో శ్రీహరికి మంగళ హారతిని సమర్పించాలి

★ మార్గశీర్షంలో శ్రీహరికి కర్పూర హారతి సమర్పించిన వాడు అశ్వమేధయాగ ఫలితాన్ని పొందుతాడు.

**శ్రీకృష్ణ నామస్మరణ :** మార్గశీర్షమాసంలో భగవంతుడైన శ్రీకృష్ణుడి దివ్యనామాన్ని నిరంతరం స్మరించాలి. కృష్ణ నామం అందర్నీ తరింపచేస్తుంది.

కృష్ణ కృష్ణేతి కృష్ణేతి యోమాం స్మరతి నిత్యశః ।
జలం భిత్వా యథాపద్మం నరకాదుద్ధరామ్యహం ॥

"ఎవరైతే ఒక్కసారి కృష్ణా! కృష్ణా! అంటూ నన్నే ప్రతిరోజూ స్మరిస్తారో వారు కమలాలు ఏవిధంగా నీళ్ళని ఛేదించుకుని బైటికి వస్తాయో అలాగే కృష్ణ నామం చేసిన వాడిని నేను నరకం నుంచి బైటికి తీసుకొస్తాను" అని సాక్షాత్తు నారాయణుడే చెప్పాడు. కనుక కృష్ణనామం అనేది ఎంతో గొప్పదని గ్రహించి నిరంతరం స్మరించాలి.

★ ఎవరైతే కృష్ణనామాన్ని శ్రద్ధగా జపిస్తాడో అతడు పాపి అయినప్పటికీ నరకాన్ని చేరడు.

★ మార్గశీర్షంలో విశేషంగా స్మరించాల్సిన నామం కృష్ణనామం. ఈ నామాన్ని అశ్రద్ధగా చేసినా, నిర్లక్ష్యంగా చేసినా, హాస్యానికి చేసినా, ఎలా చేసినా చేసినవారికి పుణ్యఫలం దక్కుతుంది.

**శ్రీకృష్ణ కృష్ణ కృష్ణేతి శ్రీకృష్ణేతి న జల్పతి**

అనే ఈ కృష్ణ నామాన్ని మార్గశీర్షంలో ప్రాతఃకాలంలో ఎవరు జపిస్తారో లేక భజనగా చేస్తారో వారికి సంపూర్ణమైన ఆయుష్షు, ఆరోగ్యం పెంపొందుతాయి.

## చాతుర్మాస్య మాహాత్మ్యం

వ్రతాలలో ఎంతో గొప్పది చాతుర్మాస్య వ్రతం. చాతుర్మాస్యం ప్రారంభం కాగానే సకలతీర్థాలు, దేవతలు, దివ్యస్థలాలు విష్ణుమూర్తి శరణు పొందుతున్నాయి. పవిత్రమైన ఈ చాతుర్మాస్యం ఆషాఢ పౌర్ణమినాడు ప్రారంభమవుతుంది. నాలుగు నెలలకి ముగుస్తుంది. చాతుర్మాస్యం శ్రీహరికి ప్రీతి పాత్రమైనది. విశేషంగా సర్వసంగపరిత్యాగులైన యతులకి ఆవశ్యకమైనది.

★ చాతుర్మాస్యంలో శ్రీహరిని సేవించినవాడి జీవితం ఫలవంతంగా వుంటుంది.

★ చాతుర్మాస్యంలో నదీ స్నానం చేసినవాడికి సిద్ధి లభిస్తుంది.

★ నదుల్లో అవకాశం లేకపోతే చెఱువుల్లో, జలాశయాల్లో స్నానంచేసిన వారికి పాపనివారణ జరుగుతుంది.

★ పుష్కరక్షేత్రం, ప్రయాగ లేదా ఏదో ఒక మహాతీర్థంలో స్నానం చేస్తే అఖండమైన పుణ్యం ప్రాప్తిస్తుంది.

★ నర్మదానది, ప్రాచీన సరస్వతీ, భాస్కరక్షేత్రం, నదీసముద్ర సంగమ ప్రాంతంలో చాతుర్మాస్య స్నానం చేసినవారికి పాపం ఏమాత్రం మిగలదు.

★ నర్మదానదిలో మూడురోజుల పాటు నియమంగా చాతుర్మాస్య స్నానాన్ని ఆచరిస్తే పాపాలన్నీ ఛిన్నాభిన్నమైపోతాయి.

★ పవిత్రమైన గోదావరి నదిలో ఉదయంపూట, చాతుర్మాస్యకాలంలో, కనీసం పదిహేనురోజులు స్నానం చేయాలి. అలా చేసిన వారికి వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది.

★ చాతుర్మాస్యంలో నీళ్ళలో నువ్వులు లేక ఉసిరి రసం లేక బిల్వ పత్రాలు వేసి, ఆ నీళ్ళతో స్నానం చేస్తే వారు చేసిన ఘోరమైన పాపాలన్నీ నశిస్తాయి.

★ చాతుర్మాస్యంలో గంగానదీ స్నానం ఎంతో పుణ్యప్రదం. ఎందుకంటే ఈ చాతుర్మాసానికి అధిదేవత అయిన శ్రీహరి పాదాల నుంచే గంగానది పుట్టింది కనుక.

★ చాతుర్మాస్యంలో నారాయణ క్షేత్రాల్లో ఉన్న తీర్థాల్లో స్నానం చేయాలి. తద్వారా శ్రీహరి అనుగ్రహం సంపూర్ణంగా లభిస్తుంది.

★ చాతుర్మాస్యంలో రాత్రిపూట, సంధ్యాకాలంలో, గ్రహణం కాని సమయాల్లో స్నానం చేయకూడదు. అలాగే వేడినీళ్ళతో కూడా స్నానం చేయకూడదు

★ చాతుర్మాస్యంలో అందరికీ, అన్నివిధాలా ఉత్కృష్టమైన కాలం. అందుకే ఈ కాలంలో పవిత్ర కర్మల్ని ఆచరించాలి.

★ సత్సంగం, బ్రాహ్మణభక్తి, గురు, దేవ, పితృతర్పణాలు, గోదానం, వేదపఠనం, సత్కర్మాచరణ, సత్యభాషణ, గోభక్తి, దానాలు చేయటం మీద ప్రీతి కలిగి వుండటం–ఇవన్నీ చాతుర్మాస్యంలో అందరూ ఆచరించాల్సిన ప్రధాన ధర్మాలు.

## కాశీఖండం

విశ్వేశం మాధవం ఢుంఢిం దండపాణిం చ భైరవం ।
వందేకాశీం గుహాం గంగాం భవానీం మణికర్ణికాం ॥

విశ్వేశ్వరుడికి, బిందు మాధవుడికి, ఢుంఢిగణపతికి, దండపాణికి, కాలభైరవుడుకి, కాశీదేవికి, గుహ (జైగీషవ్యగుహ)కి, గంగాదేవికి, భవానీ (దుర్గాభవానీ) దేవికి, మణికర్ణికాదేవికి నమస్కారం. కాశీక్షేత్రానికి వెళ్ళినవారు ప్రతిరోజూ ధ్యానించాల్సిన శ్లోకం ఇది. ఈ శ్లోకంలోనే కాశీలో తప్పనిసరిగా దర్శించాల్సిన ప్రసిద్ధ స్థలాలు కూడా చెప్పబడ్డాయి.

## గో మాహాత్మ్యం

★ భూలోకంలో మానవులు – గోవులు వీరిద్దరిదీ ఒకే కులం. జాతి పరంగా మాత్రమే రెండుగా విభజించబడ్డాయి.

★ బ్రాహ్మణుల్లో మంత్రం,గోవుల్లో హవిస్సు ఉంచబడ్డాయి

★ బ్రాహ్మణులు జంగమ తీర్థాలైతే ఆవులు పరమపవిత్రమైన తీర్థాలు

★ ఆవు గిట్టల నుంచి పైకి లేచిన గోధూళి గంగాజలమంత పవిత్రమైనది.

★ గోవు కొమ్ముల చివర సకల తీర్థాలు, గోవుగిట్టల్లో సకల పర్వతాలు, గోవు కొమ్ముల మధ్యలో గౌరీదేవి కొలువై వున్నారు.

★ గోదానం చేయటం వల్ల దేవతలు, పితృదేవతలు, ఋషులు ఎంతో సంతోషిస్తారు.

★ గోమయం (ఆవుపేడ) సాక్షాత్తు యమునానది, గోమూత్రం నర్మదా నదితో సమానం. ఆవుపాలు గంగానదితో సమానం.

★ గోవు శరీరంలో 14 లోకాలూ ఉన్నాయి.

★ త్రిమూర్తులు నిత్యం ధర్మ స్వరూపమైన గోవుని పూజిస్తారు.

★ గోపుచ్ఛంతో (తోక) తమ శరీరాన్ని తాకించుకునేవారు పుణ్యాత్ములు

★ సత్యలోకంకన్నా పైన వైకుంఠం, దానికన్నా పైన కుమారలోకం, దానికన్నా పైన ఉమాలోకం, దానికన్నా పైన శివలోకం ఆ శివలోకానికి సమీపంలో ఉన్నది ఈ గోలోకం.

★ గోదానాన్ని, గోసేవని చేసేవారు ఊర్ధ్వలోకాలకి చేరి ఆనందంగా నివసిస్తారు.

★ గోదానాన్ని కేవలం శృతి, స్మృతి పురాణాలు తెలిసిన పండితులకే చేయాలి.

*(ఈ గోమహాత్మ్యం గురించిన విషయాలు*
*సాక్షాత్తు బ్రహ్మదేవుడే స్వయంగా దేవతలకి చెప్పాడు)*

## కాశీ గొప్పతనం

సర్వార్థానా మత్రదాత్రీ భవానీ సర్వాన్ కామాన్ పూరయేదత్ర డుంఢిః ।
సర్వాన్ జంతూన్ మోచయేదంతకాలే విశ్వేశోఽత్ర మంత్రోపదేశాత్ ॥

కాశీక్షేత్రంలో ఉండే దుర్గాభవాని సర్వపురుషార్థాలనీ అనుగ్రహిస్తుంది. ఇక్కడ వెలిసిన డుంఢి గణపతి అందరి కోరికల్నీ తీరుస్తాడు. కాశీవిశ్వనాథుడు

మరణించిన జీవుల చెవిలో తారక మంత్రాన్ని ఉపదేశించి వారికి ముక్తిని ప్రసాదిస్తాడు. కాశీక్షేత్రంలో ధర్మం నాలుగు పాదాలతో వర్ధిల్లుతుంది. కాశీవిశ్వేశ్వరుడు ధర్మార్ధకామ మోక్షస్వరూపుడు. కాశీలాంటి పట్టణం ముల్లోకాల్లో లేదు.

యతో విశ్వేశ్వరేణైతే తిర్యక్ప్యోప్యత్ర వాసినః ।
విధనావసరే మోచ్యా స్తారక ప్యోపదేశతః ॥

కాశీ దివ్య క్షేత్రం మహిమని గురించి వివరంగా తెలుసుకుని, దృఢ సంకల్పంతో కాశీలో నివసించేవారు విశ్వనాథుడి అనుగ్రహంతో జీవన్ముక్తు లవుతారు. లేదా మరణానంతరం మోక్షాన్ని పొందుతాడు.

ఇలా కాశీ గొప్పతనాన్ని తెలుసుకున్న జ్ఞానులకే కాదు, కాశీలో నివసించే పశుపక్ష్యాదులకి కూడా పునర్జన్మ ఉండదు. రాజ్యభోగం కన్నా మానస ఉపవాసాలతో కాశీలో నివసించటమే శ్రేష్ఠం. ఒకవేళ కాశీ క్షేత్రానికి మనం వెళ్ళినప్పటికీ అక్కడి కాలభైరవుడు అనుమతి లేనిదే, విశ్వనాథుడి అనుగ్రహం కలగకపోతే నివసించలేము. కనుక కాశీకి వెళ్ళినవారు, వెళ్ళబోయేవారు ముందుగా క్షేత్రపాలకుడైన కాలభైరవుణ్ణి, క్షేత్రాధి దైవమైన విశ్వనాథుణ్ణి, శరణువేడి ప్రసన్నం చేసుకోవాలి. కాశీక్షేత్రాన్ని చేరి ఉత్తరవాహిని గంగలో స్నానం చేసి, విశ్వనాథుణ్ణి, విశాలాక్షిని, అన్నపూర్ణని దర్శించినవారి పుణ్యం అనంతం. కాశీక్షేత్రం ఇంత గొప్పది కనుకే దేవతలంతా 'నకాశీసదృశే త్రిలోకే' అని సంభావిస్తారు.

యేన బీజాక్షరయుగళం కాశీతి హృది ధారితమ్ ।
ఆబీజాని భవంత్యేవ కర్మబీజాని తస్సవై: ॥
కాశి కాశీతి కాశీతి జపతోయస్య సంస్థితిః ।
అన్యత్రాపి నతస్తస్య పురోముక్తిః ప్రకాశతే ॥

*(శ్లో॥37-38,అధ్యా-64)*

కాశి కాశి అని ఎప్పుడూ మనసులో జపిస్తూ ఉంటే లోకంలో ఎక్కడవున్నా కాశీవాసం చేసినట్టే అవుతుంది. తద్వారా ముక్తి లభిస్తుంది. సర్వకాల సర్వావస్థల్లో 'కాశి' అనే రెండక్షరాల మంత్రాన్ని జపించేవారికి భయమన్నదే తెలియదు. 'కాశి' అనే రెండు బీజాక్షరాలని హృదయంలో స్థిరంగా నిలుపుకున్నవారికి కర్మబీజాలు నశించిపోతాయి.

## కాశీ రహస్యం

ముక్తిని కోరుకునే వారు కాశీ క్షేత్రంలో నివసిస్తూ ఉత్తర వాహిని గంగలో నిత్యం స్నానం చేస్తూ విశ్వనాథుణ్ణి సేవించాలి. శమదమాది గుణాలతో ప్రశాంత చిత్తులై సంచరించాలి. ఎప్పుడూ అందరికీ హితమైన పనులే చేయాలి. ఎవరితో ఉద్వేగంగా మాట్లాడకూడదు. మనసులో కూడా పాపచింతన చేయరాదు.

మనసాపిన కర్తవ్యమేనోఽ త్రవిజగీషుణా ।
అత్యత్రమక్షయం యస్మాత్ సుకృతం సుకృతేతరం ॥

*(శ్లో॥67,అధ్యా-64)*

ఇతర ప్రదేశాల్లో చేసిన పాపాలు కాశీ క్షేత్రాన్ని చేరగానే నశిస్తాయి. అయితే వారణాశిలో చేసిన పాపాలు కోటి కల్పాలు గడిచినా నశించవు. కాశీలో తెలిసి పాపంచేసిన వారికి, ముప్పైవేల సంవత్సరాలు రుద్రపిశాచ జన్మ కలుగుతుంది. అయితే వారు కాశీవాసం చేసిన కారణంగా రుద్ర పిశాచజన్మ తరువాత తిరిగి కాశీలోనే జ్ఞానులుగా పుడతారు. ఈ విషయాన్ని గ్రహించి మోక్షపురి అయిన కాశీ క్షేత్రంలో ఎలాంటి పాపాలూ చేయకుండా ప్రవర్తించాలి.

అశాశ్వత మిదం జ్ఞాత్వా మానుష్యం బహుకిల్బిషం ।
అవిముక్తం సదాసేవ్యం సంసార భయమోచకం ॥

*(శ్లో॥89,అధ్యా-64)*

ఈ కలియుగంలో జీవులందరికీ, కాశీక్షేత్రం కన్నా పాపాలకి ప్రాయశ్చిత్తం కలిగించే మరో క్షేత్రం లేదు. వేలజన్మల్లో చేసిన పాపం కాశీలో ప్రవేశించగానే నశిస్తుంది. యోగం ద్వారా వేయిజన్మల్లో కలిగే ముక్తి కాశీక్షేత్రంలో మరణిస్తే అనాయాసంగా లభిస్తుంది. కాశీలో ఉండే పశు పక్ష్యాదులు కూడా మరణానంతరం ముక్తిని పొందుతాయి. మూర్ఖులైనవారు మోహాంధకారంలో మునిగి, కాశీక్షేత్రాన్ని సేవించకుండా మలమూత్ర భూయిష్టమైన మాతృగర్భవాసాన్ని పొందుతారు. కాశీక్షేత్రంలో శివలింగాన్ని ప్రతిష్ఠించినవారికి, శతకోటి కల్పాల వరకూ పునర్జన్మ ఉండదు.

బ్రహ్మహత్యచేసిన వాళ్ళు కూడా మనోనిగ్రహంతో కాశీలో నివసిస్తూ, అక్కడే శరీరాన్ని వదిలేస్తే వారికి కూడా ముక్తి లభిస్తుంది. కాశీ క్షేత్రంలో మరణించిన వాడికి, పరమేశ్వరుడు స్వయంగా తారక మంత్రాన్ని ఉపదేశిస్తాడు. దానివల్ల ఆ జీవుడు బ్రాహ్మీమయ మూర్తిగా మారిపోతాడు.

## కుమారస్వామి చెప్పిన కాశీమహిమ

పూర్వం ఒకనాడు అగస్త్యమహర్షి అన్ని పుణ్యక్షేత్రాల్ని దర్శిస్తూ లోపాముద్రా సహితంగా శ్రీశైలంలో ఉన్న స్కందవనానికి వచ్చాడు. ఆ వనంలో కైలాసపర్వత శిఖరంలాంటి లోహిత గిరి ఉంది. ఆ వనానికి వచ్చిన మహర్షి ఆయిన భార్య లోపాముద్రాదేవి స్కందుణ్ణి దర్శించి, సాష్టాంగ దండ ప్రణామం చేసారు. అగస్త్యుడు ఎంతో భక్తి శ్రద్ధలతో కుమారస్వామిని వేద సూక్తులతో ఇలా కీర్తించాడు.

## అగస్త్యుడు చేసిన స్కందస్తుతి

నమోఽస్తు బృందారక బృందవంద్య పాదారవిందాయ సుధకరాయ ।
షడాననాయామితవిక్రమాయ గౌరీ హృదానంద సముద్భవాయ ॥ 1

నమోఽస్తు తుభ్యం ప్రణతార్తి హంత్రే కర్త్రే సమస్తస్య మనోరథానమ్ ।
దాత్రే రథానం పరతారకస్య హంత్రే ప్రచండా సురతారకస్య ॥ 2

అమూర్త మూర్తాయ సహస్రమూర్తయే గుణాయ గుణ్యాయ పరాత్పరాయ ।
అపారపారాయ పరాపరాయ నమోఽస్తు తుభ్యం శిఖివాహనాయ ॥ 3

నమోఽస్తుతే బ్రహ్మవిదాంవరాయ దిగంబరాయాఽంబరసంస్థితాయ ।
హిరణ్యవర్ణాయ హిరణ్యబాహవే నమోహిరణ్యాయ హిరణ్యరేతసే ॥ 4

తపః స్వరూపాయ తపోధనాయ తపః ఫలానాం ప్రతిపాదకాయ ।
సదా కుమారాయ హి మార మారిణే తృణీకృతైశ్వర్య విరాగిణే నమః॥ 5

నమోఽస్తు తుభ్యం శరజ్మనే విభో ప్రభాతసూర్యాఽరుణదంతపంక్తయే ।
బాలాయ చ బాల పరాక్రమాయ షాణ్మాతురాయాఽఖిల మనాతురాయ ॥ 6

మీఢుష్టమా యోత్తరమీఢుషే నమో నమో గణానాం పతయే గణాయ ।
నమోఽస్తుతే జన్మ జరాతిగాయ నమో విశాఖాయ సుశక్తిపాణయే ॥ 7

సర్వస్య నాథస్య కుమారకాయ క్రౌంచారయే తారక మారకాయ ।
స్వాహేయ గాంగేయ చ కార్తికేయ శైవేయ తుభ్యం సతతం నమోఽస్తు॥ 8

*(శ్లో॥1-8,కాశీఖండం)*

"దేవతా గణాలందరిచేతా నమస్కరించబడే పాదద్వయం కలిగినవాడా! చంద్రుడిలా మనసుకి ఆనందాన్ని కలిగించేవాడా! కార్తికేయా! శైవేయా! నీకు నమస్కారం". ఈ విధంగా స్కందుణ్ణి స్తుతించగానే, ఆయన అగస్త్యుణ్ణి అనుగ్రహించి "అగస్త్యమునీ! నీవు వింధ్యపర్వతాన్ని అణిచి కాశీని విడిచి ఇక్కడి కొచ్చావన్న సంగతి నేను గ్రహించాను. నీ త్యాగం ఎంతో గొప్పది. మరణించిన వారికి ముక్తిని ప్రసాదించే కాశీక్షేత్రం గురించి ప్రత్యేకంగా తెలుసుకోవలసింది చాలావుంది. భూలోకాది పద్నాలుగు భువనాలలో కాశీలాంటి క్షేత్రం లేదు. ఈ క్షేత్రంలో శాశ్వతంగా నివసించాలని నేను ఎంతో కాలం నుంచీ తపస్సు చేస్తున్నాను. అయినా ఇంతవరకూ నా కోరిక నెరవేరలేదు. పుణ్యం, దానం, జపం, తపం వల్ల కాశీవాసం అందరికీ లభించదు. కేవలం పరమేశ్వరుడి అనుగ్రహం ఉంటేనే ఆ క్షేత్రవాసం కలుగుతుంది.

కాశీక్షేత్రం బ్రహ్మ సృష్టి కన్నా విభిన్నమైనది. ఆ క్షేత్ర మహిమని పరమేశ్వరుడు సైతం సంపూర్ణంగా వర్ణించలేడు. సంపదలు, శరీరం ఎప్పటికైనా నశించి పోయేవే. ఆయువు చంచలమైనది. ఎప్పుడు పోతుందో ఎవరికీ తెలీదు. ఈ విషయాన్ని గుర్తించి అందరూ కాశీ క్షేత్రాన్ని ఆశ్రయించాలి. మరణం వచ్చే వరకూ కాశీని విడచి రాకూడదు. పాశుపతయోగం కన్నా, ప్రయాగ తీర్థం కన్నా జీవులకి అనాయసంగా ముక్తినిచ్చే క్షేత్రం కాశీ. అగస్త్యా! కాశీ క్షేత్రంలో ప్రాణాలు విడిచినవాడికి మాత్రమే విదేహ విముక్తి కలుగుతుంది. కానీ ఇతర ప్రదేశాల్లో మరణిస్తే రాదు.

ఏతాని యాని ప్రోక్తాని కాశీప్రాప్తి కరాణి చ ।
ప్రాప్య కాశీం భవేన్ముక్తో జంతుః నాన్యత్ర కుత్రచిత్ ॥

*(శ్లో॥45,అధ్యా-25)*

ఈ కారణం వల్లనే కాశీక్షేత్రం పవిత్రమైనది. విశ్వనాథుడికి ప్రియమైనది. అగస్త్యా! కాశీక్షేత్రం నుంచి వచ్చిన నీ పాద స్పర్శ, కాశీ నగరాన్ని స్ఫురింపచేస్తోంది. ఇంద్రియనిగ్రహంతో మూడురోజులు కాశీ క్షేత్రంలో నివసించిన వారి పాద రేణువులు ఎక్కడ పడితే ఆ ప్రాంతమంతా పవిత్రమై పోతుంది.

అగస్త్యా! నీవెంతో ధన్యుడివి. దివ్యమైన వారణాసి నగరంలో ఎంతో కాలం నివసించావు. అక్కడ నీవొక కుండాన్ని నిర్మించావు. ఆ కుండం నీపేరు మీదుగానే అగస్త్య కుండం అన్న ఖ్యాతిని పొందుతుంది. ఆ కుండంలో స్నానం చేసి, దాని సమీపంలో జపతప దానాదులు ఆచరించిన వారు కాశీవాసఫలాన్ని పొందుతారు"అని స్కందుడు పలికి అగస్త్యముని దంపతుల్ని ఆశీర్వదించాడు.

## ఆనంద వనం - అవిముక్తం

కాశీక్షేత్రానికి అవిముక్తం - ఆనందవనం అనే రెండు పేర్లున్నాయి. ఈ నగరం అయిదుక్రోసుల పరిమాణంలో ఉంటుంది. పవిత్రమైన ఈ కాశీక్షేత్రాన్ని పార్వతీ పరమేశ్వరులు ప్రళయకాలంలో కూడా విడిచిపెట్టరు. అందుకే దీనికి అవిముక్త క్షేత్రం అనే పేరు వచ్చింది.

భూమి, నీరు లాంటివి ఏమీ లేవి సమయంలో విహారం కోసం పరమేశ్వరుడు ఈ అవిముక్త క్షేత్రాన్ని నిర్మించాడు. ఈ దివ్యక్షేత్రం మోక్ష స్వరూపమైన ఆనందానికి హేతువు అవటం వల్ల మహాదేవుడు దీనికి ఆనందవనం అనే పేరు పెట్టాడు. తరువాత కాలంలో ఈ ఆనందవనమే అవిముక్తంగా ప్రసిద్ధి చెందింది.

పూర్వం ఆనందవనంలో విహరిస్తున్న పార్వతీ పరమేశ్వరులకి "ఈ సృష్టిని పోషించే భారాన్నంతా మరొక నూతన వ్యక్తికి అప్పగించి, హాయిగా కాశీ క్షేత్రంలో నివసిస్తూ, ఇక్కడ మరణించిన వారందరికీ ముక్తిని కలిగిస్తూ ఉండాలనే" కోరిక కలిగింది. ఆ ఆలోచన రాగానే పరమేశ్వరుడు తన శరీరంలోని వామభాగాన్ని ఒక్కసారి చూసాడు. అంతే ఆ భాగంనుంచి త్రిలోక సుందరుడైన ఒక దివ్య పురుషుడు ఆవిర్భవించాడు. ఆ దివ్యపురుషుడు పరమశాంతంగా, నీలమేఘశ్యాముడిగా, పుండరీకాక్షుడుగా శోభిస్తున్నాడు.

మహేశ్వరుడు ఆ మహాపురుషుణ్ణి చూసి, "ఓ మహాపురుషా! నేటి నుంచీ నీవు 'విష్ణువు' అనే పేరుతో విరాజిల్లుతావు. నీ నిట్టూర్పులే వేదాలు. వేదమార్గాన్ని అనుసరించి, అన్ని కార్యాలూ యథోచితంగా నీవు నిర్వహించు. నేటి నుంచీ ఈ సృష్టి, స్థితుల బాధ్యత నీదే" అని విష్ణువుకి అంతా అప్పగించి పార్వతితో కలిసి ఆనందవనం (కాశీ) లోకి ప్రవేశించాడు.

మహావిష్ణువు శివుడి ఆజ్ఞని శిరసావహించి, అందుకు తగ్గ శక్తిని సంపాదించటం కోసం తపస్సు చేయాలనుకున్నాడు. వెంటనే తన సుదర్శన చక్రంతో అక్కడొక పుష్కరిణిని నిర్మించి దాన్ని తన స్వేదజలంతో నింపేశాడు. ఆ పుష్కరిణి సమీపంలోనే ఏభైవేల సంవత్సరాలు పరమేశ్వరుడి అనుగ్రహం కోసం తపస్సు చేసాడు. విష్ణువు భక్తికి మెచ్చిన పరమేశ్వరుడు పార్వతితో సహా ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. అప్పుడు శ్రీహరి "ప్రభూ! నిరంతరం నీ పాద పద్మాల మీద భక్తి స్థిరంగా వుండేలా వరమియ్యి అని అడిగి, ఆయన్ని దివ్యంగా స్తుతించసాగాడు.

మహావిష్ణువు చేస్తున్న స్తుతి వింటూ పరమేశ్వరుడు ఆనందంగా తల ఊపుతున్నాడు. అంతలో ఆయన చెవికుండలం (మణికర్ణిక) జారి విష్ణువు నిర్మించిన చక్రకుండంలో పడింది. అందువల్ల ఈ తీర్థం చక్ర తీర్థమనే కాకుండా మణికర్ణికా తీర్థమని కూడా విఖ్యాతి పొందింది. పరమేశ్వరుడు శ్రీహరిని అనుగ్రహిస్తూ "హరీ! నీ సుదర్శన చక్రం ద్వారా త్రవ్వబడ్డ ఈ తీర్థం చక్రపుష్కరిణిగా కూడా పేరు పొందుతుంది. నీ కీర్తి అజరామరంగా నిలుస్తుంది అని ఆశీర్వదించాడు. అదివిని శ్రీహరి పరమేశ్వరుణ్ణి మరో మారు ప్రార్థించి ప్రభూ!

కాశతేఽ త్రయతోజ్యోతిః తదానాఖ్యేయమీశ్వరః ।
అతో నామాక్షరం చాస్తు కాశీతి ప్రథితంవిభో ॥

*(శ్లో॥68,అధ్యా-26)*

నీ దివ్యమణి కుండలాలు జారిపడిన కారణంగా ఈ తీర్థం ముక్తి క్షేత్రమవ్వాలి. అలాగే ఈ దివ్య క్షేత్రం మాటలకందని అగోచరమైన పరంజ్యోతి ప్రకాశంతో నిండి ఉంది కాబట్టి ఇది నేటి నుంచి 'కాశి' అనే పేరుతో విఖ్యాతి చెందాలి. అలాగే పిపీలికాది బ్రహ్మపర్యంతం ఏ రకం జీవులైనా ఈ క్షేత్రంలో మరణిస్తే ముక్తిని పొందాలి.

మణికర్ణికా తీర్థంలో స్నానం, దానం, జపం, తపం, హోమం, వేదపఠనం, లింగ ప్రతిష్ఠ, విగ్రహప్రతిష్ఠ లాంటి పుణ్యకర్మలు ఆచరించిన వారికి, అక్షయమైన పుణ్యఫలాల్ని కైలాస ప్రాప్తిని అనుగ్రహించు. అన్ని తీర్థాలకన్నా కాశీలోని ఈ తీర్థం అత్యంత పుణ్యప్రదమయ్యేలా అనుగ్రహించు" అని వేడుకున్నాడు.

లోకహితం కోసం విష్ణువు కోరిన విధంగానే పరమేశ్వరుడు అనుగ్రహించాడు. ఆనాటి నుంచి మణికర్ణికా తీర్థం, కాశీలో ఉన్న అన్ని తీర్థాల కన్నా ఎంతో గొప్ప స్థానాన్ని పొందింది.

ఈ మణికర్ణికా తీర్థానికి ప్రతిరోజూ మధ్యాహ్న కాలంలో సకల దేవతలూ వచ్చి ఆ కుండంలో స్నానం చేస్తారు. కనుక ఆ సమయంలో మణికర్ణికా తీర్థంలో స్నానం చేసిన వారికి సకల దేవతల అనుగ్రహం లభిస్తుంది.

కాశీ పంచక్రోశయాత్ర కూడా మణికర్ణికా తీర్థం నుంచే ప్రారంభమవుతుంది. శవదహనాలు నిరంతరం జరిగే మణికర్ణికా ఘాట్‌లో వున్న మశాన్‌బాబా మందిరం అత్యంత ప్రాచీనమైంది. ఈ ఘాట్ దగ్గరే మృత జీవుల చెవిలో తారకమంత్రాన్ని ఉపదేశించే శివుడి గుర్తుగా తారకేశ్వరాలయం కూడా ఉంది.

## కాశీ - గంగ

నాస్తి గంగా సమం తీర్థం కలికల్మషనాశనం ।
నాస్తిముక్తి ప్రదం క్షేత్రం అవిముక్తం సమంహరే ॥

కలిదోషాల్ని పరిహరించటంలో గంగానదితో సమానమైన తీర్థం మరొకటి లేదు. అలాగే ముక్తిని ప్రదానం చేసే దివ్యక్షేత్రాలలో అవిముక్త క్షేత్రాన్ని మించిన క్షేత్రం లేదు.

★ గంగానదిలో తిథివార నక్షత్ర నియమాలు లేకుండానే స్నానం చేయవచ్చు.

★ కాశిలో ఉన్న గంగని సేవించినవాడు, గంగా దేవికి మందిరాన్ని నిర్మించినవాడు సమస్త సుఖభోగాల్ని పొందుతాడు.

★ గంగాదేవిని స్మరించినా, ఆమె మహిమని విన్నా, వినిపించినా వారికి గంగాస్నానఫలం దక్కుతుంది.

★ పితృదేవతల్ని ఉద్దేశించి వారి పేర్లు స్మరిస్తూ గంగలోని నీళ్ళతో ఏ శివలింగానికి అభిషేకం చేసినా, వారి పితరులకి పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి.

★ గంగాజలంతో సూర్యుడికి అర్ఘ్యాలు సమర్పిస్తే ఆరోగ్యం పెంపొందుతుంది.

★ గంగాస్నానం చేసే వారిజోలికి యమదూతలు ఎప్పుడూ రారు.

★ కాశీలోని గంగా తీరంలో గోదానం, భూదానం, సువర్ణదానం, అన్నదానం చేసిన వారికి పునర్జన్మ ఉండదు.

★ మకరసంక్రమణం, ఉత్తర, దక్షిణాయనాలు, సూర్య చంద్రగ్రహణాలు తదితర పర్వదినాలలో కాశీగంగలో చేసే స్నానం అనంతమైన పుణ్యాన్ని ప్రసాదిస్తుంది.

జ్యేష్ఠేమాసే సితే పక్షే దశమీ హస్త సంయుతా ।
తస్యాం దశమ్యాంమే తచ్చ స్తోత్రం గంగాజలే స్థితః ॥ *(శ్లో॥179,అధ్యా-27)*

జ్యేష్ఠమాసం శుద్ధ దశమీ హస్తానక్షత్రం ఉన్న రోజు గంగాదేవికి అత్యంత ప్రీతిపాత్రమైనది. ఆ రోజు దశహర గంగాస్తోత్రాన్ని శ్రద్ధగా పఠించి గంగాస్నానం చేసిన వారికి పాపాలన్నీ క్షయమైపోతాయి.

## దశహర గంగా స్తోత్రం

ఓం నమః శివాయై గంగాయై శివదాయై నమోనమః ।
నమస్తే విష్ణు రూపిణ్యై బ్రహ్మమూర్త్యై నమోఽస్తుతే ॥ 1

నమస్తే రుద్రరూపిణ్యై శాంకర్యై తే నమోనమః ।
సర్వదేవ స్వరూపిణ్యై నమో భేషజమూర్తయే ॥ 2

సర్వస్య సర్వవ్యాధీనాం భిషక్ శ్రేష్ఠ్యై నమోస్తుతే ।
స్థాస్ను జంగమ సంభూత విషహంత్ర్యై నమోఽస్తుతే ॥ 3

సంసారవిషనాశిన్యై జీవనాయై నమోస్తుతే ।
తాపత్రయ సంహంత్ర్యై ప్రాణేశ్యై తే నమోనమః ॥ 4

శాంతి సంతాన కారిణ్యై నమస్తే శుద్ధ మూర్తయే ।
సర్వ సంశుద్ధి కారిణ్యై నమః పాపారిమూర్తయే ॥ 5

భక్తిముక్తి ప్రదాయిన్యై భద్రదాయై నమోనమః ।
భోగోపభోగదాయిన్యై భోగవత్యై నమోఽస్తుతే ॥ 6

మందాకిన్యై నమస్తేస్తు స్వర్గదాయై నమోనమః ।
నమస్త్రైలోక్య భూషాయై త్రిపథాయై నమోనమః ॥ 7

నమస్త్రిశుక్ల సంస్థాయై క్షమావత్యై నమోనమః ।
త్రిహుతాశన సంస్థాయై తేజోవత్యై నమోనమః ॥ 8

నందాయై లింగధారిణ్యై సుధాధారాత్మనే నమః ।
నమస్తే విశ్వముఖ్యాయై రేవత్యై తే నమోనమః ॥ 9

బృహత్యై తే నమస్తేఽస్తు లోకధాత్ర్యై నమోఽస్తుతే ।
పృథ్వ్యై శివామృతాయై చ సువృషాయై తే నమో నమః ॥ 10

పరాపర శతాఢ్యాయై తారాయై తే నమో నమః ।
పాశజాల నికృంతిన్యై అభిన్నాయై నమోస్తుతే ॥ 11

శాంతయై చ వరిష్ఠాయై వరదాయై నమోనమః ।
ఉగ్రాయై సుఖజగ్ద్యై చ సంజీవిన్యై నమోఽస్తుతే ॥ 12

బ్రహ్మిష్ఠాయై బ్రహ్మదాయై దురితఘ్న్యై నమో నమః ।
ప్రణతార్తి ప్రభంజిన్యై జగన్మాత్రే నమోఽస్తుతే ॥ 13

సర్వాపత్ప్రతిపక్షాయై మంగళాయై నమోనమః ।
శరణాగత దీనార్త పరిత్రాణపరాయణే ॥ 14

సర్వస్యార్తిహరే దేవి! నారాయణి ! నమోఽస్తుతే ।
నిర్లేపాయై దుర్గహంత్ర్యై దక్షాయై తే నమోనమః ॥ 15

పరాపరపరాయై చ గంగే నిర్వాణదాయిని ।
గంగే మమాగ్రతో భూయా గంగే మేతిష్ఠ పృష్ఠతః ॥ 16

గంగే మే పార్శ్వయోరేథి గంగే త్వయ్యస్తు మే స్థితి ।
ఆదౌ త్వమంతే మధ్యే చ సర్వం త్వం గాంగతే శివే ॥ 17

త్వమేవ మూల ప్రకృతి స్త్వం పుమాన్ పర ఏవ హి ।
గంగే త్వం పరమాత్మా చ శివస్తుభ్యం నమః శివే ॥ 18

*(శ్లో॥1-18)*

"ఓ గంగా! నీవు శివస్వరూపురాలివి, మంగళాలని ప్రసాదించేదానివి, విష్ణు స్వరూపిణివి, బ్రహ్మరూపిణివి, రుద్ర స్వరూపానివి, సర్వదేవతా స్వరూపిణివి. సకల వ్యాధుల్నీ నయం చేసే ఔషధమూర్తివి, భుక్తి ముక్తి ప్రదాయినివి, శక్తి స్వరూపిణివి, ముక్తి కాంతవి. నీకు నమస్కారం.

అమ్మా! గంగమ్మా! నా ముందు, వెనకా, ఇరుపక్కలా ఉండి నన్ను రక్షించు. ఆది అంతం మధ్యలో నీవే ఉన్నావు. మూలప్రకృతివి, పరమాత్మవి, పరమ పురుషుడివి, పరమేశ్వరుడివీ నీవే”

ఈ విధంగా గంగాదశహర స్తోత్రాన్ని పఠించినా, విన్నా సకల పాపాలూ నశిస్తాయి. సకల మనోరథాలూ నెరవేరతాయి. ఈ దశహరస్తోత్రాన్ని స్వయంగా చేత్తో రాసి స్వగృహంలో ఉంచుకుంటే అగ్ని, చోర, సర్పాది భయాలేవీ వుండవు. గౌరీదేవిని ఎలా పూజిస్తామో గంగానదిని కూడా అలాగే పూజించాలి.

## కాశీక్షేత్రంలో ఉన్న సిద్ధలింగాలు

ఓంకారేశ్వరాది 14 లింగములు. అమృతేశ్వరాది 14 లింగాలు, శైలేశ్వరాది 14 లింగాలు, దక్షేశ్వరాది 8 లింగాలు. ఈ సిద్ధలింగాలని ముక్తికాముకులు భక్తిశ్రద్ధలతో సేవించాలి. ఈ లింగాల వల్లే కాశీక్షేత్రం ముక్తి క్షేత్రంగా విశ్వవిఖ్యాతమైంది.

### ఓంకారేశ్వరాది చతుర్దశ (14) సిద్ధలింగాలు

1. ఓంకారేశ్వరాయ నమః (మత్స్యోదరికి ఉత్తరమునందు పఠానీటోలా)
2. త్రిలోచనేశ్వరాయ నమః (కామేశ్వరుని గల్లీ త్రిలోచనాఘాట్)
3. ఆదిమహాదేవాయ నమః (త్రిలోచనేశ్వరునకు సమీపంలో)
4. కృత్తివాసేశ్వరాయ నమః (మహామృత్యుంజయ మందిరమునకు సమీపంలో ఈ ఆలయం వున్నది)
5. రత్నేశ్వరాయ నమః (కృత్తివాసేశ్వరునకు సమీపమందు)
6. చంద్రేశ్వరాయ నమః (సిద్ధేశ్వరీ మందిరపు ఆవరణలో ఆత్మావీరేశ్వర, సంకటా మందిరాల సమీపంలో)
7. కేదారేశ్వరాయ నమః (కేదారఘాట్)
8. ధర్మేశ్వరాయ నమః (విశాలాక్షీ మందిరము దగ్గర ధర్మపీఠం)

9. ఆత్మావీరేశ్వరాయ నమః (సింధియా ఘాట్‌పైన)
10. కామేశ్వరాయ నమః (త్రిలోచన మందిరము దగ్గర)
11. విశ్వకర్మేశ్వరాయ నమః (1.ఆత్మావీరేశ్వర మందిరము, 2.గోల్‌గడ్డా పీలీకారీ)
12. మణికర్ణికేశ్వరాయ నమః (మణికర్ణికా ఘాట్‌పై గోమఠ సన్యాస ఆశ్రమం)
13. అవిముక్తేశ్వరాయ నమః (1. విశ్వనాథ మందిరము, 2. జ్ఞానవాపీగేట్ లోపలికి వచ్చు మార్గములో రాధాకృష్ణ ధర్మశాలలో పెద్దలింగము (కిటికిలో నుండి చూడాలి)
14. విశ్వేశ్వరాయ నమః (ప్రసిద్ధము. ఈ 14 లింగములను నిత్యం దర్శిస్తూ స్మరిస్తూ ఉండాలి.)

## అమృతేశ్వరాది చతుర్దశ (14) సిద్ధలింగాలు

1. అమృతేశ్వరాయ నమః (నీలకంఠ కుంజబిహారి)
2. తారకేశ్వరాయ నమః (జ్ఞానవాపి దగ్గర పెద్దనంది ప్రక్కన)
3. జ్ఞానేశ్వరాయ నమః (విశ్వనాథుని మందిరము నుండి సరస్వతీ పాఠక్ మీదుగా విశాలాక్షి మందిరానికి వెళ్లు మార్గంలో.)
4. కరుణేశ్వరాయ నమః (త్రిసంధ్యేశ్వరుని సమీపములో లలితాఘాట్)
5. మోక్షద్వారేశ్వరాయ నమః (కరుణేశ్వరుని దగ్గర)
6. స్వర్గద్వారేశ్వరాయ నమః 1. అక్కడే, 2. స్వర్గద్వారీమహల్లాలో
7. బ్రహ్మేశ్వరాయ నమః (దశాశ్వమేధ ఘాట్‌పైకి వెళ్లి ఖాలీస్ పురాలో భరద్వాజేశ్వరునకు పడమట)
8. లాంగలీశ్వరాయ నమః (ఖోవాబజార్, జ్ఞానవాపి గేట్ తరువాత మణికర్ణికా ఘాట్‌కు వెళ్లు మార్గమునకు కుడివైపు)
9. వృద్ధకాళేశ్వరాయ నమః (మహామృత్యుంజయ మందిరము దారనగర్)
10. వృషేశ్వరాయ నమః (మైదాగిన్ ఓరఖ్‌నాథ్ టీలాలో)

11. చండీశ్వరాయ నమః
(1 సదర్‌బాజార్ చండీదేవి మందిరం, 2. కాళికాగల్లీలో)

12. నందికేశ్వరాయ నమః (1. జ్ఞానవాపికి ఉత్తరమునందు (గుప్తము), 2.సరస్వతీ పాఠక్ దగ్గర, 3. మలదహియారోడ్‌వేజ్ మార్గంలో )

13. మహేశ్వరాయ నమః (1.జ్ఞానవాపి సమీపంలోని రావిచెట్టు క్రింద, 2.మణికర్ణికాఘాట్‌పై, 3. మహామృత్యుంయ మందిరములో)

14. జ్యోతిరూపేశ్వరాయ నమః (మణికర్ణిక దగ్గర కాకారమ్ గల్లీలో స్వామి బలజీత్ పరమార్థ భవన్)

## శైలేశ్వరాది చతుర్దశ (14) సిద్ధలింగాలు

1. శైలేశ్వరాయ నమః (వరణాతటమున మఢియాఘాట్‌పై శైలపుత్రిలో)
2. వరణాసంగమేశ్వరాయ నమః (వరణాసంగమమునందు ఆదికేశవుని మందిరమునకు క్రింద)
3. స్వర్లీనేశ్వరాయ నమః (ప్రహ్లాదఘాట్ రాజ ఘాట్ మధ్య గంగా తీరంలో)
4. మధ్యమేశ్వరాయ నమః (మందాకిని ఉత్తరమునందు) దారానగర్
5. హిరణ్యగర్భేశ్వరాయ నమః (త్రిలోచనాఘాట్ మెట్లపైన)
6. ఈశానేశ్వరాయ నమః (బాంస్ పాఠక్ ఆది విశ్వేశ్వర మందిర సమీపమందు)
7. గోప్రేక్షేశ్వరాయ నమః (లాల్‌ఘాట్ గోపీగోవింద మందిరములో గౌరీశంకర నాముతో ప్రసిద్ధి చెందింది)
8. వృషభధ్వజేశ్వరాయ నమః (కపిలధారా, ప్రాంతం)
9. ఉపశాంత శివాయ నమః (అగ్నీశ్వర్ నయాఘాట్‌పై గల్లీలో)
10. జ్యేష్ఠేశ్వరాయ శివాయ నమః (జ్యేష్ఠస్థానము, కాశీపురా)
11. నివాసేశ్వరాయ నమః (జ్యేష్ఠస్థానము, భూతభైరవుని దగ్గర కాశీపురా)
12. శుక్రేశ్వరాయ నమః (అన్నపూర్ణామందిరమునకు వెనుక కాళికాగల్లీ)

13. వ్యాఘ్రేశ్వరాయ నమః (జ్యేష్ఠాగౌరీ దగ్గర కాశీపురా)
14. జంబుకేశ్వరాయ నమః (బడాగణేశుని మందిరమునకు ముందు)

## దక్షేశ్వరాది (8) సిద్ధలింగాలు

1. దక్షేశ్వరాయనః (మహామృత్యుంజయ మందిరము దారానగర్)
2. పార్వతీశ్వరాయ నమః (త్రిలోచనాఘాట్‌లో ఆది మహాదేవ మందిరములో)
3. పశుపతీశ్వరాయ నమః (పశుపతీశ్వర గల్లీ)
4. గంగేశ్వరాయ నమః (జ్ఞానవాపికి సమీపమునందు రావి చెట్టు క్రింద లుప్తము స్థానపూజ)
5. నర్మదేశ్వరాయ నమః (త్రిలోచనునకు వెనుక)
6. గభస్తీశ్వరాయ నమః (మంగళాగౌరీ మందిరంలో పంచగంగాఘాట్)
7. సతీశ్వరాయ నమః (వృద్ధకాళేశ్వరుని రోడ్డు రత్నేశ్వరుని దగ్గర)
8. తారకేశ్వరాయ నమః (జ్ఞానవాపి పెద్దనంది దగ్గర)

## శ్రీ దండపాణ్యష్టకం

రత్నభద్రాంగజోద్భూత పూర్ణభద్ర సుతోత్తమ ।
నిర్విఘ్నం కురు మే యక్ష కాశీవాసం శివాపత్తయే ॥ 1

ధన్యో యక్షః పూర్ణభద్రో ధన్యా కాంచన కుండలా ।
యయోర్జఠరపీఠే భూర్దండపాణే మహామతే ॥ 2

జయ యక్షపతే ధీర జయ పింగళ లోచన ।
జయ పింగ జటాధార జయ దండమహాయుధ ॥ 3

అవిముక్త మహాక్షేత్ర సూత్రధారోగ్రతాపస ।
దండనాయక భీమాస్య జయ విశ్వేశ్వర ప్రియ ॥ 4

సౌమ్యానాం సౌమ్యవదన భీషణానాం భయానక ।
క్షేత్ర పాపధియాం కాల మహాకాల మహాప్రియ ॥ 5

జయ ప్రాణద యక్షేంద్ర కాశీవాసాన్నమోక్షద ।
మహారత్న స్ఫురద్రశ్మిచయ చర్చిత విగ్రహా ॥ 6

మహాసంభ్రాంతి జనక, మహోద్భ్రాంతి ప్రదాయక ।
అభక్తానాం చ భక్తానాం సంభ్రాంత్యుద్భ్రాంతి నాశక ॥ 7

భ్రాంత నేపథ్య చతుర జయ జ్ఞాననిధిప్రద ।
జయ గౌరీపదాబ్జాళే మోక్షేక్షణ విచక్షణ ॥ 8

*(శ్లో॥1-8,అధ్యా-32,కాశీ ఖండం)*

## కాశీ సంకల్పం

మమ ఉపాత్త సమస్తదురిత క్షయద్వారా శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే అష్టావింశతితమే కలియుగే, ప్రథమపాదే, విక్రమశకే భౌద్ధావతారే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోఃదక్షిణ దిగ్భాగే, వింధ్యస్యోత్తర ఆర్యావర్తైకదేశే, అసీ వరుణయోర్మధ్యే, అవిముక్త వారాణసీ క్షేత్రే, ఆనందవనే, మహాశ్మశానే, గౌరీముఖే, త్రికంటక విరాజితే, ఉత్తవాహిన్యాః భాగీరథ్యాః పశ్చిమే తీరే, బ్రహ్మనాళే, మహామణికర్ణికాక్షేత్రే, శ్రీవిశ్వేశ్వరాది త్రయస్త్రింశత్కోటి దేవతాగోబ్రాహ్మణ హరిహర గురు చరణ సన్నిథౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక బార్హస్పత్య మానేన ..... నామ సంవత్సరే, చాంద్రసౌరమానాభ్యాం .... నామ సంవత్సరే, .... అయనే, .... ఋతౌ .... మాసే .... పక్షే .... శుభతిథౌ, .... వాసరే శుభవాసరే శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవంగుణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్/శ్రీమతి .... గోత్రః/గోత్రా .... నామధేయః/నామధేయా శ్రీమతః/ శ్రీమత్యాః .... గోత్రస్య/గోత్రాయాః నామధేయస్య/నామధేయాయాః ధర్మ పత్నీ సమేతస్య / సభర్తృకాయాః సహకుటుంబస్య / సహకుటుంబాయాః మమ క్షేమ, స్థైర్య ధైర్య, విజయ, అభయ, ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం,

ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం ఇహజన్మని జన్మ జన్మాంతరేషుచ మనోవాక్కాయకర్మభిః జ్ఞానతః అజ్ఞానతః మయాకృత సర్వపాప క్షయార్థం శ్రీవిశాలాక్షీ అన్నపూర్ణ సమేత శ్రీకాశీ విశ్వేశ్వర దేవతా ప్రీత్యర్థం మహామణికర్ణికా / భాగీరథీ స్నాన మహంకరిష్యే.

***శ్రీ విశాలాక్షీ అన్నపూర్ణాసమేత శ్రీవిశ్వేశ్వర చరణారవిందార్పణ మస్తు.***

## స్కాంద పురాణం - ఫలశ్రుతి

మాహేశ్వరఖండం, వైష్ణవఖండం, బ్రహ్మఖండం, కాశీఖండం, అవంతీ ఖండం, నాగర ఖండం, ప్రభాసఖండం అనే ఏడు ఖండాలతో 1471 అధ్యాయాలతో 81000 శ్లోకాలతో నిండిన ఈ స్కాందపురాణం పరమ పవిత్రమైనది. ఎన్నో దివ్యక్షేత్రాల, తీర్థాల చరిత్రల్ని వాటి మహాత్మ్యాల్ని వివరించేది. ఇదొక ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వం.

ఈ పురాణ పఠనం చేసిన వాడు, శ్రవణం చేసినవాడు సకల పాపాలనుంచీ విముక్తి పొందుతాడు. ఇందులో ప్రతి అక్షరం మహేశ్వరతత్త్వాన్ని ప్రబోధిస్తుంది. ఈ పురాణంలో శివధర్మాన్ని సాక్షాత్తు స్కందుడే స్వయంగా వివరించాడు. పరమపవిత్రమైన ఈ స్కాందపురాణాన్ని స్వయంగా వ్రాసిగానీ ముద్రించిన గ్రంథాన్ని గానీ మాఘపూర్ణిమనాడు బంగారు త్రిశూలంతో కలిపి (యథాశక్తి దక్షిణతో) యోగ్యుడైన విప్రుడికి దానం చేయాలి. అలా చేసినవాడికి శివలోక ప్రాప్తి కలుగుతుంది.

**స్వస్తి**

**సర్వేజనాః సుఖినోభవన్తు**



